శ్రీరస్తు.

# నలచరిత్రము.

## ద్విపదకావ్యము.

చక్రపురి రాఘవాచార్యకవికృతము.



చెన్నపురి:

విళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1916

శ్రీ ర స్తు.

# న ల చ రి త్ర ము

## ప్రథమాశ్వాసము.

---

### పీఠిక.

సలలిత సౌరాంధ్ర శబ్దసంగతుల
వల నొప్పు నలచక్రవర్తి చరిత్ర
విరచింతు నా నేర్పువిధ మెల్లఁ దెలియఁ
గర మొప్పఁ దత్కథాక్రమ మెట్టి దనినఁ
రమపావనుఁ డైన పాండునందనుఁడు
ధర నెల్లఁ గల్లజూదంబున నోడి
కౌరవాగ్రజుపాలుఁ గావించి దైవ
ఘోరాటవులకుఁ బోకుచు నేగి యచటఁ
సతమ్ములును దాను దనకూర్మిసతియు
మునివేషములఁ దాల్చి మోదంబు దక్క
విహరించు చుండిరి విధివశంబునను
మహిమతోడను భూతి మై నిండ నలఁది
యురు దైనరుద్రాక్షహారము ల్వేసి
యురవు కెంజడ లెల్ల నొగిఁ జుట్టుఁ గట్టి
పరఁగఁ గృష్ణాజినాంబరము ధరించి

కరమునఁ జె న్నొందఁ గాఁ గమండలువు
ధరియించి జప మొన్న దండఁ జే నుంచి
పరువడి వరయోగపట్టె ధరించి
ఘనతరంబుగఁ బాదుకలు వేడ్క మెట్టి
మునినాథు లిరు పార్శ్వములఁ గొల్చి రాఁగ 2
నరు దార బృహదశ్వుఁ డను మునీశ్వరుఁడు
గరుణతో వేంచేయఁ గాఁ జూచి పాండు
తనయుండు దమ్ములు దానును వేగ
చనుదెంచి యెదురుగా సంయమీశ్వరుని
చరణాంబుజములకుఁ జయ్యన మ్రొక్కి
యురుదుగా నర్ఘ్యపాద్యాదిసత్కర్మ
వితతులఁ బూజించి వినతులు సేసి
యతి భక్తిఁ గొని వచ్చి యర్హాసనమున
నునిచి చేతులు మోడ్చి యురుతరభక్తి
ననియె న మ్మునితోడ నారాజవిభుఁడు
పరమయోగధ్యాన పావనజ్ఞాన
చిరదయానిధి మీకు సేమమే యనిన
విని మునీంద్రుఁడు ధరావిభున కిట్లనియె
జననాథ నీవంటిసత్యసంధుండు
గలుగుట సేమంబు గలుగును గాక
యిల శ్రమమ్ములు మించి యేటికి వచ్చు

ధరణీతలేశ నీతమ్ములు నీవు
పరిణామమే యని పరికించి యడుగ
మనమునఁ జింతించి మఱి పాండుసుతుఁడు
తన మది మెచ్చి య త్తపసి కి ట్లనియె
దేవ దయాసాంద్ర దేవేంద్రవంద్య
యీ వేళ మా సౌఖ్య మే మన వినుము
కపటజూదంబునఁ గౌరవేంద్రునకు
విపులసంపద లెల్ల విడువంగఁ గలిగె
అది యాది గాఁగ నీ యారణ్యభూమి
ముద మెల్ల దక్కి యా ముదితతోఁ గూడి
తమ్ములు నేనును దపసివేషంబు
నిమ్ముల ధరియించి యి ట్లుండఁ గలిగె
నాఁకటి వేళకు నన్నంబు లేక
యాకులఁ గాయల నరసి భక్షించి
దిన మొక్క యేఁడుగా దీనత నొంది
యెనసి యీయడవిలో ని ట్లుండఁ గలిగె
పఱతెంచి యష్టదిక్పతులను నైన
ధరలోన సాధింపఁ దగినసోదరులు
శూరత్వమును మాని సుఖముల డించి
ఘోరాటవులలోనఁ గూర్చుండ వలసె
ద్రుపదనందన యిట్టిదుర్దశ నొంది

విపులశోకంబున వేగింపఁ గలిగె
చిత్రశయ్యల యందుఁ జెలఁగి నిద్రించి
పత్రశయ్యల యందుఁ బవళింపఁ గలిగె
సంగీతవిద్యాఘోషంబు లాలించి
సింగంపుఁగూఁతకుఁ జెవి యొగ్గఁ గలిగె
నలు వైనసింహాసనమునఁ గూర్చుండి
కొలఁది కెక్కఁగ ఱాలఁ గూర్చుండఁ గలిగె
ఆరామసీమల నలరి వర్తించి
యారణ్యసీమల నడలంగఁ గలిగె
జాతిగంధము మేన సంవితోఁ బూసి
పూతిగంధము మేనఁ బూయంగఁ గలిగె
ఇటువంటిసుఖముల నిర వైతి మయ్య
కట కటా దయ లేక కౌరవాగ్రజుఁడు
ఎఱుఁగక యిటు చేసె నే మన వచ్చుఁ
బరమయోగీన్ద్ర నా భాగ్య మి ట్లుండెఁ
బుట్టి పోయినవారు పుట్టినవారు
పుట్టఁ బోయెడువారు భూలోకమునను
దాయాదివారిచే ధర నెల్ల నోడి
పోయి మావలె వనభూమిలో నిట్లు
పొంది యీవెతలను బొందనవార
లెం దైనఁ గలరె మీ రెఱిఁగినయెడల

వనవుడు మునిచంద్రుఁ డారాజుఁ జూచి
ఘనకృపారస మొలుకంగ ని ట్లనియె
ఇది యేమి జననాథ యింతగా నీవు
మదిలోన ని ట్లాడ మఱచితే నీతిఁ
బో పొమ్ము మఱి యేమి బుద్ధులు మీరు
ప్రాపించి చింతింపఁ బని లేదు వినుము
తొల్లిఁ జేసినయట్టిదుష్టకర్మములు
నెల్లఁ బొందక విధి యేలఁ బో నిచ్చు
కమలారిధరునకుఁ గమలగర్భునకు
కమలేశునకు శతక్రతునకు నైనఁ
గొన్నాళ్లు దుఃఖంబు గొన్నాళ్లు సుఖము
గొన్నాళ్లు లేమియుఁ గొన్నాళ్లు కలిమి
వసుమతి సమముగా వర్తించు చుండు
వసుమతీశ్వర యింత వగ పేల నీకు
అదిగాక యే దుఃఖ మందితి రిలను
ముద మొప్ప మావంటిమునులు మీకడకుఁ
జనుదెంచి నిత్యము సకలశాస్త్రములు
వినిపించెదరు మీకు వే ర్వేఱ నింకఁ
దమ్ములఁ బాసితో తరుణిఁ బాసితివొ
సమ్మతి కాని వేషమును జెందితివొ
కరిపురంబున నీవు క్రమముతో నున్న

వరుసతో నచటికి వత్తుము మేము
పుణ్యవేళలయందుఁ బుణ్యతీర్థములఁ
బుణ్యుఁడై క్రుంకుచుఁ బుణ్యముల్ సేసి
పితృవేళలందును బితృకాలములను
నతిభక్తితోఁ జేసి యఘములు ద్రోచి
యిటువంటిసుఖముల కిరవు గా నుండి
కట కటా నీవు శోకముఁ జెందఁ దగునె
వసుధ నాపద బడ్డవారలలోనఁ
బొసఁగ నే యాపదఁ బొందితి విప్రుడు
జననాథ నీ కింత సంతాప మేల
వినుము చెప్పెద నీకు విశదంబుగాను
అవనిలో నలనాముఁ డగుమహారాజు
ప్రవిమలసత్యసంపన్నుండు ఘనుఁడు
వినుతి కెక్కినబాహువిక్రమోన్నతుఁడు
వినయభూషణుఁ డతివిమలమానసుఁడు
గురుభక్తినిరతుండు గుణవిశారదుఁడు
కరుణాపయోనిధి గాంభీర్యఘనుఁడు
ధరణి షోడశమహాదానవినోది
యరు దైనసకలశాస్త్రార్థకోవిదుఁడు
చిరపుణ్యమతి వీరసేనునినుతుఁడు
దరణివంశజుఁడు కందర్పసన్నిభుఁడు

నురుపమవిజయుండు నిషధేశ్వరుండు
పరమపావనుఁడు శ్రీపతిభక్తియుతుఁడు
సురరాజనిభుఁడు భూసురవర్ణనీయుఁ
డరిబలగహనమహానలుం డగుచు
నిల నేడు దీవుల నేలెడురాజు
వల నొప్పు పుష్కరవసుధీశుతోడ
నవనీశ నీవలె నన్యాయ్యజూద
మవిరళంబుగ నాడి యట మోసపోయి
పురవరం బెడఁ బాసి భూములఁ బాసి
తురగంబులను బాసి దొరలను బాసి
ఘనరథంబులఁ బాసి గజములఁ బాసి
ధనములఁ బాసి ప్రధానులఁ బాసి
వరపుత్త్రులను బాసి వనితను బాసి
పరమాప్తులను బాసి భటకోటిఁ బాసి
వకలబంధులఁ బాసి సకలంబుఁ బాసి
చకితాటవుల కేగి చామతోఁగూడి
కట్టఁ బుట్టము లేక కాంత పైకొంగుఁ
గట్టుక నడవిలోఁ గడు దుఃఖ మంది
యాఁకలిచేఁ జాల నలజడిఁ బడుచు
నాకులు కాయలు నలము భక్షించి
కలిరాజు పన్నినఘన మైనమాయఁ

దెలియ కిద్దరు రెండు తెరవులఁ బట్టి
తరళాక్షి నెడఁ బాసి ధరణీశుఁ డడల
ధరణీశు నెడఁ బాసి తరళాక్షి యడల
తమ్ముఁ గొల్చినవారిఁ దాము సేవించి
యిమ్ముల నుండిరి యిలఁ గొంత కాల
మరిగినపిదప యాహారిక్పపచేత
నురురాజ్యసుఖమున నుండిరి తొల్లి
అందు సహస్రాంశ మైనను గలదె
యిందువంశజ నీకు నెనసిన కష్ట
మనవు డత్యాశ్చర్య మంది యా రాజు
ఘనభక్తి మునిరాజుఁ గనుఁగొని పలికె
వరమునినాథ నావలె నరాధిపుఁడు
ధర నెల్ల గల్లజూదంబున నోడి
యిటువంటి యడవికి నెబ్బంగిఁ బోయెఁ
దటుకున నిట్టి జూదంబులు మున్ను
గలిగి యుండుటఁ బూనెఁ గౌరవాధిపుఁడు
తలఁచి పల్కరు దూరఁ దగ దింక నలుని
చారిత్రమంతయు సాంగంబుగాను
గారవంబున వినఁ గడు వేడ్క పుట్టె
వినిపింపు మనిన భూవిభుఁ జూచి మౌని
తన మదిలో బృహదశ్వమహర్షి

యానందమును బొంది యం దంద మెచ్చి
ధ్యానించి నలుని సత్కథఁ జెప్పఁ దొణగె.

---

# ప్రథమాశ్వాసము.

## కథారంభము.

"కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ,
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్"

నిరుపమగతి నొప్పు నిషధాపురంబు
అరయఁగ నుతి కెక్కు నట్టిపట్టణము
శ్రీకరనవహేమచిత్రగేహములు
ప్రాకారగోపురప్రాసాదతతులు
కనకంపుమేడలు ఘనమంటపములు
వినుతింపఁ దగినట్టివిపణిమార్గములు
కోటలయట్టళ్లు కొలువుకూటములు
నాటకశాలలు నళినదీర్ఘికలు
కేళికావనములు కృతకాచలములు
బాలానిలంబులు బహుపుష్పములును
మహనీయదేవతామండపంబులును

బహుచిత్రగతులచేఁ బరఁగుహర్మ్యములు
శృంగారవనములు సెజ్జకుఁదోఁటలును
సంగీతనిలయముల్ సరసులు మఱియు
రంగు మీఱినయట్టిరజతశైలములు
చెంగావి టెక్కెముల్ చిత్రశాలలును
కోమరారు ముత్యాలగొడుగులు మఱియుఁ
గమనీయవజ్రసంగతకవాటములు
వారణశాలలు వాజిశాలలును
మేరుశైలముకన్న మించు తేరులును
పచ్చతోరణములు బహువిలాసముల
నచ్చుగా గొప్పముత్యములముగ్గులును
విమలభూషణముల విహరించుహరులు
నమరభూజములతో నమరినతరులు
వారాశి కరవైనవరతటాకములు
చారురత్నంబులసౌధవాటికలు
వేదశాస్త్రపురాణవిద్య లన్నిఁటికి
యాదియై వర్తించునట్టిభూసురులు
రాజులు బలపరాక్రములు రాహుతులు
భూజననుతులైనబుధులు బాంధవులు
ధనదునిపురినైన ధరయెల్లఁ జూఱ
కొని దాచఁగలవైశ్యకోటి చెన్నొంద

హరిభక్తియుతు లైనయట్టిశూద్రులును
సరసులు సత్కవీశ్వరులు పాఠకులు
గాయకులును వారకాంతాజనంబు
గామితార్థము లెల్లఁ గలుగు సంగళ్లు
నానావినోదముల్ నడుపునాటకులు
మానితపతిభక్తిమతు లైనసతులు
షదమున మించినమగలును మిగుల
మదగజంబుల నిల్పుమల్లులు గలిగి
పురుహూతుఁ డేలినపుర మొకో యనఁగ
ధరణిదేవికి ముఖదర్పణం బనఁగ
పురముల కెల్లను భూషణం బగుచు
నిరుపమగతి నొప్పు నిషధాపురంబు
ఆపురాధీశ్వరుం డమలమానసుఁడు
భూపాలచంద్రుండు భుజబలోన్నతుఁడు
గర్వితరిపుగజకంఠీరవుండు
సర్వజ్ఞుఁ డత్యంతసాహసోన్నతుఁడు
నాకేశనుతకీర్తి నలచక్రవర్తి
యేకచక్రంబుగా నేలుచు నుండె
వారక నెల మూడు వర్షముల్ గురియు
జారులు లే రనాచారులు లేరు
విరసంపుఁ దిరిపెంబు వెతకిన లేదు

పరుసతోఁ గలహించువారును లేరు
అంగహీనులును లేరరసి చూడఁగను
అంగజాకైవడి నమరి యుండుదురు
నూఱు మాడలకు మున్నగ నూక వడ్డి
యేరు కిర్వదినాలు గెద్దులు దున్న
పదిపాళ్ల కొకపాలు పార్థివేంద్రునకుఁ
గొదువ తొమ్మిదిపాళ్లు గొనుఁ బంటకాఁపు
ఒలయుచుఁ బుట్టికి నొకనూక పన్ను
గలిగి వర్తించునాకాలంబునందు
ఇల నవగ్రహదోష మెన్నఁడు లేదు
పలుమాఱు దున్నక పండు సస్యములు
గోవులు పితుకక కురియుచు నుండు
నేవేళ భూమి పాలేరులు గలిగి
కూర్మిసస్యంబులఁ గూడి రహించు
ధర్మము నాల్గు పాదమ్ముల నడుచు
హరిహరబ్రహ్మలు నద్భుతం బంద
హరువుగా నేబదియాఱు దేశముల
ధరణీశ్వరులచేతఁ దగినకప్పముల
నిర వొందఁ గైకొని యిల నేడు దీవు
లెఱుక గాయకపురోహితులు నాశ్రితులు
పరమపావను లైనబ్రాహ్మణోత్తములు

మతిమంతు లైనట్టిమంత్రిపుంగవులు
నతిభక్తితోఁ గొల్వ నావిష్ణుచక్ర
మరయుచుఁ బంపు సేయఁగ నలాధిపుఁడు
చిరలీల రాజ్యంబుఁ జేయుచు నుండె
అంతట నాదేశమం దొక్కయెద్దు
వింతగా నడవిలో విహరించుచుండఁ
గనుఁగొని యొక్కవ్యాఘ్రము నోర్వ లేక
మనమునఁ గోపంబు మల్లడి గొనఁగఁ
బలికె నోహో యింత భయమును లేక
వెలయ నాయడవిలో విహరించు టెట్లు
చెలరేగి యేను గర్జించితి నేని
యిల మృగసంఘంబు లెల్ల భీతిల్లు
నీబాహుబల మెంత నీవాగ లెంత
నాబాహుబలిమికి నరు లెంతవారు
కలఁగక నన్నింత గైకొన కీవు
నలరెదు బలి వైతె యందుల కేమి
ధారుణి నలునిమిత్తంబునఁ గాదె
యీరీతి గర్వించి రిది యెంత నాకు
నలరాజుసత్య మెన్నాళ్లు వర్ధిల్లు
నిల నిట్టిరాజేంద్రు లెందఱో తొల్లి
ఏలి పోయినవార లీనలుం డెంత

కాలంబు రాజ్యభోగమున వర్తించు
ఏవిధంబున నైన నే నిన్నుఁ బట్టి
వావిరి నాగోళ్ల వడి డొక్కఁ జించి
గొబ్బునఁ గుత్తుకఁ గొఱికి రక్తంబు
నుబ్బుచు మఱిఁ గ్రోలకున్న నేఁ బులికిఁ
బుట్టినవాఁడనే పొందుగా నీకుఁ
బుట్టినవాఁడ నమ్ముము మహోత్కృష్ట
అని యిట్లు పులి వల్క నంతలోపలను
ఘనగిరు లదర దిక్కరులెల్ల బెదర
సుర లరు దంద రక్షోతతి గుంద
నరులు చింతిల్లఁ గిన్నరులు భీతిల్ల
దివిజులు వెరగంది దివినుండి చూడ
భువియెల్లఁ గదల నంబుధు లెల్లఁ గలఁగఁ
బెనుపర్వుతోడ గంభీరంబుతోడ
వినువీథిఁ బరతెంచి విస్మయంబుగను
సరగున నావిష్ణుచక్రంబు తొల్లి
కరిఁ గాచి నక్రంబు ఖండించినట్లు
తక్కక వ్యాఘ్రంబు తలఁ ద్రుంచి వైచి
గ్రక్కునఁ గమలాక్షుకడకు నేతెంచె
అటుగాన నారాజు నతులసత్త్వమునఁ
బటుగతి దోషముల్ పలుకంగ నీక

యతివేడ్క రాజసూయాశ్వమేధాది
క్రతువులు చేసియుఁ గమలాసనాది
దేవతు లెల్లఁ గీర్తింప శోభిల్లి
యీవిధంబున జగం బేలుచు నుండె
అంతటఁ గొన్నాళ్ళ కతిచిత్రముగను
సంతతగతిని వసంతకాలంబు
సనుదెంచె మందారజంబీరములును
పనసపిప్పలనింబపారిభద్రములు
చందనపున్నాగసహకారములును
కుందకురంటకకోవిదారములు
లుంగలవంగమాలూరవృక్షములు
సంగతఖర్జూరచంపకంబులును
సురపొన్నలును మంచిచూతపోతములు
కురవకంబులు గేదఁగులు నశోకములు
ఫుల్లమామిళ్ళు కర్పూరభూజములు
నల్లని యరఁటులు నారికేళములు
నారదపాటలినాగతింత్రిణులు
గోరంట లరఁటులు కుటజభూరుహము
లాదిగాఁ గలిగిన యారామభూమి
పాదుగా నప్పు డేర్పడుపంగనాకు
రాలి యొక్కట నతిరమ్యమై యుండె

యాలోనఁ జిగురించె నంతలోఁగానె
పూచి ఫలించె వృక్షాదిఁ జల్లగాలి
వీచె నేలను వ్రాలె వింతవింతగను
పలుమాఱుఁ బలుమాఱుఁ బచ్చవిల్తుండు
అలరువువ్వులతూపు లందంద నేయఁ
బవడంపుఁ జాయఁ జొప్పడు నాసికమును
నవహేమమయ మగునవ్యపక్షములు
విమలస్వరంబును విమలనేత్రములు
నమరంగ ధవళమయుం బగు మేను
నరుదుగాఁ గనుఁగొని యవనీశ్వరుండు
సరసతఁ జేయువసంతునిపూజఁ
గడువేడ్కతోఁ జూడఁగా వచ్చె ననఁగ
నుడుతతి దివి నుండ నొల్లక యిపుడు
వసుమతిపై నుండ వచ్చెనో యనఁగఁ
బొనఁగ నంబరలక్ష్మి పూనుముత్యాల
హారంబు జాఱెనో యవనికి ననఁగ
క్షీరాబ్ధితరఁగలచెన్ను వహించి
యాకాశముననుండి హంసలపిండు
భూకాంతుముందటఁ బొదలుచు వ్రాలె
వ్రాలినఁ జూచి భూవరుఁడు హర్షాబ్ధిఁ
దేలుచు నవుడు మంత్రికి నిట్టు లనియె

నెందుండి వచ్చెనో యీ రాజహంస
లందంబుఁ జూచిన నతివేడ్క పుట్టి
నొకయంచఁ బట్టుక నూరక మనము
నకలంకగతిని ముద్దాడుద మనుచు
నతివేడ్క లేచి యయ్యంచలకడకుఁ
గుతలేశుఁ డేగిన గొబ్బున నెగసి
యవ్వల వ్రాలిన నవుడు పోనీక
యెవ్విధంబున నైన నేఁ బట్టెద నని
కదిసి మిక్కిలి కుతుకం బుల్లసిల్లఁ
బొదలినమతిఁ బొంచిపొంచి పోవంగఁ
గని పక్షు లన్నియుఁ గడు భీతి నొంది
చని యొకమ్రానిపైఁ జయ్యన వ్రాలె
వానిసంగతిఁ జూచి వసుధేశ్వరుండు
వీనిఁ బట్టఁగ నెది వెరవింక మనకు
తలకక తొలఁగక తనరెడునేర్పుఁ
దొలఁగక మ్రానెక్కి తోలుము నీవు
పనుపడ నే నట్టె పట్టెద ననుచు
ననిన నాసచివుండు నాభూజ మెక్కి
యనురక్తిఁ బక్షుల నదలింప నవియు
మనమున బెదరుచు మహిమీఁద వ్రాలె
వ్రాలినఁ గనుఁగొని వసుమతీశ్వరుఁడు

పాలించి తనమంత్రిపతిమోముఁ జూచి
దిగి వచ్చి నీ వొకదిక్కుననుండి
తగిలినపులుఁగుల దయతోడఁ బట్టు
మనవు డాభూరుహ మాతండు డిగ్గి
గొనకొని యొక్కదిక్కుననుండి దండి
యనురక్తిఁ బక్షుల కడ్డమై నిలువ
మనుజేశ్వరుఁడు వాని మఱి పోనీక
అల్లనల్లన మహి నరుదెంచి పొంచి
మెల్లనె యొకదాని మెడఁ బట్టుకొనియె
కడువేగమున లేచి కడమ రాయంచ
లడలుచు నొకభూరుహంబున వ్రాలె
చెలువొంద నలరాజుచేఁ జిక్కువడ్డ
పులుఁగులరాజు సొం పుడిగి భీతిల్లి
పలుమాఱు దలపోసి భావంబులోనఁ
గలఁగుచు మేము నిక్కడికి నేతెంచి
తటుకున వీనిచేఁ దగులంగఁ గలిగెఁ
గటకటా యీరీతిగాఁ జేసినట్టి
బలువైన నాప్రాఁతఫలము నే మందుఁ
జలమున నను రాజసంబున నృపతి
యేమేమి సేయునో యెఱుఁగంగ రాదు
ఏమైన మే లింక నేమనవచ్చు

అని హంస చింతచే నడలఁగా నాతఁ
డనురక్తితో రాజహంసను జూచి
కొనగోర దువ్వి మక్కువ ముద్దువెట్టి
యొసరంగఁ గన్నుల నొత్తి లాలించి
యక్కునఁ జేర్చి తియ్యనిమాట లాడి
చెక్కిలి నొక్కి మచ్చిక సేయు చుండె
కనుఁగొని సంతోషకర మగునట్లు
మనుజేశుతో వచోమధురతఁ బలికె
అవనీశ దమయంతి యనియెడు కాంత
నువిదఁ జేసెద నీకు నొగి నన్ను విడువు
తగు నీకు దమయంతి దమయంతి కీవు
దగుదువు నామాట దబ్బర గాదు
సారసభవుఁడు నీ సౌందర్యమునకు
బోరన భువి దానిఁ బుట్టించె మున్నె
ఏ గతి నైన నా యింతిని జేతు
భోగదేవేంద్ర నీపాలిటఁ జేసెదను
తలకొని యీవేళఁ దగినట్టిమాటఁ
బలికి పోఁ జూచెడి పక్షిని గాను
ఈ పక్షిచేత నీ వే మా నటంచు
భూపాలచంద్ర నీ బుద్ధి నుంచకుము
నీ చక్కఁదనమును నీ విలాసమును

నా చకోరాక్షికి నమరు భూనాథ
నా మాట నిజముగా నమ్ముము మదిని
గామిని నీ సొమ్ముగాఁ జేయ నేర్తు
దమయంతి నీ చక్కఁదనమును దలఁచి
సుమబాణవేదన సుక్కి యుండియును
నీ పాదపద్మముల్ నిరతంబుఁ గొలువ
నా పద్మగంధిని సతివఁ జేసెదను
కమలాక్షునాన నా కన్నులయాన
దమయంతి నీ యింతి తప్ప దీమాట
నావుడు మోద మంది నరలోకనాథుఁ
డావేళ నాశ్చర్య మంది యా పక్షి
నతివేగ విడిచి నెయ్యమున నిట్లనియె
నతివేడ్కతోడ నీ వాడినమాట
వినఁగ నా చెవులకు విం దయ్యె నేఁడు
నెనయ నా దమయంతి నేగతి నీవు
నెఱుఁగుదు విలలోన నేరాజపుత్త్రి
తెఱఁగొప్ప నవనిలోఁ దిరిగెదు మీరు
రాజకన్యకల వర్తన మెఱుంగుదురె
రాజహంసోత్తమ రమణీలలామ
నెలమి నా యింతిగా నెట్లు చేసెదవు
తెలియంగఁ జెప్పుమా తెఱఁగెల్ల మాకు

హంసరూపంబున నరుదెంచి మున్ను
కంసారి జలజాక్షిఁ గరుణించినట్లు
హంసరూపంబున నతివేడ్క నాకు
హంసయానను గూర్ప నరుగుదెంచితివొ
పాలును నీరు నేర్పఱుపంగ నేర్చు
పాలిన పక్షిరాజవు గానె నీవు
మనుజభాషలరీతి మహిలోనఁ బక్షు
లెనయంగఁ బలుకునే యెచ్చట నైన
పక్షివి గావు నాపాలిదేవతవొ
యీక్షితిలోన నా యెలనాగజనన
మంతయు నెఱిఁగింపు మనవుడు పక్షి
వింతగా నారాజవిభున కిట్లనియె
ధరణీశ వినుము విదర్భపురంబు
గర మర్థి జగతిఁ బ్రఖ్యాత మై యుండు
ఆపురాధీశ్వరుఁ డమలమానసుఁడు
భూపాలచంద్రుండు పుణ్యావర్తనుఁడు
భీమభూపాలుఁ డభేద్యుఁ డుత్తముఁడు
శ్రీమించ రాజ్యంబు సేయుచు నుండె
ధరణీశ్వరునకు సంతానంబు లేక
ధరణీసురార్చనఁ దప్పక చేసి
తపములు జపములు దగినదానములు

నుపవాసములు పెక్కు లొనరించి యలసి
కడ లేని దుఃఖసాగరమున మునిఁగి
పుడమిఱేఁ డాస్థానమునకు నేతెంచి
అరుదైనరత్నసింహాసనోపరిని
నిర వందఁ గూర్చుండి హితపురోహితుల
గాయకవందిమాగధమంత్రివరుల
నాయతమతిఁ జూచి యప్పు డిట్లనియె
వినుఁడు సంతాన మేవిధమునఁ గలుగు
నని భూసురావళి నఖిలదానముల
నొనరించితిని మఱి యుచితమార్గమునఁ
దనరి యెందులను సంతతి లేకపోయె
ఇరవంద సంతానహీనుఁ డైనట్టి
నరునకు దూర మా నాకేశపదవి
సుతులను బడసినఁ జూచి యందందఁ
బితృదేవతలును సంప్రీతిఁ బొందెదరు
వసుధ నీతనువు నెవ్వరు నమ్మినారు
పొసఁగినయీరాజ్యభోగంబు లేల
మనమారఁ దనయులమధురవాక్యముల
వినఁగ నేర్చినయట్టివిమలాత్ములకును
వీణామృదంగాదివివిధస్వరములు
వేణునాదము లైన విన నింపు గావు

విడువ కిప్పుడు మునివేషంబు దాల్చి
తడయక యిపుడు సంతానార్థి నగుచుఁ
దరుణితోఁ గూడుక తపమున కరిగి
పరగంగఁ బుత్త్రులఁ బడసి వచ్చెదను
మంత్రికోవిదులార మహిమ నారాజ్య
తంత్రంబు నడపుఁడు తగ నేను వచ్చు
నందాఁక యని పల్కి యువుగు భూసురుల
నందఱ రావించి యతిభక్తి మ్రొక్కి
భటపరిచారకప్రకరంబులకును
దటుకునఁ దనదువృత్తాంతంబుఁ జెప్పి
పుడమిఁ గాపులకు నేర్పడ బుద్ధి సెప్పి
పడతియుఁ దానును బరమహర్షమునఁ
జెలువు మీఱఁగ నారచీరలు గట్టి
తెలిభూతి మైనిండఁ దిరముగా నలఁది
కురు లెల్ల జడలుగాఁ గూడంగఁ జేసి
పురమువా రెల్ల గుంపులు గట్టి చూడ
యూరా యనంగ ఘోరారణ్యమునకు
ధారుణీభర్త మోదంబున నరిగె
ఫలములు దళములు భక్షించి కొండ
బిలముల విలసిల్లి భీతిల్లి యిట్లు
కొన్నిదినంబులు ఘోరాటవులను

గ్రన్నన విహరింపఁగా నొక్కనాఁడు
తనశిష్యులును దాను దమనమునీంద్రుఁ
డనురక్తి మీఱఁగా నచటికి వచ్చె
వచ్చినమునిఁ గాంచి వసుమతీనాథుఁ
డచ్చుగా సాష్టాంగ మప్పు డర్పించి
పలుమాఱు మునినాథుఁ బ్రస్తుతిసేయఁ
దలపున మెచ్చి యాతపసి యిట్లనియె
నెక్కడ విహరింతు రెప్పుడు మిమ్ము
నిక్కాననంబున నెన్నఁడుఁ గానఁ
దలపోసి చూచినఁ దాపసవృత్తి
గలిగియున్నది రాజకళలు మీయందు
నమరియున్నవి మీర లడవిలో నిట్లు
క్రమమున విహరింపఁగా నేల మీర
లెవ్వరో యనిన భూమీశుఁ డాతపసి
కవ్విధం బంతయు నటఁ జెప్పఁ దొణఁగె
తాపసవర్య విదర్భపురంబు
నేపార మీదయు నేలెడువాఁడ
ఈపద్మగంధి నా యింతి యై మెలఁగు
నా పేరు ధర భీమనరనాథుఁ డండ్రు
పరఁగ సంతానసంపద లేక నాకు
ధరణిఁ బాలింపంగఁ దగ దటుగానఁ

దపసి వేషముఁ దాల్చి తరుణితోఁ గూడఁ
దపము సేయఁగ మదిఁ దలఁచి వచ్చితిమి
నావుడు విని మునినాథుఁ డా భీమ
భూవల్లభుని జూచి పొలుపొందఁ బలికె
భూమీశ మావనంబునకు నేతెమ్ము
తామసింపక నేను తపముఁ గావించి
వనజాసనాది దేవతులచే వరముఁ
గొని వచ్చి యిచ్చెదఁ గొదువ లేకుండ
ధరణీశ యంత సంతానంబు వడసి
యిర వొందఁ బురమున కేగుదు గాక
అని తోడుకొనుచు నిజాశ్రమభూమి
కనురక్తిఁ జనుదెంచి యతిఘోరతపముఁ
గావింపఁగా మెచ్చి కంజాతగర్భుఁ
డావేళఁ దనకుఁ బ్రత్యక్షమై నిలువ
మునికులచంద్రుండు ముద మంది బ్రహ్మఁ
గని సన్నుతులు సేయఁ గమలజుఁ డనియె
నిదియేమి మునినాథ యింతగా నీవు
పదపడి ఘోరతపంబు గావింప
నేమి కార్యము వచ్చె నెఱిఁగింపు మనిన
భీమనాముం డనఁ బ్రియశిష్యుఁ డొకఁడు
లోకేశ కలఁడు భూలోకనాయకుఁడు

ప్రాకటం బైనసంపద లెల్లఁ బాసి
సంతతి లేనివిచారంబుతోడ
నింతియుఁ దాను మాయెడ కేగుదెంచె
అతనికి సంతాన మర్థితో నిచ్చి
యతివేడ్క రక్షింపు మనవుడు బ్రహ్మ
పొలుపు మీఱఁగ నొక్క పుత్త్రి పుత్త్రుండు
గల రంచుఁ జెప్పి వేగంబున నరిగె
నంతట దమనమహామునీశ్వరుఁడు
వింతగా భీమభూవిభుని వీక్షించి
కుతలేంద్ర నీ కొక్కకూతురు కొడుకు
నతివేడ్కఁ గల్గుదు రరుగుము పురికి
అనవుడు సంతోష మంది యా రాజు
మునినాథునకు వేడ్క మ్రొక్కి యిట్లనియె
దమనమునీంద్ర నీదయచేత నాకుఁ
గ్రమమున సంతతికలిమియుఁ గలిగె
నని నన్నుతులు సేసి యవనీశ్వరుండు
తనసతితోఁ గూడఁ దనపురి కరిగి
ధర నేలుచున్న నాతదనంతరమున
బరువడి నారాజపత్ని గర్భంబు
ధరియించి ముందఱఁ దనయుని గాంచెఁ
దెఱఁ గొప్ప మఱి కొన్నిదినముల వెనుక

తనయను గాంచె నా తరలాయతాక్షి
జననాథచంద్రుండు సంతోష మంది
దమనాఖ్యుఁ డనుపేరు తనయుని కొసఁగి
దమయంతి యనుపేరు తనయకు నొసఁగి
కొడుకుఁ గన్నను ముద్దుకూఁతురుమీఁద
పుడమిశుఁ డతివేడ్కఁ బొలుపొందుచుండె
క్షీరాబ్ధికన్నియ చెలువందినట్లు
మీఱి భూధరపుత్త్రి మెలఁగుచున్నట్లు
తరుణి వర్తించె సౌందర్యసంపదను
ధరణీశ యిబ్భంగి దమయంతిపుట్టు
వెలుఁగుదు మన్న నే నేగతి నైన
నిరవంద దాని నీ యింటఁ జేసెదను
మానవాధీశ యీ మగువ నీసొమ్ము
నే నాడుమాటల నిజ మని నమ్ము
మని యంచ పలికిన నంతయు రాజు
విని మనంబునఁ జాల విస్మయం బంది
బలువిడి నానందబాష్పముల్ చాలఁ
పలుమాఱు దొఱఁగ నప్పక్షివల్లభుని
జేకొని కౌఁగిటఁ జేర్చి ముద్దాడి
భూకాంతుఁ డప్పుడా పొలఁతి చెంగటకు
నతివేగ పోయి ర మ్మని వీడుకొలుప

శతపత్రములఁ గ్రీడ సల్పుహంసలను
రయమున నాహంసరాజు గూడికొని
పయనమై యాత్రోవఁ బైనంబు నిలువు
సేయక నలుని కాచెలిఁ గూర్చుతలఁపుఁ
ద్రోయక భూమికాంతునిమీఁదిభక్తిఁ
బాయక యాఁకటఁ బడి తమ్మితూండ్లు
మేయక నీడల మెలఁగక వేగ
భూవలయంబునఁ బోలు పొందునట్టి
యావిదర్భపురికి నరుగుచు నుండ
నచ్చట దమయంతి యతివలుఁ దాను
విచ్చలవిడి వనవీథికి వచ్చి
కలయంగ శుకశారికలు మయూరములు
వలుకు చుండఁగ వానిపలుకులు వినుచుఁ
బూచి కాచినమంచిపుష్పవృక్షములు
చూచి యింతులకును జూపి నవ్వుచును
అలరుల తేనియ లంది క్రోలుచును
అలరుపూఁజిగురుల నరసి నవ్వుచును
చల్లనిగాలికి సంతోషపడుచుఁ
బల్లవంబుల నెల్లఁ బరికించికొనెదు
చెలులలోన మిటారి చికిలికటారి
చెలువులవంకి వాసనలపూబొంకి

చెలియ, మేల్బంతి చిత్తజుదంతి
వలపులదొంతి సేమంతిపూబంతి
మరునిపట్టపుఁజిల్క మరువంపుమొల్క
అరుదుపుప్పొడితిన్న యమృతంపుఁగిన్న
కస్తురితావులగావు కళలకు నెలవు
కమ్మతేనియబావి కప్పురంపుఁగ్రోవి
సొగసువజ్రపుఁదళ్కు సొబఁగులబెళ్కు
పగడంపులతకూన పన్నీటిసోన
చిలుకలకొల్కి యాచిగురాకుముల్కి
కులుకు ముద్దులగుమ్మ గొజ్జంగిరెమ్మ
యని చాలఁ గొనియాడ నన్నిటఁ దగిన
వనజాక్షి శృంగారవనములోపలను
గదిసి కెంపులు రవల్ కాంతులఁ జిమ్ము
నుదుటిబంగరుసొమ్ము లొడలందు మెఱయ
జలజలోచను లగుసఖులును గొలువ
నలరుచు దమయంతి యతివేడ్క మేను
తెలియనిగతి వినోదించుచు నుండ
కలహంస లపుడు వేగంబున వచ్చి
రమణులతోడ సంభ్రమకేళి నుండు
దమయంతియెదుట నందము మీఱ వ్రాలె
నెలతచే నడకలు నేర్చుకోఁ దలఁచి

కలహంస లీరీతిఁ గదిసెనో యనఁగ
వ్రాలినయంచల వల నొప్పఁ జూచి
మే లని దమయంతి మెలఁతలుఁ దాను
నప్పుడు కనుఁగొని యాశ్చర్య మంది
యొప్పుల కుప్ప లై యొప్పి చెలంగు
నారాజహంసల నవుడు పోనీక
బోరనఁ దరుముక పోయి యందందఁ
బొలతు లందఱు పొంచి పొంచి పోనీక
చలమున నన్నియంచలఁ బట్టి రంత
ఆరాజనందన యారాజరాజు
కోరి పట్టినయంచ గొబ్బునఁ బట్టి
యక్కునఁ గదియించి యీకాదల నిమిరి
చెక్కిలి నొక్కి మచ్చిక ముద్దువెట్టి
మెల్లన దువ్వుచు మృదులోక్తు లాడ
నల్లనఁ గనుఁగొని యాయంచ పలికె
మానవభాషల మధుర మై యలర
మానిని నీ కొక్కమాటఁ జెప్పెదను
విడువుము నను నీకు వేడుక గలుగఁ
బడతి నీరూపసంపదఁ జూచి నాకు
కడు వేడ్క పుట్టె నిక్కముగ నామదికి
నుడుగక వినుము నీ కొకటి చెప్పెదను

రం గైననిషధపురం బేలురాజు
శృంగారవంతుఁ డూర్జితసత్యధనుఁడు
నరలోకనుతకీర్తి నలచక్రవర్తి
కర మొప్పు విష్ణుచక్రముపంపు చేసి
యిల నేడుదీవుల నేలెడురాజు
నలకూబరునికన్న నసవిల్తుకన్న
సరసిజభవుకన్న జలజాప్తుకన్న
హరుకన్న బలదైత్యహరుకన్న మించి
ధరణిఁ జెన్నొందును దరళాక్షి నీకు
సరి యైనవాఁ డమ్మ సౌందర్యరేఖ
రమణ నేఁ జూడని రాజులు లేరు
రమణిరో యిటువంటిరాజును గానఁ
గలకంఠి నీవంటికామినీమణికి
వెలయుంగ నలరాజు విభుఁడు గావలెను
నాకుఁ జూడంగ నో నలినాయతాక్షి
చేకొను నలుని నీచెలువుఁడు గాఁగ
నలునికన్నను మంచినాథుండు లేడు
నలు వలరఁగఁ బదునాల్గులోకముల
వనిత దబ్బర లాడువారము గాము
కని వచ్చి తెటకు నా కన్నులయాన
వానికిఁ దగు దీవు వర్ణింప నేల

నవునోయి మంచికార్యము చేసినావు
కువలయేశ్వర! నిన్నుఁ గోరినందులకుఁ
బురుషులు గోరుట పాడమిలోఁ గాను
తరుణులు గోరుట తగ దనుమాట
నిజ మయ్యె నామీఁద నేరంబు గాద
యజుఁడును సరివార లందఱిలోన
నగుఁబాటు చేసెనే నరనాథ! నేఁడు
మిగుల మాటలఁ బల్కు మీ కెగ్గు పల్కు
రాయంచపలుకులు రయమున వచ్చి
పాయక మదనుని బారిని ద్రోచి
యరిగిన వెనుక ని న్నన నేల నాకుఁ
బరువడి నాప్రాంతఫల మిట్టి లుండ
నమరాధిపతు లేడ నకట నే నేడ
తముఁ గోరు మని చెప్పఁ దగునె వారలకు
వారికి బిడ్డనై వర్తింతు నిటను
వారికి వరియింప వచ్చు దోషంబు
కుతలేశ! నిను మున్ను గోరిన వెనుక
మతిలోన వేఱొక్కమగని గోరుదునె
నీవె వరింపుము నీవు కాదనిన
వేవేగ ప్రాణముల్ విడుతు నంతటనె
వారును నీవును వరుస మెచ్చెదరు

నా పంకరుహయోని కైన శక్యంబె
యో పద్మనయన నీ కొప్పు నాథుఁడు
పతిఁ గోరి యతివరూపమున జనించు
పతి వానిఁ బొందనిజన్మ మేమిటికి
ఆరాజవరున కిల్లాలవై తేని
యోరాజవదన నీ యునికిఁ దగును
అలివేణి యేగతి నైనను నలుని
నెలయంగ నీ ప్రాణవిభునిగాఁ జేయు
మని యువ్విహంబున నా నలాధిపుని
వెనుకొన్న భక్తితో వేవేల గతులఁ
దలపోసి వర్ణింపఁ దమయంతి యంచ
పలుకుల కానందపరవశ యగుచు
కన్నుల బాష్పాంబుకణములు బొడమి
చన్నుఁ గుబ్బలమీఁద జలజల దొరఁగ
తనమేను పులకింపఁ దల యూఁచి యెంచి
యనురక్తి వీడి నెయ్యమున నిట్లనియె
రాయంచరాజ యా రాజు దేవేంద్రుఁ
డేయెడ నుండు నీ వెట్లెఱుంగుదువు
పులుఁగుల రాజవు భూపాలుఁ డతఁడు
తలపోయ నీకు నాతనికిఁ జట్టలిక
మగతిఁ గలిగె నా కింతయుఁ దెలియ

వేగింబె చెప్పుమా వీనులు దనియ
గనవుడు రాయంచ యాహంసగమనఁ
గనుఁగొని సంతోషకలిత యై పలికె
విను మమ్మ చెప్పెద విశదంబుగాను
జనలోకనుతుఁడు సజ్జనలోకహితుఁడు
భానువంశంబున బలి యైనవీర
సేనున కుదయించి చిరకీర్తి వెలయు
రమణతో నిషధపురంబున నుండి
కమలాయతాక్షుచక్రము పంపు సేయ
నెనయ దీవుల నేడిఁ యేలుచు నుండి
ఘనుఁ డేనుఁ డొకనాఁడు మంత్రులుఁ దాను
వరుసతో శృంగారవనములోపలను
జరియించు చుండ నాసఖులును నేను
భూవిహారాను చెంతకుఁ బోయి వ్రాలితిమి
యామీఁద మముఁ జూచి యా చక్రవర్తి
కరుణారసము నిండఁగా నన్నుఁ బట్టి
కర మొప్ప లాలింపఁగా నామహీశు
చక్కఁదనంబును జవ్వనం బతని
మక్కువనుగుణసంపత్తిభాగ్యమును
జూచి నా మనమున శుభము రెట్టింప
నీ చక్కఁదనమున కిల్లాలు వలయు

నరుచు నీరాజన కనుకూల మ్మైన
వనితఁ దెచ్చెద నంచు వసుధపై నొప్పు
తరుణీమణులచక్కఁదన మెల్లఁ జూచి
పరిపోవ కీచటికిఁ జనుదెంచి నీదు
వరరూపవిభవలావణ్యసంపదలు
పరవిఁ జూడఁగ మాకు సంతోష మాయె
అది గాన నలునివృత్తాంతంబు నెల్ల
విదితంబుగా నీకు వివరించి తిపుడు
నెలఁత యెట్లున్నదో నీచిత్తవృత్తి
తెలియఁగ రాదమ్మ దేవసన్నిభుని
నలుని వరించి మన్ననఁ గాంచి తేని
యలరుచు దావియు నలరిన ట్లుండు
నరలోకమందు నా నరనాథువంటి
నరనాయకులు లేరు నరనాథవృత్తి
కల్లలు పలుక నా కన్నుల యాన
పల్లవపాణి నీ పాదంబు లాన
సత్యంబు నామాట సత్యంబు సుమ్ము
సత్యమే జయ మని సకలయత్నములఁ
బలుకుదు రిలలోనఁ బావనమతులు
దలపోసి చూడు మో తరలాయతాక్షి
యనవుడు మదిరాక్షి యాపక్షిరాజుఁ

గని విస్మయానందకలిత యై పలికె
ఓపక్షిరాజేంద్ర యోదయాసాంద్ర
నాపాలిశ్రీరామనాథుండ వీవు
రక్షింపఁగఁ దలంచి రయమున వచ్చి
యాక్షితీశ్వరుని సర్వమకులాధిపుని
నలరాజచంద్రుని నానాథు గాఁగ
జెలు వొందఁ జేసి రక్షింపవే నన్ను
ఇర వొంద నీ మాట నే జవ దాఁట
నరు దార నా యూప మంతయు రాజ
వరునితోఁ బలుమాఱు వర్ణించి చెప్పి
సరస నీ విచటికిఁ జనుదెమ్ము పొమ్ము
చెలఁగి నీ వింతగాఁ జెప్పుచుండఁగను
తలపోసి యేను నింతకు నొడంబడితి
ఇక నొక్కమాట నీ కెఱిఁగింతు వినుము
ప్రకటితగతి నేను ప్రతిన నొనర్చి
నలునకు మను వొందె నలుఁ డొల్ల ననిన
వెలయ నీ ప్రాణంబు విడుచుట యొండె
ఘనతరబుద్ధిఁ బ్రికరణంబుగాను
బనిఁ బూని పలికితి పడతి నామాట
పూనికతో నన్యభూముల నేలు
మానవాధిపుఁ గూడి మనుదానఁ గానె

యింతేసి పనులకు నెడము గానీక
కంతునిశరములఁ గాసిల్ల నీక
కుసుమాస్త్రకేళికిఁ గుందంగ నీక
వసుమతిపతికి నా వర్తమానంబు
తేటతెల్లంబుగాఁ దెలియంగఁ బలికి
మాటలు నీతిగా మఱి కొన్ని చెప్పి
యేవిధి నైన నాయినకులాధిపుని
వేవేగ నా ప్రాణవిభునిఁ గాఁ జేయు
మని ప్రియవాక్యంబు లందందఁ బలుక
వనితను జూచి యవ్వాలఁ బత్రి పలికె
కలకంఠి నీ వింతగాఁ బల్క నేల
తలప నీ కార్యమంతయు నాది కాదె
వల నొప్ప నలచక్రవర్తికిఁ దగిన
కలికి నెన్నఁడుఁ జూడఁ గలుగునో యనుచుఁ
దలఁచుచు నుందు నో తరలాయతాక్షి
పలుమాఱు నినుఁ జూడ భాగ్యంబు గలిగె
నటుగానఁ బలుమాఱు వడల నేమిటికి
తటుకున నలుని నీధవుని జేసెదను
ఒద్దిక మీ కార్య మొనగూర్చు దనుక
నిద్దుర యేడ దే నెలఁతరో నాకు
వనిత మే మటువంటివారము గాము

మనమునఁ గుందకు మను జేశుఁ గూర్తు
నని చెప్పి తనవారి నందంద విడువు
మని నీవు విరహాగ్ని నడలంగ వలదు
చనుదెంతు మరల నిచ్చటి కంచుఁ దెలిపి
వినువీధి నరిగె నా విహాగేంద్రుఁ డచట
ధరణీశ్వరుఁడు భీమతనయను దలచి
విరులవిల్తుని యంపవేదన కులికి
విరహాగ్నిచే గుంది వేసట నొంది
సురపొన్ననీడ భాసురముగా నొక్క
చలువపూపందిలి సరగ వేయించి
పాలు పొంద పచ్చకర్పూరంబు దిన్నె
పఱపించి దానిపై పన్నీరు సల్లి
పఱపుగా చిగురాకుపాన్పుఁ గావించి
క్రొత్తకస్తురి పున్గు గూర్చినమంచి
మెత్తసిగంధంబు మెయి నిండఁ బూసి
తావిపన్నీటను దడిపినపచ్చ
నేవంతిపూసరుల్ చెచ్చెరఁ బూని
మరువేధ కోర్వక మఱి మఱి కలఁగి
పఱతెంచి యా పాన్పుపైఁ బవ్వళించి
తను వెల్లఁ బొగుల చింతావార్ధి మునిఁగి
తనలోన నిట్లని తలపోయఁ దొణఁగె

[illegible]ంచలు పోయినయంతనుండియును
పంచబాణుఁడు నాకుఁ బగదాయి యయ్యె
ఏమి సేయుదు నింక నిటమీఁద నాకు
కామాక్షికడకు నెవ్వరిఁ బంపువాఁడ
జలజారి భ్రమియింపఁ జాలినముద్దు
నలినాక్షిముఖము నెన్నఁడు చూడఁ గల్గు
[illegible]డుగక తేనియ లొలుకంగ బలుకు
పడఁతితో నెన్నఁడు భాషింపఁ గలుగు
అలివేణితియ్యనియధరామృతంబు
అలతఁ దీరఁగ నెన్నఁ డానంగఁ గలుగు
ముద మొప్ప మదిలోనిముచ్చట దీర
ముదిత యెన్నఁడు నాకు ముద్దిడఁ గలదు
అలర నా చేతులయాసలు దీర
బాలఁతిపాలిండ్ల నెప్పుడు పట్టఁ గలుగు
తనఁ గూడి రతికేళిఁ గాంక్ష లుప్పొంగ
ఉవిద కౌఁగిట నెన్న డుండంగఁ గలుగు
శ్రీనాథ యని యిట్లు క్షితినాయకుండు
పూనక యడవిఁ గ్రుమ్మర నంచఁ దలఁచి
పొరలుచు నెక్కడఁ బోయెనో యంచ
సరసులఁ గాంచనాబ్జంబులఁ గాంచి
[illegible]రగి యంతట నన్ను మదిలోన మఱచి

యొరసి భక్షించుచు నున్నదో యంచ
యమరంగ తా మేగునట్టితోరివలను
దమవారిఁ గని నన్నుఁ దలపదో యంచ
తొయ్యలితో నేర్పుతోడ భాషించి
యొయ్యన వచ్చుచు నున్నదో యంచ
తరమిడి నామీఁద దయ నేగుచుండి
పరువడి యడవిలో బడలెనో యంచ
యేమియుఁ దెలియరా దిందాఁకఁ బక్షి
యేమరి యిచటికి నేల రాకుండు
అని వెచ్చ నూర్చుచు హారమానాథ
యని తలఁచుచు నుండ నవ్వా డా యంచ
సనుదెంచి సఖులతోఁ జయ్యన వ్రాలి
ఘనభక్తి నలరాజుఁ గనుగొని పలికె
నమర నీ యానతి నచ్చోటి కేగి
దమయంతిఁ గనుఁగొని తరలి వచ్చితిని
దానిచక్కఁదనంబుఁ దలఁప నచ్చెరువు
భూనాథ వినుము నేర్పున విన్నవింతు
మెఱుఁగు నీలపునరుల్ మించినకురులు
పరిపూర్ణశశి సోము బడలించుమోము
తిలపుష్పముల చొక్కఁ దెగడెడుముక్కు
నలినాస్త్రువిలుహాళాయల్ నవ్వుకనొ్బమలు

హారిణంబుల జయించునక్షులనంచు
మెఱుఁగుటద్దముఁ బోలు మించుచెక్కిళ్లు
కలరుబింబముఁ గేవి నణగించుమోవి
చెలువు శ్రీకరములు చెలియకర్ణములు
ఘనమైనశంఖంబు గవయుకంఠంబు
కనకంపుఁ దీఁగెఁల గడపు బాహువులు
మృదుపల్లవంబుల మిగులుహస్తములు
ఎదురుకల్వల మీఱు గోరులతీరు
వలుదబంగరుచెండ్లు వనితపాలిండ్లు
చెలులైననీలంపుఁ జిలికి రజంపు
నరువడితోఁ బోరు నువిదనూఁగారు
దరఁ బొన్నపూశోభితము సుమీ నాభి
వసుధ సింగముతోను వాదించుఁ గౌను
ఇసుకదిబ్బలపొందు నెసఁగుపిఱుందు
అరఁటికంబంబుల నడఁగించుతొడలు
మరుని నిషంగసామ్యములు జంఘికలు
కెందమ్మిరేకులఁ గేరుపాదములు
అందంబు తాఁబేళ్ల నడఁచుమీఁగాళ్లు
వనితకు నది యొల్ల వర్ణన గాదు
మనుజేశ నేఁ గొంతమాత్ర మెంచితిని
ఓరాజ తేజంబు నీప్రతాపంబు

నీ రూపవిభవంబు నీ విలాసంబు
నా మదిరాక్షికి నా మదవతికి
నా మోహనాంగికి నా సఖీమణికి
నా పద్మగంధికి నా పుణ్యవతికి
నా పువుఁబోడికి నా గుణవతికి
నా దమయంతికి నంద మొదవును
మోదించి మదిలోని ముచ్చట దీర
వరుస వే విధముల వర్ణించి చెప్పి
తరుణికి నీమీఁదఁ దలఁపుఁ బుట్టించి
చెలిని నీ సొమ్ముగాఁ జేసి వచ్చితిని
నెలమి రాజేంద్ర నీ కిఁక చింత వలదు
నీకుఁ గావలె నంచు నీరజయోని
యాకంజలోచన నవనిఁ బుట్టించె
నింతయు నిజ మని యెంచి భూనాథ
సంతోష మలర రాజ్యము సేయు మనుచుఁ
బలికి హంసము విదర్భకుఁ బోవుతఱిని
దలఁపున నవ్వ డా దమయంతి కన్య
వలుమాఱు నలమహీపాలుని దలఁచి
యలరువిల్తుని పువ్వుటమ్ముల కులికి
ఘన మైనమోహసాగరమున మునిఁగి
తనప్రాణసఖులను దప్పక చూచి

రాయంచ యేలకో రాఁ దడవాయె
నా యువతీమణిఁ జే మనియెనో కాక
పాయక తమజాతిపక్షులఁ గూడి
పోయెనో కొలఁకులఁ బొందెనో లేక
యుపవనంబులలోన నున్నదో యంచుఁ
జలజాక్షి యిట్లు విచారంబు నొంద
నిది మంచిసమయము మీయుంగర మీ వేళఁ
గదిసి నా పనిఁ దీర్పఁ గడువడి ననుచు
తద్విధుఁడై కెంపులరాచిలుక
కమ్మనిపల్లు చెంగల్వనేజయును
జాఁపూబాకు గొజ్జఁగిపెట్టకత్తి
రాల్లుచిలుకలరథముపై నెక్కి
యలరుతుమ్మెదలసైన్యము మున్న నడువఁ
బలుమాఱు పంతముల్ పలుకఁ గోవెలలు
వెలవు మీఱఁ జకోరబలములు గొలువ
మరుఁడు దండెత్తి యా మానినిమీఁదఁ
బలిమునఁ జనుదెంచి సరగునఁ గదిసి
యలరువింటను పువ్వుటలుగు లెక్కించి
కరమునఁ దెగఁ దీసి కలికి వాలిండ్లు
గురి సేసి వడి నేసి కో యని యార్వ
నప్పు డా పూఁబోణి యంతరంగమున

ముప్పిరిగొను తాపమున కోర్వ లేక
ధృతిఁ దూలి మిగులఁ గుందెడి తఱినంచ
యతిరయంబున వచ్చి యతివ కిట్లనియె
ఓ రాజవదన యా యుర్వీశుకడకు
బోరనఁ బోయి నేర్పున నీగుణంబు
భావంబు రూపంబు భక్తియుఁ బ్రియము
వావిరి వర్ణించి వర్ణించి వాని
మనమున దయపుట్ట మాటలఁ జెప్పి
వనిత నీపై మేలువానిఁ గావించి
వచ్చితి నీ వింక వరియింపు మతని
మచ్చిక సకలసామ్రాజ్యవైభవము
లనుభవించుచు నుండు మతివేడ్కతోడ
వనిత మే మింక పోయి వచ్చెద మమ్మ
మఱువక దయ నుంచు మామీఁద ననుచుఁ
బరువడి పలికి యా పక్షులు సనియె
నంత నక్కడ నలుం డతివను దలఁచి
కంతుని శరములఁ గాసిల్లియులికి
యాహార ముడిగి నిద్రాపేక్ష మాని
యా హాఁ బాడుచు హా హా యనుచుఁ
దనలోన దమయంతి దమయంతి యింతి
యనుచుఁ బల్కును వెరగంది చూచుచును

మంత్రులఁ జూడక మహనీయరాజ్య
తంత్రంబు నడుపక తనరెడుకొల్వు
కూటంబునకు రాక కూర్మిఁ జెన్నొందు
హాటకరత్నసింహాసనోపరిని
గూర్మిఁ గూర్చుండక కొలుచువారలకుఁ
జీర్త వంబలము లిప్పింపక జనుల
మనవులు వినక బ్రాహ్మణులకు ధర్మ
మొనరింపక ననుంగు లొసఁగ కప్రంపు
విడియంబు సేయక వేటకై నగరు
వెడలక సంగీతవీణామృదంగ
వాదముల్ వినక చిన్నెలవేశ్య లాడు
ఘన మగునాట్యసంగతిఁ జూడ కాత్మ
దమయంతియతులసౌందర్యంబుఁ దలచి
సముచితగతి నాప్తజనులతో ముచ్చ
టాడక తా నేర్చునట్టిపదంబు
పాడక విరహతాపంబున నలుఁడు
వాడ మొక యేడుగా దీనత నొంది
యొనర వర్తించుచు నుండ నవ్వేళ
దేవోత్తముఁడు మానసమునఁ జింతించి
యుచితవాక్కుల విభు నూరార్చి పలికె
ఓధారుణీతలనాథ నీ విపుడు

తలఁపున దమయంతి దమయంతి యనుచుఁ
బలుమాఱు విరహతాపమునఁ గుందినను
నలి కేఁగి భూజనుల్ నవ్వరే నిన్ను
నరనాథ సామాన్యనరునికై వడిఁ
దరలాక్షిఁ బలుమాఱు దలఁచంగఁ దగునె
వినుము నీవంటిభూవిభునకు నిట్లు
వనితకై ధైర్యంబు వదలింపఁ దగునె
మదిలోన నీ బుద్ధి మఱచి యీరీతి
సుదతికై పలుమాఱు శోకింపఁ దగునె
యిది యెంతకార్యమే నిప్పు డిచ్చోటు
కదలి భీమనృపాలుకడ కేగి యతని
నడిగి యాదమయంతి ననుకూలపఱచి
కడువేగ వచ్చెదఁ గలఁగకు మింక
మచ్చికతో నభామంటపంబునకు
విచ్చేయు మని వేడి విభుని వీడ్కొనుచు
నంతనం బలగ నాస్థానంబుఁ జేరె
నంత నక్కడ రాజహంసలు ననిన
నంతనుండియును భీమావనీశ్వరుని
సంతతిపుత్త్రి భూజననుతగాత్రి
దమయంతి మదనవేదనఁ జెంది కుంది
శమియింప నేరక సంతాప మంది

నలరాజచంద్రుని నరలోకవిభుని
బలుమాఱు పలుమాఱు భావంబులోన
దలపోసి తలపోసి తల యూఁచి మేను
పులకించి పులకించి పొలఁతి మోహించి
తిలకించి తిలకించి తెలియ వర్ణించి
చెలరేఁగి చెలరేఁగి చెలియ వే సొల్గి
వినుతించి వినుతించి నెలఁతలఁ జూచి
వనజాక్షులార నా వల్లభుఁ డిటకు
రాఁడొకో మీ రైన రయమునఁ బోయి
వేఁడుకో రాదె నా విధ మెల్లఁ జెప్పి
తోడుక రారాదె దోసమా మీకు
వేడుక గాదె నా విభుఁడును నేను
కూడఁ బాయక యుండి సురతసౌఖ్యములఁ
గూడి యుండఁగఁ గనుంగొన లేరె వీరు
అకటకటా! నే నింత గాసిఁ జెందంగ
నిటులఁ జూచెదరు మీ రెంత నిర్దయులె
పసి బాల నిటు సేయఁ బాడి గాదంచుఁ
కుసుమబాణుని వేఁడుకోనరమ్మ మీర
లళులకుఁ జెప్పరే యలివేణులార
పొలఁత నీ గతిఁ జేయ నీతి గా దంచు
చెల నొప్పఁ జెప్పరే వడిఁ గోవెలలకుఁ

గలకంఠి నిట్లు వంచఁగా రా దటంచుఁ
బడఁతి నీ గతిఁ జేయఁ బాడియే యనుచు
వడిఁ జక్కోరాప్తుని వారించరమ్మ
కలికి నీ వైఖరిఁ గాఱించ కనుచుఁ
దొలఁగఁత వసంతునితోఁ జెప్పరమ్మ
అని పల్కి హా నాథ! యని మూర్ఛ వోయి
మనమునఁ దెలిసి మన్మథుఁడు నామీఁద
నిటు సేయఁ దనకు నే నేమి చేసితిని
కటకటా! అని లేచుఁ గన్నీరు నించు
చలిగాలి విసరినఁ జాల వడంకు
నలరులు రాలిన నందంద వెఱచుఁ
గడు వేగ లేచి యాకామినీమణుల
తొడలపైఁ బవళించి దుఃఖంబుఁ బెంచు
పతి రాక యిపుడు నా ప్రాణంబు లుండ
నతివలారా' అని యవని మూర్ఛిల్లి
యొకకొంత ప్రొద్దున కొయ్యనఁ దెలిసి
యొకచోటఁ గోరి వే ఱొకచోటఁ జేరు
నొకచెలిపేర వే ఱొకచెలిఁ బిలుచు
నొకపని కనుచు వే ఱొకపనిఁ దలఁచు
నొకమాట లాడి వే ఱొకమాట లాడు
నొకచెలిఁ బట్టు వే ఱొకచెలిఁ దిట్టు

మన్ననఁ దుడిచి యామదిరాక్షి గుబ్బ
చన్నులపైఁ గొంగు చక్కఁగా వైచి
వెన్నున కందంద విరిసి చిక్కైన
నెరికురుల్ కొప్పుగా నిగుడించి తొడల
మఁకువున నిడి ముద్దుమోమున మోము
గదియించి లాలించి కౌఁగిట నుంచి
యిది యేమి నెలఁత! నీ కిటువలె సలత
యిదియేమి చెలియ! నీ కిటువలె సొలయ
నిది యేమి లలన! నీ కిటువలెఁ జలన
మిదియేమి మగువ! నీ కిటువలె వగవ
నిది యేమి వెఱఁగు నీ కిటువలె మరుగ
నిదియేమి వింత నీకిటువలెఁ జింత
యిది యేమి యబల! నీ కిటువలె బడల
నిది యేమి కన్య! నీ కిటువలెఁ జిన్న
యిది యేమి పొలఁతి! నీ కిటువలె యలతి
యిది యేమి భామ! నీ కిటువలెఁ బ్రేమ
యిదియేమి కొమ్మ! నీ కిటువలె నమ్మ
యిది యేమి తరలాక్షి! యింత నీమదికి
నిది యేమి మమత నీ కిటువలె నలత
యిది యేమి మదిరాక్షి! యింత బాలార్చి
యిది యేమి యింతి! నీ కింత విభ్రాంతి

వెఱవకు మావంటి వెలఁదు లుండఁగను
తరలాక్షి నీ కింత తాపంబు దగునె
యని యూరడించి తియ్యనిమాట లాడి
కనుఁగవనీహారకణములఁ దుడిచి
చలువపన్నీరున జలకంబు లార్చి
కలికి గుబ్బలమీఁదఁ గస్తూరిఁ బూసి
యొనరంగ నిట్లు శైత్యోపచారముల
నొనరించి యుండిరి యువిదకు నంత
నాకాశలక్ష్మి కర్ణావతంసంబు
ప్రాకటంబుగఁ జాఱి పడినచందమున
నరుణ మహాకిరణంబు లబ్బింబు లగుచు
తరణి పశ్చిమపర్వతంబున కరిగెఁ
గ్రమమున సాంధ్యరాగము దశదిశల
రమణ శోభిలెఁ దామరలు ముకుళించె
కలువలు సెలఁగెఁ జీఁకటి విస్తరిల్లె
వలవైరి నిత్యోత్సవమునఁ గైదువులు
చిలికించుముత్యాల సేసలో యనఁగఁ
దిలకించి తారలు దివినుండి చెలఁగెఁ
గవఁ బాసి చక్రవాకంబులు కలఁగెఁ
దివిరి గేహంబుల దీపముల్ సెలఁగెఁ
గోరి చకోరపక్షులు సంతసిల్లె

జారచోరులు సంతసము నొందిరంత
సురరాజు దేవి భాసురలీలతోను
ధరియించు కర్పూరతాటంక మనఁగఁ
గలువలు నవ్వఁ జక్కవలు చింతింపఁ
నొంచుచు విరహులు తల్లడింపంగ
ఘనతతోఁ బూర్వపర్వతాగ్రంబు నొందఁ
జనుదెంచెనో యనఁ జంద్రుండు వొడిచె
గాని నెల్లెడఁ బిండి చల్లినయట్లు
నేమఱుఁ దోఁచు మంచివెన్నెల గాయ
నంతలో దమయంతి యతిసౌఖ్యలేక
చింతించి మదనాగ్నిశిఖము నెచ్చెందఁ
బలుమాఱు వెన్నెలబయటికేతెంచి
నెలచల్లదనాలపై నెలఁతె సొమ్మసిలి
తలయెత్తి ద్విజరాజుఁ దప్పక చూచి
నారాజుఁ దలఁచితే ననవాలిరాజు
ననుఁబట్టి యీరీతి నలి నలి సేయఁ
దగు కష్టమే నేమి తప్పుఁ జేసితిని
వలదంచు మీకైన వారింప రాదె
అలరుఁవిల్కాఁడు నీ కల్లుఁడుగాదె
వేవేలగతుల మావెలఁదులు నేను
భావించి పలుమాఱు ప్రస్తుతి సేయఁ

తనజాడ మానఁడు ధర్మమే తనకు
ఒనరంగ మఱి యశోఁ డొక్కఁడు గాఁడు
తుల లేని యుఁ వసంతుండు కోకిలలు
మలయమారుతము కోమలశారికలును
చిలుకలు మొదలుగాఁ జేరి సన్నంత
గలఁచు చుండగఁ దాళఁ గలనె యీ మేను
మగువ గదా! యని మనసున లేక
పగఁ బూనె దేవాదిపౌరుషం బోయి
అని పల్కుచుండంగ నంత కంతకును
పనజారివేఁడిమి వడి మూర్ఛఁ బోయి
తెలిసి దిగ్గన లేచి దివిరాజుఁ జూచి
కలఁగుచు మఱి దయ గలవాఁడ వనుచు
నలరువిల్తునినేఁత లన్నియు నీకుఁ
దెలుప వచ్చితె మంచి తెఱఁగు నీసిలని
నీ వొక్కఁడవె కాదు నీవార లెల్ల
నీ విధమే కాదె యెంచి చూచినను
వేషముల్ సూచిన వేడుక పుట్టు
దోషకారులు గురుద్రోహులు ఖలులు
దురితకర్ములు శివద్రోహులు వారి
వరుస లెంచనిదుష్టవర్తను లంగ
హీనులు మఱి కాంతిహీనులు చెడిన

మేనులు గలిగి యి మ్మేదినిలోన
విరహిణీ స్త్రీలను వెఱపించికొనుచుఁ
గరుణయు లేక రే గాములవలెను
దిరుగుదు రది మహాధీరత్వ మనుచు
వరుసతో నెన్నోటి వారల నెఱుఁగ
రని పల్కి వీరి నొయ్యనఁ జూచినపుడె
ఘనతరంబుగ పాతకమ్ము సిద్ధించు
నని తనతల వంచి యతివలఁ గాంచి
వనజాక్షులార! నా వల్లభు నింక
నెవరు దోడుకవత్తు రేమి సేయుదును
భువి నేను చేసినపుణ్య మి ట్లుండె
అని కొంత గుంది హా! యని దుఃఖ మొంది
మనమున భ్రమయుఁ గ్రమ్మఱ నంతఁ దెలియు
నలుని దలంచుఁ గ్రన్నన సంతసించుఁ
చెలులను బిలుచు రాచిల్కలఁ దలఁచుఁ
గిలకిల దెగడుఁ గోకిలలకు బెగడుఁ
గలకలఁ బలుకు భృంగములకు నలుకు
ముట్టదు వీణియ ముడత సొమ్ములను
బెట్టదు విరిబంతిఁ బెం పారు కేలఁ
బట్టదు తొడుగదు పాటించి రైకఁ
గట్టదు చక్కఁగాఁ గాంచనాంబరముఁ

బూయదు పరిమళంబులు మేన వేడ్కఁ
జేయదు విడియంబు చింతతోఁ గన్ను
మూయదు చెలులతో మున్నటిరీతిఁ
జేయదు చను విట్లు చింతచే నుగుటఁ
దీర్చదు తిలకంబుఁ దెఱఁ గొప్ప గోటఁ
గూర్చదు జలకేళిఁ గూడఁగా సఖులఁ
దీర్చదు చెలులు వాదించినఁ దగవు
పేర్చినవనకేళి విహరింపఁ జనదు
ముడువదు కురులు క్రొమ్ముడి మోవ మలర
విడువదు చెక్కిలి వెస నాను కరము
నొడువదు నలుని నెన్నుటదక్క నొరుని
దుడువదు కన్నీరుఁ దొఱఁగు నేమియును
ఆడదు సరసంబు లబలలతోడ
వీడదు మనమున విభుమీఁదిచింతఁ
బాడదు తా నేర్చుపాటలు మదిని
జూడదు తెరవలతోడ మాటాడ
నీ విధంబున నున్న యింతి వీక్షించి
వే వేగ భీమభూవిభున కీకార్య
మెఱిఁగింప కుంకిన నిది లెస్స గాదు
నరగున నలరాజచంద్రుఁ డిచ్చటికి
దరియ వచ్చినఁ గాని దమయంతి నిపుడు

విరిశరంబుల నేయు వెడవిల్తుఁ డాత్మ
ధను వెక్కుపెట్టెఁడు తరలాక్షులార!
అనవుడు మన కేల యని యిందువదన
లప్పుడు గొని వచ్చి యంతఃపురమున
నొప్పఁగా విరిశయ్య నుంచి రయ్యెడను
పొలుపొంద రవివంశమునఁ బుట్టినట్టి
నలుని గోరినభీమనందనవిరహ
వేదన నుడిగింప వే వేఁగ నినుఁడు
రాఁ దలంచినరీతి ప్రాగ్దిశాకాంత
యనువుముంగిరము క్రియఁబో యనంగ
గనుపట్టెఁ బ్రాచిఁ జక్కనివేగుచుక్క
మెల్లనె చంద్రుఁడు మెఱుఁ గెల్ల దక్కి
తెల్లనై పడమటిదెస కేఁగుచుండెఁ
దారలభ్రమున నెంతయుఁ గాంతి మాసి
జారచోరసమూహసంచార ముడిగె
వలరాజు తనవింటి పడి నెక్కుడించి
పొలుపొంద బాణముల్ పొదిలోన నుంచెఁ
గదిసి యుండినయట్టికాంతలు పురుషు
లదిమినకౌఁగిళ్లు లందంద వదలెఁ
గలువలు చింతించెఁ గమలముల్ మించె
నిలఁ బువ్వుజాలంబు లెల్లను వెలసె

వరగున సర్వసంచారంబు లుడిగి
యిరవుంలోఁ జేరి నింపు సొంపారఁ
గోకిల లందందఁ గూయఁగఁ దొడఁగె
మూఁకలై పలుకు లిమ్ముల మేఁత కరిగె
తిమిరముల్ దా మున్న దిశలకే పోయెఁ
గొమరొప్ప నాల్గు దిక్కులు దెల్లఁగాఁ దా
తనయునిపెండ్లికి ధరణేశగారి
ఘనతఁ గప్పిన మేలుకట్లో యనఁగ
సిందీవరాక్షితో నెమ్మి నడయుచుఁ
డెంది వసంతంబు లాడెనో యనఁగ
నిల ధరేంద్రములతో సింధ్రంపు పోరి
జల జల రక్తంబు స్రవ్వెనో యనఁగ
నరుణోదయం బయ్యె నంతలోపలను
వరవైభవంబున వాసవుఁ డిడిన
కొలువులో జగజంపుగొడుగో యనంగఁ
జెలు వొప్పఁ బూర్వాద్రి శిఖరంబుమీఁదఁ
జలమున హరి వేయుచక్రమో యనఁగ
జలరాశిపట్టంపుసతి ధరియించు
పాలు పొందుపాపటబొట్టో యనంగ
బలభేది మెడ నున్నపతకమో యనఁగ
నటనతో నింద్రునినాటిపై నున్న

పటు వైనచెంగల్వబంతులో యనఁగ
భానుఁ డప్పుడు పూర్వపర్వతంబునకు
మానుగాఁ జనుదెంచె మహి యెల్లఁ బొగడ
నంతట దమయంతి యనుఁగువయస్య
లంతఃపురంబున కరిగి యాభీమ
ధరణీశ్వరుని గాంచి దమయంతి తెఱఁగుఁ
బరువడిఁ దగ విన్నపము నిట్లు చేసి
ఓ! రాజదేవేంద్ర! యోనయసాంద్ర!
వారక నీ పుత్త్రి వార్త నాలింపు
మొకనాఁడు దమయంతి యుద్యానవాటి
సకియలతోఁ గ్రీడ సల్పుచు నుండ
వనమున కెందుండి వచ్చెనో యెఱుఁగ
మనురక్తితోడ రాయంచ లెన్నేని
చనుదెంచి దమయంతిసంగడి వ్రాలెఁ
దనుఁ గట్టుటకు త్రాళ్లు తాఁ దెచ్చుకొన్న
యనువున నొకయంచ నందందఁ బట్టి
కొని పోవునంత నీకూఁతురుఁ జూచి
పలుమాఱు మానవభాష నయ్యంచ
నలునిరూపము తద్గుణములసంపత్తి
యలఘుత యసమంబు లనుచు వర్ణించి
వలపుఁ బుట్టింప భావజుఁడు గోపించి

విరహంబుఁ బుట్టించి వేవేగ పోయెఁ
దరుణి యంతటనుండి ధరణీశ! నలుని
దలఁచి చింతించు మోహంబున నెంచుఁ
బలుమాఱు దిగులొందుఁ బరితాప మందు
మమ్ముఁ జూచి జేరు నమ్మనుని దూఱుఁ
గమలారిఁ దిట్టుఁ దక్కక నమ్ముఁ గొట్టు
హా యని మతిఁ దూలు నవనిపై వ్రాలుఁ
బాయక మూర్ఛిల్లుఁ బసి నేలఁ బొర్లు
మనుజేశ! యిటువంటి మదనతాపంబుఁ
గని విని యెఱుఁగ మెక్కడ నైన మేము
మరుబాణవేదన మానునో యంచు
నరసతఁ జేసిన శైత్యోపచార
మంత యెంతని చెప్ప నలవియుఁ గాదు
వింతలు నున్నవి వివరింతు మన్న
యిగురుపానుపుమీఁద నింతిని జేర్పఁ
జిగురాకు లన్నియుఁ జెచ్చెరఁ గమలెఁ
దలచి తామరపూలతల్పంబునందుఁ
బొలఁతుక నుంచినఁ బొగలుగా నెగసెఁ
జల్లనినీటిలో సఖియ నుంచినను
గల్లగా దిది వెచ్చఁగా నాయె జలము
ముత్తెపుసరములు ముదితకు నిడినఁ

గ్రొత్తసీలము లాయెఁ గుసుమాస్త్రవహ్నిఁ
జందనం బలఁదిన జలజాక్షి మేనఁ
గంది యాక్షణమునఁ గస్తూరి యయ్యెఁ
బన్నీరు కడవలఁ బట్టి తెప్పించి
వెన్నునఁ బోసిన వెలఁది శోషించు
మా చేతఁ గాదింక మగువఁ బోషింప
నా చెలి బ్రతుకనీఁ డా మన్మథుండు
ఎలనాగ సంగతి నిఁక దాఁచ నేల
వలనొప్పఁ బుత్త్రి గావలసి యుండినను
నలుని రప్పింపుమీ నలుఁడు రాకున్న
జలజాక్షి బ్రతుకదు సత్య మీ మాట
ఇన్నినాళ్ళ తెఱఁ గేర్పడ మీకు
విన్నవం బొనరింప వెఱచి యుండితిమి
జాగు సేయఁగ నింక చనదు భూనాథ
వేగమే నలమహీవిభుని రప్పింపు
మనవుడు తల యూచి యతివలఁ జూచి
మనమునఁ జింతించి మనుజేశుఁ డనియె
నాఁడుబిడ్డలఁ గన్నయట్టిమానవుని
పాడిపంతంబులు పౌరుషంబులును
చెడు నంచుఁ బెద్దలు సెప్పినమాట
తడయక నిజ మాయె దమయంతివలన

ఏమి సేయుదు నింక యిటమీఁద నేను
నా మహీపతిఁ బిల్వ నంపుట యెట్లు
లారాజుఁ బిల్వంగ నంపియే నాకు
నా రాజుఁ బిలచిన నతఁ డేల వచ్చు
నలుఁ డనఁగా నుర్వి నారాయణుండు
నలుని రప్పింపఁగా నాచేత నౌనె
బలవంతమున సేయఁ బాడిగా దిలను
బలవంతు రప్పింప బలిమియు లేదు
నామహీశుని గోరె నాతికిఁ దగునె
బలుకుడి మఱి మహీపాలులు లేరె
అని తలపోయుచు నాత్మజకడకు
జనుదెంచి సుత యున్నచందంబు చూచి
వెఱఁగంది యప్పుడు వేవేగ వచ్చి
వెఱపొప్ప సంధ్యాదివిధు లెల్లఁ దీర్చి
కొలువుచావిడికి గ్రక్కున నేగుదెంచి
నలువైన సింహాసనమునఁ గూర్చుండి
హితుల నాయకపురోహితమంత్రివరుల
నతివేగ రప్పించి యప్పుడి ట్లనియె
మనదమయంతి కోమలులతోఁ గూడి
యొనరంగ నొక్కనా డుద్యానవనిని
వేడుక లలరంగ విహరించు చుండ

నాడకు రాయంచ లరుదెంచి నలుని
వరరూపలావణ్యవైభవస్ఫురణ
వరుసతో వర్ణించి నదరుచుఁ బోవ
నంతటినుండి తొయ్యలి దమయంతి
చింతించి నలునిపైఁ జిత్తంబుఁ జేర్చి
కంతునిచేఁ జాలఁ గాసిల్లె ననుచు
నింతులు సెప్పిరి యిందు కేమనిన
విని సభవారెల్ల విభుని వీక్షించి
జననాథ! యిందుకు సంతాప మంద
నేల మే మొకకార్య మెఱిఁగింతు మిపుడు
భూలోకమున నున్నభూనాయకులకు
వనరుహాక్షికి స్వయంవరమహోత్సవము
అని చెప్పి పంపిన నప్పు డానలుఁడు
చనుదెంచు సకలరాజన్యులు వత్తు
రని విని యిది కార్య మౌ నని చెప్పి
రయమునఁ జారుల రప్పించి చూచి
ప్రియము రెట్టింపంగ భీముఁ డిట్లనియె
నరు దారి నిషధేశుఁ డాదిగాఁ గల్గు
ధరణీశ్వరుల నెల్లఁ దప్పక కాంచి
కలకంఠి దమయంతి కన్యక కిపుడు
వలను మీఱఁగ స్వయంవర మని చెప్పి

చనుదెంచు పొం డని జనపతి వలుక
విని వార లప్పుడు వేవేగ చనిరి
భూమీశుఁ డప్పు డా పురవరం బెల్ల
ప్రేమ మీఱ నలంకరింపుం డటంచుఁ
దలవరులకుఁ జెప్పి తగఁ జాటఁ బనిచెఁ
దలవరు లప్పు డాధరణీశుమీఁది
యానఁ బెట్టుచుఁ బురం బటు వీథివీథిఁ
బూనుక తమ్మటంబులు వేసికొనుచు
సరగున హో! యని చాటించి రంతఁ
బురమువా రెల్ల నప్పుడు వాడవాడఁ
గమ్మనికస్తూరిఁ గలిపి పన్నీరుఁ
గమ్మని వాసింపఁ గలయంపి చల్లి
పచ్చతోరణములు బాగుగాఁ గట్టి
మెచ్చి బంగరువ్రాఁతమేల్కట్లు గట్టి
కదళికాస్తంభముల్ గడువేడ్క నిలిపి
ముద మొప్ప ముత్యాలముగ్గులు పెట్టి
చెంగావిపెక్కేముల్ సేర్చి యింటింట
సంగతి గెందమ్మిసరములు విడిచి
కుంకుమపన్నీట గోడలు బూసి
పొంకంబుగాఁ జిత్రములు నిండ వ్రాసి
చెలువ మందినయట్లు చిత్రవైఖరులు

గలుగ నప్పురము శృంగారించు చుండి
రంతలోపలఁ జారు లా నలాధిపుని
సంతసంబునఁ గాంచి సద్భక్తి మ్రొక్కి
ధరణీతలేశ ! విదర్భావనీశు
వరనందనకు స్వయంవరమహోత్సవము
గావున దమయంతికల్యాణమునకు
వేవేగ దేవర వేంచేయవలయు
నని చెప్పి సకలలోకాధీశ్వరులకు
వినిపించి యా భీమవిభువారి కరిగి
రంతట నిషధేశుఁ డానందమంది
కుంతల బర్బర కోసల పాండ్య
మాళవ ద్రవిళాంధ్ర మగధ కాశ్మీర
కాళింగ కాంభోజ కర్ణాట లాట
మరహాట కరహాట మత్స్య సౌరాష్ట్ర
కురు సింధు ఘూర్జర కుకుర సౌవీర
గౌళ నేపాల బంగాళ పాంచాల
చోళాధినాథులు సుముఖులై కొలువ
నాదిత్యరథసమం బైన తేరెక్కి
భూదేవసచివాప్తబుధులతోఁ గూడి
బహుగజహయరథభటచతురంగ
సహితుఁడై యెదుట వేశ్యాజాలమాన

సంగీతనాట్యఘోషంబులు సెలఁగ
మంగళవాద్యసమ్మర్దంబు గలిగి
మహితాతపత్త్రచామరములు మించు
వహిఁ బచ్చవన్నెపావడలు రంజిల్లఁ
గంచుకొమ్ములు బూరగలు నాగసరము
లంచితపటహకాహళములు నమర
భేరీమృదంగగంభీరవాద్యములు
భోరు కల్లఁగ మ్రోసె భూనభోంతరము
నలుఁ డాగతి విదర్భనగరమార్గమునఁ
బాలు పొంద మెల్లనఁ బోవుచు నుండె 1340



# ద్వితీయాశ్వాసము.



పరమపావనుఁడు శ్రీపతిభక్తియుతుఁడు
సురమునీశ్వరుఁడు భాసురగుణోజ్జ్వలుఁడు
నలసిండ కెంజడల్ దలముగాఁ జుట్టి
తలు వందు కృష్ణాజినము నడుమఁ బెట్టి
రిహి ద్వాదశోర్ధ్వపుండ్రములను బెట్టి
మహతి మూఁపునఁ జేర్చి మానసవేగ
యోగివాహము లెక్కి యోగి నారదుండు
బాగుగా శ్రీపతిఁ బాడి సొక్కుచును
ధరణిఁ జరించుచు దమయంతిచంద
మెఱిఁగి యా వృత్తాంత మెల్ల వేవేగ
పురుహూతునకుఁ జెప్ప బోరున దివికి
నరిగి సభాని నల్లంతటఁ జూచి
కిన్నరగంధర్వఖేచరగరుడ
పన్నగదేవదిక్పాలకుల్ గొలువ
నలరి నృత్యంబు రంభాద్యప్సరసలు
సలుప బంగరుగద్దెఁ జయ్యన డిగ్గి
యెదు రేగి భక్తి దేవేంద్రుండు మౌని

పదముల కెఱఁగి శుభప్రాప్తి కర్ఘ్యవి
పాద్యంబు లొసఁగి క్రొంబసిఁడిపీఁటమున
విద్యానిధిని యోగివిభు నుంచి భక్తిఁ
బూజించి చేతులు మొగిచినయింద్రు
నాజటేంద్రుఁడు సూచి యపు డిట్టు లనియె
సురనాథ విను మొకశుభవార్త నిపుడు
ధరలోన నొకవిచిత్రము పుట్టె వినుము
భీమభూపాలుఁ డభేద్యవిక్రముఁడు
సోమార్కనిభుఁడు భాసురగుణోజ్జ్వలుఁడు
నిల విదర్భపురంబు నేలెడురాజు
వల నొప్ప నతనికి వరపుత్త్రి యైన
యలివేణి దమయంతి యనఁ గన్య గలదు
తలఁపున దానిసౌందర్యసంపదలు
వనజాసనున కైన వర్ణింపరాదు
వినుము నేఁ జూడనివెలఁదులు లేరు
చూచితిఁ బార్వతిఁ జూచితి లక్ష్మిఁ
జూచితి భారతిఁ జూచితి రతిని
జూచితి తారను జూచితి శచిని
జూచితి మేనకఁ జూచితి రంభ
నెక్కడఁ గని విని యెఱుఁగ మెన్నఁడు
నక్కమలాక్షి నలావనీశ్వరుని

మదిలోనఁ గోరి మన్మథబాణవేధ
బెదరి కృశింపఁగా భీమభూవిభుఁడు
నలుని దెచ్చుటకు భూనాథుల కెల్ల
నలిదమయంతీస్వయంవరంబునకు
రండని భటులచే రావింప నిషధ
మండలాధిపుఁ డాదిమానవేశ్వరులు
హయకుంజరస్యందనారూఢు లగుచుఁ
రయమున నావిదర్భపురంబుఁ జేరఁ
బోవుచున్నా రదె భూలోకవార్త
దేవేంద్ర! నీకు నేఁ దెలుపవచ్చితిని
తగు నీకు దమయంతి తగ దన్యులకును
నగభేది ' యని చెప్పి నారదుం డరిగె
సురనాథుఁ డధికతేజోమూర్తులైన
వరుణకృతాంతపావకుల మువ్వురను
గనుఁగొని సంతోషకలితుఁడై పలికె
మనము నల్వురము నెమ్మది మర్త్యమునకుఁ
బోయి యందు విదర్భపుర మధ్యఁ జొచ్చి
యాయింతిఁ గనుఁగొంద మని పల్కి వారు
పఱతెంచి నలువు రప్పట్టణోపరిని
బురలక్ష్మీవైభవంబును జూచు చుండ
నరపతుల్ గొలువ సేనలు చుట్టు నిలువ

నరుదెంచి పురవీథి నరుగు చున్నట్టి
నలుని గన్గొనఁగఁ దన్నగరభామినులఁ
బోలు పొందుప్రాసాదముల గోపురములఁ
దలవాకిళులఁ నున్నతంపుమిద్దియల
నిలిచి యున్నలధారుణీశిఖుఁ జూచి
కొమరొందఁద నందంప గుంపులు గూడి
ప్రమద లొండొరులతో భాషించి రిట్లు
చూడరె యీరాజు సొంపును బెంపు
వేడుక లయ్యెడు వెసఁ జూడఁజూడఁ
దనియ దీతనిచక్కఁదనము యౌవనము
తనరారె నిట్టి యందంబు చందంబు
పొలుపొందునే యెందు భువియందు నివియు
కలవె లోకముల నెక్కడ విచారింపఁ
గంతుఁడో శ్రీరమాకాంతుఁడో అల జ
యంతుఁడో శాక మోహనవసంతుండో
ఈమనుజేశ్వరుం డినుఁడో చంద్రుండో
యీమహామహుఁడు దేవేంద్రుఁడో హరుఁడో
ననవిల్లు పుష్పబాణము లుండెనేని
మనసిజుఁ డని వీని మదిఁ జెప్పవచ్చు
కరముల శంఖచక్రము లుండెనేని
పరఁగ నీతని రమాపతి యనవచ్చు

మూఁడుకన్నులు ముఖంబునఁ గల్గెనేని
వేడుకఁ బార్వతీవిభుఁ డనవచ్చు
వేయుకన్నులు మేన విలసిల్లె నేని
యాయమరాధిపుఁ డని చెప్పవచ్చు
నని వితర్కింప భీమావనీవిభుఁడు
వినుతింపఁ దగినట్టివిడిదిఁ జూపుటయు
నలుఁ డందు విడిసి యుండఁగ నప్పు డన్ని
నెలవుల విడియించి నిష్ఠ నున్నంత
హరిహయాదులు తమయరదంబు లన్యు
లెఱుఁగ కుండఁగ నొక్కయిక్కను దాచి
పోలుపొంద నిజరూపములతోడ వచ్చి
నలరాజునెదుటఁ గ్రన్నన వచ్చి నిలువఁ
గనుఁగొని నలమహీకాంతుఁడు దివిజు
లనుచు దిగ్గున లేచి యతిభక్తితోడ
నెదురుగాఁ జనుదెంచి యిల సాగి మ్రొక్కి
ముద మంది వేవిధమ్ములఁ బ్రస్తుతించి
యనురక్తిఁ గొని వచ్చి హైమాసనముల
నునిచి చేతులు మోడ్చి యురుభక్తిఁ బలికె
నమరేశ శిఖి శమనాంబువులార!
కొమ రొప్ప నాల్గుదిక్కులయందు నిలిచి
కరమర్థి సకలలోకముల రక్షించు

పరమాత్ములార! నా భాగ్యమూలమునఁ
జనుదెంచినారు మీసందర్శనమున
ఘనపుణ్యమతి నైతిఁ గాదె లోకములఁ
గరుణ మీ రిటకు నిక్కము వచ్చినట్టి
తెఱఁగెఱిఁగింపుఁడు తెలియంగ నేఁడు
ఘనమూర్తులార! మీకార్య మంతయును
ననుకూల మొనరింతు ననుడు వాసవుఁడు
విని నలోర్వీశుని వీక్షించి పలికె
జననాథచంద్ర! మీ సత్త్వశీలంబు
పటుగతి సకలభూభాగంబు నిండె
నటుగాన నిను జూడ నభిలాష పుట్టి
చనుదెంచినాము నీ చంద మంతయును
గనుఁగొన సంతోషకర మయ్యె మాకుఁ
దరళాయతాక్షికి దమయంతికన్య
కరయ స్వయంవర మన విని నేఁడు
నలువుర మరుదెంచినా మింతిఁ గోరి
నలినాప్తకులజ! యానాతిదగ్గఱకుఁ
జని వేడ్క నీమది సరిపోవురీతి
ననుకూలపఱచి చయ్యన రమ్ము పొమ్ము
చనువిధం బెట్లని జాలి నొందకుము
మనుజేశ! నీకన్న మఱి లేరు మాకు

వసుధీశు లెందఱో వచ్చి యున్నారు
పొసగ నీవరి సేయఁబోలునే వారి
మాకార్య మంతయు మనుకులాధీశ!
నీకార్య మని చూడ నేర్తువు కాన
నీకు నేఁ జెప్పితి నిషధేశ నీవు
పోకున్న నిపుడు మాబుద్ధియుఁ గలుగు
నాపుడు చిఱునవ్వు నవ్వి భూవిభుఁడు
దేవేంద్రుఁ గనుఁగొని ధీరుఁడై పలికె
నిది యేమి దేవ! నీ కిటువంటిమాట
యదయునివలె నిట్లు లాడంగఁ దగునె
యుండంద భూనాథు లందరు వచ్చు
చందాన నేనును చనుదెంచినాఁడ
నా కంబులోచన ననుకూలపఱుప
నాకుఁ జెప్పఁగ నీకు న్యాయమా దేవ!
ముందఱ వెనుకను ముదితను గాంచి
చెందినవేడ్క భాషించి యున్నాను
పాలు పొంద నక్లైనఁ బోయి వచ్చినను
వెలఁదుక నామాట వినునె కా దనక
పన్నుగా నిటువంటిపనులకుఁ బోవఁ
గన్నది విన్నది కలదె మీ రిలను

పాయక యిట్టియింటి పనులు నాచేత
జేయుట గాదు మీసేవఁ గావింతు
నింతియ కాని యేయింతిని మీకు
సంతసంబున బుద్ధి సాలదు కూర్పఁ
జేరి యీపనులు నేర్చినవారిఁ బనిచి
యారమణీమణి నర్థి వరింపఁ
డనవుడు పురుహూతుఁ డారాజుఁ జూచి
ఘనకృపారస మొల్కఁగా నిట్టు లనియె
నినకులాధీశ నీ వేకార్యమైన
ననుకూలపఱచెద నంటివి యిపుడు
పనివడి మే మొక్కపనికిఁ బోవున్న
వినయముల్ పల్కుచు వెలఁదుకకడకు
పోలేక యిప్పుడే బొంకితి వనినఁ
బోలించి యే మనఁ బోయెద మింక
పరువడి సత్త్వసంపన్నుండ వనుచు
నురలు సెప్పఁగ నిన్ను జూడ వచ్చితిమి
కర మొప్ప దబ్బరకాఁడ వటంచు
నెఱిఁగితే మే మేల యిందు వచ్చెదము
జగతి నిక్ష్వాకువంశజు లెల్ల మున్ను
పొగడినకీర్తులు బొందరి తొల్లి
అట్టివారలవంశమందున నీవు

పుట్టి దబ్బరలకుఁ బుట్టిల్ల వైతి
నీమేలు చేసిన నెన్నటికైన
మామనంబుల నిన్ను మఱువంగ లేము
నలరాజు సురరాజునకుఁ బెండ్లి సేసె
నలివేణి దమయంతి నని రమానాథు
డెఱిఁగిన నిను మెచ్చు టిది పెద్ద గాదె
ధరణీతలేశ ! యా దనుజారి యైన
మా కార్య మనిన తామస మింత లేక
చేకొని కరుణతోఁ జేసి రక్షించు
ధరణీశ! మామీఁద దయ లేదు మీఁద
నెఱిఁగెద విందుల కేమి కానిమ్ము
చనియెద మిఁక నని చర్చించి పలుక
విని చాల మదిలోన వెల్వెలఁబారి
కరములు ముకుళించి ఘనభక్తి మీఱ
ధరణీశుఁ డాపురందరున కిట్లనియె
నోనర నీబంటనై యుండెడివాఁడ
ననఘాత్మ ! నామీఁద నత్యంతకరుణ
గలిగి వచ్చితి వటుగాన నే నిపుడు
నెలమిని నాదమయంతిదగ్గఱకు
నరయ నే నేగతి నరుగుదు ననుచుఁ
గరుణాసముద్ర! యీగతిని బల్కితిని

అకట యాదమయంతియంతఃపురంబు
నకుఁ బోతుటీగ యైనను బొందరాదు
కావున నిప్పు డీకార్య మేరీతిఁ
గావింతు నీమాట కపటంబు గాదు
తడయక దానియంతఃపురంబునకు
నడువ నుపాయంబు నాకెఱిఁగింపుఁ
డన విని శైలారి యాస్త్ర మోదించి
మనుజేశ్వరుని జూచి మఱియు నిట్లనియె
దమయంతికన్యకు దానియింతులకుఁ
గ్రమమున నీరూపు గనుపింపఁ గాక
యితరుల కెవ్వరి కెఱుఁగంగ రాక
సతితోన భాషించి చనుదెంచుదనుక
నని యొప్ప వర మిచ్చి యరుగు మటంచు
ననిచిన వారికి భక్తితో మ్రొక్కి
చనిచని యాభీమజననాయకుండు
పెనుపొంద హితులతోఁ బేరోలగమున
నామెడఁ గూర్చుండి యాలోచనంబు
సేయఁగ నొకకొంతసే పుండి చూచి
యరు దైనకనకహర్మ్యంబులు గడచి
మెఱసెడి బంగారుమేడలు గడచి
వరసఁ జిత్తరువులచవికెలు గడచి

వరుసతోఁ బగడంపువాకిళ్లు గడచి
యక్కడక్కడ నిల్చి యంతఃపురంబు
నక్కజంబుగ దాటి యాదమయంతి
యువిదతోఁ గూడుక నొనరంగ నొక్క
నవరత్నమయ మైన నగరిలో నుండఁ
గనుఁగొని దానిదగ్గఱఁబోయి నిలువ
వనజాక్షుఁ జూచి భావజుఁ డంచు బెదరి
భ్రమ నొంది ధరమీదఁ బడి మూర్ఛవోయి
కమలాక్షి యంతలో గ్రక్కునఁ దెలిసి
కనుఁగొని నలరాజు గాబో లటంచు
మనమునఁ దెలిసి హేమస్తంభ మొకటి
చాటుగా నిలిచి యచ్చట నున్న తనదు
చేటిని సైగ సేసిన నది వేడ్క
జననాథుఁ గని పల్కె సరసవాక్యముల
నొనరంగ నెక్కడనుండి వచ్చితివి
నీ వెవ్వఁడవు మఱి నీకు పే రేమి
యేవిధంబున వచ్చి తిటకు నీకార్య
మెఱిఁగింపు నీపురం బెయ్యది నీవు
విరులవిల్తునిరీతి వెలయుచున్నాఁడ
వనవుడు రాజేంద్రుఁ డాదమయంతిఁ
గనుఁగొని సంతోషకలితుఁడై పలికె

రమణ నే నిషధపురం బేలువాఁడ
నమర నలాధిపుఁ డను పేరివాఁడ
సరసత నిటకు నిర్జరదూత నగుచుఁ
బఱతెంచినాఁడ నాపని యెల్ల వినుము
అమరాధిపతియును ననలుండు మఱియు
శమనుండు వరుణుండు సరసత వీరు
నలువురు నిను గోరి నాకడఁ జేరి
తలఁపు లెఱింగించి తమలోన నొకని
కనుకూలపఱచి రమ్మని పంచినారు
వనజాక్షి యిట్టి దేవతలకు నీవు
తెలివిచేఁ బట్టపుదేవిగా నుండఁ
గలిగెను నీదు భాగ్యము నెంచఁ దగియె
వారిజానన! యేను వరుసతో నిపుడు
వారిప్రభావంబు వర్ణింతు వినుము
బలభేది సకలసామ్రాజ్యసంపదలఁ
దెలివి నొందినతూర్పుదిశ నేలురాజు
మఱువక జముఁడు ధర్మము విచారించి
తిరముగా దక్షిణదిశ నేలురాజు
భూవలయంబునఁ బొలుపొంద వరుణ
దేవుఁడు పశ్చిమదిశ నేలురాజు
కేళిమై యగ్ని యాగ్నేయపుదిక్కు

నేలినవాఁడు యజ్ఞేశ్వరాహ్వయుఁడు
వారు పుణ్యాత్ములు వార లుత్తములు
వారు శ్రీమంతులు వారు పావనులు
వార లభేద్యులు వా రనిమిషులు
వారలు నినుఁగోరి వచ్చినయపుడె
యలివేణి! యెంతభాగ్యముఁ జేసినావొ
తెలియంగఁ దరమె యీదివిజవల్లభుల
నలువురిలోన మానస మేఁటియందు
నిలుచునో నీవు వాని వరించితేని
యనిమిషనాయకు లహివరుల్ నరులు
మునులును ఋషులును ముద మందఁగాను
గరుడఖేచరయక్షగంధర్వవరులు
హరిహరబ్రహ్మాదు లందఱు నిన్ను
నరసి ప్రస్తుతి సేతు రది మేలు కాదె
నరకామినివి నీవు నాకులు వారు
వనజాక్షి యెవ్వరి వరియించె దీవు
వినిపింపు వీనుల విందుగా నాకు
ననురక్తి దేవత లంప వచ్చితిని
ననుఁ జిన్నబుచ్చుట న్యాయంబు గాదు
అనవుడు దమయంతి యామాటలెల్ల
విని నవ్వి యారాజవిభున కిట్లనియె

నవునోయి మంచికార్యము చేసినావు
కువలయేశ్వర ! నిన్నుఁ గోరినందులకుఁ
బురుషులు గోరుట ఘనమిలోఁ దగును
తరుణులు గోరుట తగ దనుమాట
నిజ మయ్యె నామీఁద నేరంబు గాదు
యజుఁడును సరివారి లందఱిలోన
నగుఁబాటు చేసెనే నరనాథ ! నేఁడు
మిగుల మాటలఁ బల్క మీ కేల పల్కు
రాయంచఘాలుగులు రియమున వచ్చి
పాయక మదనుని బారిని ద్రోచి
యరిగిన వెనుక ని న్నన నేల నాకుఁ
బరువడి నాప్రాంతఫల మిట్టు లుండ
నమరాధిపతు లేడ నకట నే నేడ
తముఁ గోరు మని చెప్పఁ దగునె వారలకు
వారికి బిడ్డనై వర్తింతు నిటను
వారికి వరియింప వచ్చు దోషంబు
కుతలేశ ! నిను మున్ను గోరిన వెనుక
మతిలోన వేఱొక్కమగనిఁ గోరుదునె
నీవె వరింపుము నీవు కా దనిన
వేవేగ ప్రాణముల్ విడుతు నంతటనె
వారును నీవును వరుస మెచ్చెదరు

ధారుణీవల్లభ! తప్ప దీమాట
నావుకు చెఱునవ్వు నవ్వి భూవిభుఁడు
వావిరి భీమభూవరపుత్త్రి కనియె
సురనాయకులు గూడి సుందరి నిన్ను
వరియింప వచ్చిన వారిఁ గాదనుచు
నరుని వరించిన నగరె లోకముల
ధరలోన నోములు తగినదానములు
నుపవాసములు పెక్కు లొనరంగఁ జేసి
యెప్పుడును గిందురా యింద్రపదంబు
నాసించి యుందుమహాత్ములైన
వాసవలోకనివాసమే యరుదు
వరుసతో నీభాగ్యవశమున సురలు
వరియింప వచ్చిరి నరునై భువమున
నట్టివారల నొల్ల నని నీవు నన్ను
నెట్టు పంపాడెద విది బుద్ధి కాదు
వనిత వారలు గోరి వచ్చినవెనుక
నిను వరింపఁగ నాకు నీతి గా దింక
ఇనవంశజుఁడఁ గాని యితరుఁడఁ గాను
పని బూని వారలబంటనై వచ్చి
వెలఁది! నిన్ను వరింప వెఱతు నే ననిన
నెలుఁగెత్తి హా యని యేడ్చి భూనాథ!

నీవు రావలె నంచు నిఖలభూవిభుల
రావించె మాతండ్రి రయమున మీఁకు
పంతమా యిటువంటి పలుకులు పలుక
సంతసంబున విను జననాథచంద్ర!
బలసూదనుం డైనఁ బావకుం డైన
జలదేవుఁ డైనను సమవర్తి యైన
జలజసంభవుఁ డైన జలజాక్షుఁ డైన
జలజారి యైనను జలజాతుఁ డైన
వరియింప నొల్ల నో వసుధేశ! నన్ను
నెరవున వరియింప వెఱచిన వేని
సన్నుతి వారలసన్నిధి నుండి
నిన్ను నే వరియింతు నిఁకేల భయము
కా దని యీరీతిఁ జేయ కున్న
మేదినీశ్వర! నీవు మెచ్చకు నన్ను
అని పల్కుచుండ నయ్యమరవల్లభులు
వని యదృశ్యత నిల్చి జనపతిపలుకు
లాలించి మెచ్చుచు నరిగిరి మున్ను
భూలోకవిభుఁ డంత పొలఁతిచిత్తంబుఁ
దెలిసి వేగమె చనుదెంచి దేవతల
నలరుచుఁ జూచి సాష్టాంగ మర్పించి
కరములు ముకుళించి కడు భక్తిఁ బలికె

నరిగితి భీమరాజాత్మజకడకు
నెనయంగ మీ రానతిచ్చిన క్రమము
వినిపించితిని మిమ్ము వినుతిఁ జేసితిని
పరమపావనులార! భవదూరులార!
వరరూపవతి మిమ్ము వరియింప ననియె
ననవుడు దేవేంద్రుఁ డారాజచంద్రుఁ
గనుఁగొని యామాట కాదనలేక
వేడుకతోఁ బోయి వెలఁదితో మాట
లాడి వచ్చితివిగా యవనీతలేశ!
నీయంతగుణశాలి నిఖిలంబులోన
నే యెడఁ గని విని యెఱుఁగ మెన్నండు
నిట్టి సత్యవ్రత మిట్టిగాంభీర్య
మిట్టియౌదార్యంబు నిట్టిసద్గుణము
గలిగినవాఁడ వొక్కఁడవె లోకముల
నలమహీనాథ! యానలినాక్షి నిన్ను
డతివేడ్కతోఁ బెండ్లియాడుము నీవు
మతిలోన నీమేలు మఱువ మెన్నండు
నని పల్కి యానల్వురచ్చోటు వాసి
ఘనమాయఁ దల్లి చక్కఁగ నొక్కచోట
నురుతరమూర్తు లన్యులకు నెవ్వరికి
గురుతిడ రాకుండఁ గూర్చుండి రంత

నంతట భీమగోత్రాధిపుఁ డలరి
వింతగాఁ దనమంత్రివిభుల భూవిభుల
హితుల మంత్రులఁ బురోహితులసమ్మతిని
నతివేడ్క శుభలగ్న మటు నిశ్చయించి
నలుఁ డాదిగాఁ గల్గు నరనాథవరులఁ
బిలిపించి వారికిఁ బ్రియము పుట్టించి
సరసతోఁ దన కొల్వుచావడి కెదుట
బరు వైన చలువచప్పరముల నునిచి
తనపుత్త్రి యున్నయంతఃపురంబునకు
జననాథచంద్రుండు సమ్మతి నరిగె
నప్పుడు దేవత లానంద మొంది
యెప్పుడు నరులకు నెఱుఁగ రాకుండ
నలునిరూపంబులు నలువురు దాల్చి
కొలువున నలుచెంతఁ గూర్చుండి రంత
భీముండు దాదులఁ బిలిచి మీ రింక
కామిని దమయంతికన్యకామణికిఁ
గడు వేడ్క మీరు శృంగారించి వరము
లడుగంగ దేవాలయంబున కరిగి
శ్రీరమాపతిని బూజింపంగఁ జేసి
కోరి చయ్యనఁ దోడుకొనుచు రావలయు
ననుటయు దమయంతి కాయిందుముఖులు

నరిగితి భీమరాజాత్మజకడకు
నెనయంగ మీ రాకతెచ్చినక్రమము
వినిపించితిని మిమ్ము వినుతిఁ జేసితిని
పరమపావనులార! భవదూరులార!
వరరూపవతి మిమ్ము వరియింప ననియె
ననవుడు దేవేంద్రుఁ డారాజచంద్రుఁ
గనుఁగొని యామాట కాదనలేక
వేడుకతోఁ బోయి వెలఁదితో మాట
లాడి వచ్చితివిగా యవనీతలేశ!
నీయంతగుణశాలి నిఖిలంబులోన
నే యెడఁ గని విని యెఱుఁగ మెన్నండు
నిట్టి సత్యవ్రత మిట్టిగాంభీర్య
మిట్టియౌదార్యంబు నిట్టిసద్గుణము
గలిగినవాఁడ వొక్కఁడవె లోకముల
నలమహీనాథ! యానలినాక్షి నిన్ను
డతివేడ్కతోఁ బెండ్లియాడును నీవు
మతిలోన నీమేలు మఱువ మెన్నండు
నని పల్కి యా నల్వురచ్చోటు వాసి
ఘనమాయఁ దల్లి చక్కఁగ నొక్కచోట
నురుతరమూర్తు లన్యులకు నెవ్వరికి
గురు తిడ రాకుండఁ గూర్చుండి రంత

నంతట భీమగోత్రాధిపుఁ డలరి
వింతగాఁ దనమంత్రివిభుల భూవిభుల
హితుల మంత్రులఁ బురోహితులసమ్మతిని
నతివేడ్క శుభలగ్న మటు నిశ్చయించి
నలుఁ డాదిగాఁ గల్గు నరనాథవరులఁ
బిలిపించి వారికిఁ బ్రియము పుట్టించి
సరసతోఁ దన కొల్వుచావడి కెదుట
బరువైనచలువచప్పరముల నునిచి
తనపుత్త్రి యున్నయంతఃపురంబునకు
జననాథచంద్రుండు సమ్మతి నరిగె
నప్పుడు దేవత లానంద మొంది
యెప్పుడు నరులకు నెఱుఁగ రాకుండ
నలునిరూపంబులు నలువురు దాల్చి
కొలువున నలుచెంతఁ గూర్చుండి రంత
భీముండు దాదులఁ బిలిచి మీ రింక
కామిని దమయంతికన్యకామణికిఁ
గడు వేడ్క మీరు శృంగారించి వరము
లమగంగ దేవాలయంబున కరిగి
శ్రీరమాపతిని బూజింపంగఁ జేసి
కోరి చయ్యనఁ దోడుకొనుచు రావలయు
ననుటయు దమయంతి కాయింపుముఖులు

సని తేటపన్నీట జలకంబు లార్చి
మెరువడి జిలుఁగుతో మెయిఁ దడి యొత్తి
కురు లార్చి వింతగాఁ గొప్పు గీలించి
వరచంద్రకావిపావడమీఁద మించి
వరలు సన్నపుఁజల్వవలువ బాగొప్పఁ
గట్టిగుబ్బలమీఁదఁ గనకంపుఁబూల
పట్టుకంచుకమును బాగుగాఁ దొడిగి
తిరుగా మృగనాభితిలకంబుఁ దీర్చి
కోరి జవాజితోఁ గూర్చినమంచి
హరిచందనము మేన నందంపఁ బూసి
విరిసరుల్ గొప్పున వింతగాఁ దురిమి
పటుసూర్యచంద్రుల పాపటబొట్టు
నిటలంబుపై వ్రాల నిలిపి కర్ణములఁ
గర మొప్పు బంగారుకమ్మలు వెట్టి
కరముల వజ్రాలకడియముల్ వెట్టి
నీలంపుముంగర నీటుగాఁ బెట్టి
లాలితంబుగను బిళ్లలనూ లమర్చి
కరముల ముద్దుటుంగరములు వెట్టి
మెఱయుహారంబులు మెడనిండ నుంచి
తెలిదమ్మిరేకులఁ దెగడెడుముద్దు
కలికికన్నుల మంచికాటుకఁ బెట్టి

ఘనతరనవరత్న కాంతులచేతఁ
దనరినజిగిసందిదండలు వెట్టి
పల్లేరుపువ్వులు పసిఁడి తీఁగెయును
మొల్లమిగాజులు ముంగామురుగులు
తిలకంబు పసిఁడియందియ లాదిగాఁగఁ
గలభూషణంబులు కన్యకామణికి
ధరియింపఁ జేసి శ్రీధరుమందిరముఁ
కరుదండఁ దోడ్కొని యరిగిన నంత
కరములు ముకుళించి కన్యాలలామ
పరమాత్ముఁ డైనశ్రీపతిని వర్ణించి
భయభక్తి మీఱ నేర్పునఁ బ్రస్తుతించె
జయ భక్తమందార! జయ మహోదార!
జయ నిత్యకల్యాణ! జయ జగత్త్రాణ!
జయ పద్మదళనేత్ర! జయ నీలగాత్ర!
జయ కరుణాపాంగ! జయ కీర్తితాంగ!
జయ పాపసంహార! జయ శుభాకార!
జయ బాహుబలధుర్య! జయ దేవవర్య!
జయ భోగసుత్రాణ! జయ గుణోద్దాన!
జయ రమాహృదయేశ! జయ విశ్వప్రకాశ!
జయ పరమానంద! జయ పుణ్యబృంద!
యని నినుఁ గొనియాడ నలవియే నాకు

నను గరుణింపుము నాకాధిపతులు
నలుగురు చనుదెంచి నను గేలిసేయఁ
దలఁచి యున్నారు నాధవునిగా నలుని
జేసి రక్షింపుము శ్రీనాధ! యనుచు
భాసురమతితోడఁ బ్రస్తుతించుచును
జనుదెంచె దమయంతి సఖులతోఁ గూడి
తనతండ్రికడకు నాధరణీశ్వరుండు
పటుకనకపచ్చలపల్లకిలోన
వరపుత్త్రి నునిచి వే వసుధామరులను
గనుఁగొని మీరు భూకాంతుల నెల్ల
వినుతవాక్యంబుల వేర్వేఱఁ జూపఁ
డని పుత్త్రిఁ గనుఁగొని యమ్మ! మాయమ్మ!
యనురక్తరాజుల నందఱఁ జూచి
మనమునఁ దలఁచిన మనుజేశుకంఠ
మునఁ బుష్పమాలిక ముదమున వైవు
మని చెప్పి ధరణీశుఁ డంత నైదువుల
ననుపమగతిఁ గూర్చి యతివల కెల్ల
హెచ్చరికలు సెప్పి యేతేరఁ బనిచి
యచ్చుగా సకలసైన్యంబులు గొలువఁ
దనకుమారుని నొక్కతావున నునిచి
యొనరంగఁ బదిలులై యుండుఁ డటంచు

బలముల నలుగడ బలువిడి నునిచి
యలరుచు సకలాయుధాన్వితుఁ డగుచు
బలియుఁ డై తా నుండెఁ బార్థివేశ్వరుఁడు
నలివేణి దమయంతి నప్పుడు తోడ్కొనుచు
చెలికత్తె లిరుగడ చేఁబూని రాఁగ
వలనొప్ప నారాజవరుల నేర్పఱి
నఱయుచు సుదేవుఁ డనువిప్రవరుఁడు
సురుచిరమతితోడఁ జూపఁగఁ దొడఁగె
కలకంఠి! యీతఁడు గౌళభూనాథుఁ
డలివేణి! యితఁడు మహారాష్ట్రవిభుఁడు
లలన! యీఘనుఁడు మాళవమహీశ్వరుఁడు
నెలఁత! యీనరపతి నేపాళవిభుఁడు
కలికి! యీశూరుండు కరిహాటధవుఁడు
వెలఁది! యీరాజు ద్రావిడదేశభర్త
కొమ్మ! యీనాథుండు కుకురధాత్రీశుఁ
డమ్మ! యీరాజేంద్రుఁ డంగభూవరుఁడు
మదిరాక్షి! యీతండు మత్స్యవల్లభుఁడు
సుదతి! యీనృపమౌళి చోళదేశేశుఁ
డెలనాగ! కురుధరాధీశుఁ డీనృపతి
మెలఁత! యీతండు కాశ్మీరరాజన్యుఁ
డలరుఁబోఁడీ! యీతఁ డంగభూవిభుఁడు

చెలియ! యీధీరుండు సింధుభూనాథుఁ
డని యిట్లు రాజుల నందఱఁ జూపి
వనితతోఁ నిషధభూవరుఁ జేరఁ బోయి
నలరాజు దగ్గఱ నలువు మీఱంగ
నలునిరూపంబున నలువు రుండఁగను
బరికించి చూచి యా భూసురుం డపుడు
నరుదెంచి యేమియు నన కూరకుండె
నది చూచి దమయంతి యాతెవలఁ జూచి
యిది దేవతలమాయ యిందు కేమందు
నేవ్వరు నిషధేశు లెంచ్ఛ నఁగలరె
యీవట్టివేషంబు లేల వీరలకు
నక్కటా యేనొల్ల నని పల్కుచుండ
తక్కక యిటు సేయఁ దగునె వీరలకు
తమవంటివారికిఁ దగుదురే యేను
తమకులాంగనల నెంతేటిరూపుదాన
కరుణ యింతయు లేక కటకటా వీరు
సరసత నామీఁదఁ జలపోరఁ దగునె
యనుచు పల్లకి డిగ్గి యమరేశ్వరులకు
మునుకొని చెయ్మోడ్చి మ్రొక్కి యిట్లనియె
నిది యేల నయ్య! మీ కిటువంటిపనులు
కొదుకక చేయ మీ కూఁతురఁ గాన

నైజరూపముఁ దాల్చి నరు లంద ఱెఱుఁగ
రాజిల్లి నను గృపారస మొల్కఁ గాంచి
నాకాధిపతులార నలునికి నన్ను
వే కూర్చి పెండ్లి గావించి యీవేళఁ
గన్నులారఁగఁ జూచి కరుణతో నలుని
నన్ను దీవించి మన్ననఁ జేసి మీరు
వేంచేయరయ్య' నావెఱ పెల్ల మాన్పి
యంచు వేఁడిన మెచ్చి యతిదయామతిని
ప్రముదితచిత్తులై బలభేది వహ్ని
జముఁడును వరుణుండు సత్వరంబునను
తమతమరూపముల్ తప్పక దాల్చి
యమరంగఁ గనుపడి రందఱు నప్పు
డాలోన నలుని నొయ్యనఁ జేరి పుష్ప
మాలిక మెడ వ్రేసె మగువ పొంగుచును
దివినుండి ఘోషించె దేవదుందుభులు
భువిమీఁదఁ గురిసెను బుష్పంపువాన
పాడిరి గంధర్వపతులు మోదమున
నాడిరి మెదుర రంభాదికామినులు
నిరృతి వాయు కుబేర నీలగళాది
హరిదధీశులు నఖిలామరుల్ దివిని
వాసవానలయమవరుణులు భువిని

చెలియ! యీధీరుండు సింధుభూనాథుఁ
డని యిట్లు రాజుల నందఱఁ జూపి
వనితతో నిషధభూవరుఁ జేరఁ బోయి
నలరాజు దగ్గఱ నలువు మీఱంగ
నలునిరూపంబున నలువు రుండఁగను
బురణించి చూచి యా భూసురుం డపుడు
నరుదెంచి యేమియు నన కూరకుండె
నది చూచి దమయంతి యతివలఁ జూచి
యిది దేవతలమాయ యిందు కేమందు
నేవ్వరు నిషధేశు లెం దైనఁ గలరె
యీవట్టివేషంబు లేల వీరలకు
నెక్కటా యే నోళ్ల నని పల్కుచుండ
తక్కక యిటు సేయుఁ దగునె వీరలకు
తమవంటివారికిఁ దగుదు చేయోను
తమకులాంగనల నెంతటిరూపుదాన
కరుణ యింతయు లేక కటకటా వీరు
సరసత నామీఁదఁ జలపోరఁ దగునె
యనుచు పల్లకి డిగ్గి యమరేశ్వరులకు
మునుకొని చెయ్యెత్తి మ్రొక్కి యిట్లనియె
నిది యేల నయ్యా! మీ కిటువంటిపనులు
కొదుకక చేయ మీ కూఁతురఁ గానె

నైజ రూపముఁ దాల్చి నరు లంద ఱెఱుఁగ
రాజిల్లి నను కృపారస మొల్కఁ గాంచి
నాకాధిపతులార నలునికి నన్ను
వే కూర్చి పెండ్లి గావించి యీవేళఁ
గన్నులారఁగఁ జూచి కరుణతో నలుని
నన్ను దీవించి మన్ననఁ జేసి మీరు
వేంచేయరయ్య' నావెఱ పెల్ల మాన్పి
యంచు వేఁడిన మెచ్చి యతిదయామతిని
ప్రముదితచిత్తులై బలభేది వహ్ని
జముఁడును వరుణుండు సత్వరంబునను
తమతమరూపముల్ తప్పక తాల్చి
యమరంగఁ గనుపడి రందఱు నప్పు
డాలోన నలుని నొయ్యనఁ జేరి పుష్ప
మాలిక మెడ వ్రేసె మగువ పొంగుచును
దివినుండి ఘోషించె దేవదుందుభులు
భువిమీఁదఁ గురిసెను బువ్వులవాన
పాడిరి గంధర్వపతులు మోదమున
నాడిరి యెదుర రంభాదికామినులు
నిరృతి వాయు కుబేర నీలగళాది
హరిదధీశులు నిఖిలామరుల్ దివిని
వాసవానలయమవరుణులు భువిని

వాసి కెక్కిననలావనినాథుఁ బొగడి
రలఘుసద్భక్తి భీమావనీశ్వరుఁడు
నలుని గీర్తించె నున్నతి మీఱ నపుడు
వెలయంగ దేశాధిపతు లెల్ల వచ్చి
నలమహీశ్వరునకు నయముగా మ్రొక్కి
పొలుపొందఁ దమపురంబుల కేగి రంత
నలరుచు దమయంతి నాత్మలో నెన్ని
పాకశాసనుఁడు దిక్పతులతో వచ్చి
చేకొని నలరాజశేఖరు నపుడు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కువలయాధీశ!
యచ్చుగా నీవు మాయాప్తుఁడ విలను
చిరభక్తితో నీవు సేయు జన్నంబు
కరుణ మీఱఁగ నేను గైకొనువాఁడ
మఱువకు మామీఁద మక్కువ లనుచు
ధరణీతలంబు నెంతయుఁ జిరకాల
మనురక్తిఁ బాలింపు మని యానతిచ్చె
ననలుఁ డంతట వచ్చి యవనీతలేశ!
నీవు న న్నెయ్యెడ నెమ్మిఁ బ్రార్థింప
నావంక నిలిచెద నని వరం బిచ్చె
జముఁ డంత నేతెంచి జననాథచంద్ర!
రమణ నీ వెంతధర్మము సేయఁ దలఁతు

వారూఢి నే నిత్తు నని వరం బిచ్చె
నైరృతి యట వచ్చి నరలోకనాథ!
నిరుపమశౌర్యంబు నీకోర్కికొలఁది
నరయంగ నే నిత్తు నని వరం బిచ్చె
వరుణుఁ డంతట వచ్చి వసుధాతలేంద్ర!
చిరకాల మేలు మీక్షితి నంచుఁ బలికె
వాయుదేవుఁడు వచ్చి వసుధేశ! నీకు
నాయతగతి వేగ మబ్బు నని యనియె
ధనపతి వచ్చి యోధరణీశ! నీవు
ధన మెంతఁ గోరినఁ దా నిత్తు ననియె
మృడుఁ డరుదెంచి యోమేదినీనాథ!
యడిగినమహిమ నిత్తు నని వరం బిచ్చె
నప్పుడు ముద మంది యమ్మహీశ్వరుఁడు
తప్పక వారికి దండముల్ వెట్టి
వినుతింప వారలు వినువీథి కెగసి
చనిరి వేగమున నిర్జరలోకమునకు
నల్లుని గూఁతురు నటఁ దోడుకొనుచు
మెల్లన నగరికి మేదినీశ్వరుఁడు
తిర మైనపెండ్లిపందిలి కేగుదెంచి
కర మొప్పు నవరత్నఖచిత మైనట్టి
బంగారుపీటలపై వధూవరుల

నంగన లటు నిల్పి హారతు లొసఁగ
నవనీసురాంగన లతివేడ్కతోడ
ధవళముల్ పాడంగ దండివాద్యములు
పటహధ్వనులు నభోభాగంబు నిండఁ
దటుకున భేరీమృదంగగంభీర
రవమున ధారాధరములు ఘూర్ణిల్లఁ
గవఁగూడి వందిమాగధులు కీర్తింప
సంగతిగా నాగసరములు పాడ
సంగీతవాద్యఘోషంబులు సెలఁగ
బూరగలీ గంచుకొమ్ములు కాహళములు
బోరుకల్లుటను సంబుధు లెల్లఁ గల్ల
వేత్తలై హోమముల్ వేల్పించి భాను
రోత్తము లక్షత లొసఁగి దీపింప
నెలమి వారాంగనల్ నృత్తముల్ సలుప
చెలఁగి పుణ్యస్త్రీలు సేసలు సల్ల
పలుతెఱంగులను శోభనములు పాడ
చెలువందఁ బెద్ద లాశీర్వాద మొసఁగ
తరలాయతాక్షిని దమయంతి నపుడు
నరపతి నలరాజునకు ధార వోసె
హరుఁడు పార్వతియును నమరినయట్లు
సరసిజాక్షుఁడు రమాజలజాక్షియట్లు

సరసిజాసనుఁడును శారదయట్లు
నెఱి శశాంకుఁడు రోహిణీదేవియట్లు
క్షితిధరాహితుఁడు శచీదేవియట్లు
అతివిధ రవియు ఛాయాదేవియట్లు
తిలకించి రట పెండ్లిదినములు గడపి
వలనొప్పఁ బెండ్లికి వచ్చినవారి
భోజనంబులఁ దృప్తిఁ బొందించి మిగుల
రాజిల్లునవహేమరజితాంబరములఁ
దనరుభూషణములఁ దనిపి పేర్కొలిపి
ఘనలీల వందిమాగధకవీంద్రులకు
వొడవులు మాడలు వోలవస్త్రములు
తడయక బహురత్నతతులు నొసంగి
వేడుక మీఱ నివ్విధమునఁ బెండ్లిఁ
బోడిమి జను లెన్నఁ బోలు పొందఁ జేసి
నిరుపమానానూననిత్యసంపత్తి
నురుతరసుఖలీల నుండి రంతటను
కలకంఠి దమయంతికన్యకామణికి
వల నొప్ప మును స్వయంవర మనువార్త
విని కలి నా పాపవిభుఁడు వేవేగ
తనలోన నతులసంతాపంబు నొంది
యపుడు పెండ్లాడఁగా నాత్మలోఁ గోరి

విపరీతబుద్ధులు వివరించుకొనుచుఁ
దలవెంట్రుకలు వీడఁ దత్తరిల్లుచును
జలజల మని ఘర్మజలబిందు లురలఁ
బరువున నేతెంచి బలసి దిక్పతులు
గరుడఖేచరయక్షగంధర్వసిద్ధ
వరసవిద్యాధరచారణసాధ్య
సురయక్షపన్నగుల్ సుట్టును గొలువఁ
గొలువున్నయింద్రుని గొబ్బునఁ గదిసి
బలవైరి! మా కొక్కపని గల దదియు
వినుము చెప్పెద ధరావిభుపుత్త్రి యొకతె
వనజాయతాక్షి భావజుమేటిదంతి
దమయంతి యనియెడుతరలాక్షి గలదు
క్రమ మొప్ప దానికిఁ గడు వేడ్కతోడ
వరయ స్వయంవర మని వింటి నేఁడు
ధరయందు దానిసౌందర్యసంపదకు
సరి రారు రంభాదిసురకామినులు
తరము గా దాచక్కఁదనము వర్ణింప
సరగునఁ జని యేను సఖుని వరించి
తిరిగి రావలయు నేతెఱఁగున నైన
వనిత కెప్పుడు స్వయంవర మొకో యనుచు
దినము లెంచుక యేను దిరుగుచున్నాఁడ

నేఁడు మీధర్మాన నెరవేరఁ గలిగె
వాడిచేఁ బెండ్లాడి వచ్చెద ననుచుఁ
గడఁగి దుశ్శకునముల్ గనుపింప నిటకు
నడచితి నటు గాన నావివాహమున
కేకీడు పుట్టునో యెఱుఁగంగ రాదు
నాకేశ! నీతోడ నయ మలరంగ
నిలిచి మాటాడంగ నేఁడు నామనసు
కొలుపదు నీ కేమికోపమో యెఱుఁగఁ
గర మర్థి దమయంతికన్నియ నిటకు
వరియించి తెత్తునో వాసవ! నాకుఁ
గరుణతో నొకయుపకారంబు సేయు
మరసి సురేశ! నీ కది విన్నవింతు
నందనవనములో నలినాక్షిఁ గూడి
పొందిక రతికేళి భోగింప వలయు
ననవుడు దేవేంద్రుఁ డప్పుడు దిక్పతులఁ
గనుఁగొని నవ్వి యాకలి కిట్టు లనియె
నేటికి మహికిఁ బోయెదు తద్వృథంబు
తేటతెల్లంబుగాఁ దెలిపెద నోయి
యాదమయంతీస్వయంవరక్రమము
నాదిని విని యీహుతాశన శమన
వరుణులఁ గూడి నే వసుధకు డిగ్గ

గఱితచిత్తం బెన్నిగతులనో యరయ
మమ్మెల్లఁ దంష్ట్రలమాఱుగా నెన్ని
సన్మతి నలుఁ బ్రాణసఖుగా వరించెఁ
గావున నాసలుఁ గడఁజేసి మరల
దేవలోకమున కేతెంచితి మీవు
పాలు పొంద నట కేఁగఁ బోయెద ననినఁ
గలఁగి వితర్కించి కలిపురుషుండు
మొగమునఁ జేవురు మురువు నటింప
భుగ భుగ సిగిడి నిప్పులపొగ లెగయ
బొట బొట చెమటలు సోన లై కురియ
తటతట మని రొమ్ము తాడఁబడు చుండ
కిటకటా యని యౌడు గఱచి కన్నులను
దొట దొట నిప్పులు దొఱఁగ భుస్సనుచు
కాలాగ్నిరుద్రుఁడో కాలభైరవుఁడో
కాలసూర్యుఁడో ప్రలయకాలుఁడో యనఁగ
గర్జించి భీషణాకారుఁ డై యపుడు
నిర్జరుల్ జణకంగ నిలిచి యి ట్లనియె
నిన్నాళ్లనుండి యీమెలనాగఁ గోరి
యున్ననే నుండంగ నూరక తాను
నన్నుఁ గాదని వచ్చి నలుఁ డెంతవాఁడు
క్రన్నన నాయింతిఁ గైకొని పోవ

నాకేశ! నీ వేగునాఁ డొక్కమాట
నాకుఁ జెప్పక పోవ న్యాయమా నీకుఁ
బోయినవా రెల్లఁ బొలఁతి వరించి
యీమొడ కేతేర కెల్ల వచ్చితిరి
పరులలో సురలమానముఁ గోలుపుచ్చి
వరియింప వచ్చినవాఁడా నలుండు
అమరులు వచ్చినా రని తాను బోక
దమయంతి వరియింపఁ దా నెంత ఘనుఁడో
మంచి దండుల కేమి మదిరాక్షిఁ గూడి
మెంచి తాఁ గాపురం బెల్ల చేసెనో
చూచెద ననవుడు సురరాజు వలికె
భూచక్ర మెల్ల నేర్పున విష్ణుచక్ర
మెలమితోఁ బని నేయ నేలెడుబలియుఁ
డిల వానిసత్య మీరేడులోకముల
నాకూఢి నెంతయు నాక్రమించినది
యీరాజవరునిపై నలుగంగ వలదు
మహిలోన నతఁడు సామాన్యుండు గాఁడు
మిహిరకులాగ్రణి మేదినీశ్వరుఁడు
సంతత శ్రీమూర్తి సరసనత్కీర్తి
మంతుండు నాచారవంతుండు ఘనుఁడు
వానిసత్య మెఱింగి వచ్చితి మిటకు

నానరనాయకుం డవనిలోపలను
నీకు సాధ్యుఁడు గాఁడు నీ కసాధ్యుండె
యోకలిరాజ! నీ వ్వూరక యింక
కోపంబు వానిపైఁ గూడ దామాట
పాపంబు వచ్చు నీపని సేయఁ గూడ
దన విని మఱియు రౌద్రాకారుఁ డగుచు
ననిమిషపతితోడ ననియె నాతండు
కినలి యీరేడులోకముల నాకన్న
ఘనుఁ డెవ్వఁ డున్నాఁడు కంటివే నీవు
వెర వొప్ప నాపేరు విన్నమాత్రమున
హరిహరబ్రహ్మాదులంతటివారు
వెఱచి చుట్టును రాక వెఱచి యుండుదురు
గరుడ ఖేచర యక్ష గంధర్వ ఖచర
వరు లైన నామాయ వర్ణింప లేరు
సురనాథ! నానేర్పుఁ జూచెద వింక
నలుఁ డనియెడియొకనరుఁడు నాయొద్ద
నిలచి యుండునె చూడు నీవు మెచ్చెదవు
దమయంతి నాచేతఁ దాఁ బడుపాటు
రమణి యెవ్వతె పడు రాజ్యంబులోన
నేను గోరినయట్టివనితను వచ్చి
తాను గైకొని పోవఁ దా నెంతఘనుఁడొ

వానితోఁ జలపోరి వాని నేఁ బట్టి
పూని జూదంబాడ బుద్ధిఁ బుట్టించి
మాయలు సేసి యామహీశు నెడఁ బాపి
పాయక పై నున్నబట్ట పోఁ జేసి
గారించి యిల గోఁచిగాని గావించి
యారణ్యభూముల నలయంగఁ జేసి
మానిని నెడఁ బాపి మనసు నొప్పించి
దీనత నొందించి తెలివిఁ దప్పించి
మాఱురూపము చేసి మహిమఁ దప్పించి
గారించి యమితదుఃఖముల నొందించి
కుండ గోకరిఁ జేసి కుపలయేశులకు
వండి పెట్టఁగఁ జేసి వాని నీరీతి
చీకాకుపడ మాయ సేయక యున్న
నాకేశ! వినుము నే నలునికి బంట
నాదుఁ దర్కింపఁగా నందాఁకఁ గలిని
గాఁ దని యాకీర్తిగా మహాప్రతినఁ
బలికి యింద్రునితోడ పరువున నవుడు
నిలచినచోటను నిలువంగలేక
ప్రాకటంబుగ విదర్భపురంబుఁ జొచ్చి
యాకోపమున నిషధాధీశుఁ డైన
నలరాజచంద్రుని నయముగాఁ జూచి

కలి యెంతమాత్రముఁ గదియఁ బో వెఱచి
యాతని సత్యంబు నాతని శౌచ
మాతని యాకార మంతయుఁ దెలిసి
కుతలాధిపుని జేరఁ గూడ దటంచు
నతఁ డెందుఁ దిరిగిన నది యెల్లఁ గనుచు
నొక్కడొక్కడెఁ గూండి యుండంద తిరిగి
కక్కసపడుచు శోకముఁ జెందు చుండు
నంతటఁ గొన్నినా ళ్లరిగిన నలుఁడు
సంతసంబున భీమజననాథుఁ గాంచి
యింక మాపురంబున కేగంగవలయు
నకలంక! నీవు ప్రీతి నంపింపు మనిన
నటువలెఁ జేయుదు మవనీశతిలక!
కుటిలకుంతలఁ దోడ్కొని పోవ కిచట
నుంచు మన్నను మీ రుందురే యనుచు
నెంచియుఁ బలికి భూవిభుఁడు కుమారి
నామెఁ బొడఁ గాంచి యంత నిట్లనియె
నోయమ్మ! నీమగఁ డొగిఁ బురంబునకుఁ
బోవలె నని నీవు పోయి రమ్మనిన
వావిరి దమయంతి వగచుచు నపుడు
తల్లి యొద్దకు వచ్చి తనమానసమునఁ
దల్లడించుచుఁ బల్కెఁ దండ్రి నన్నృపుడు

తనయల్లుఁ దూరికిఁ దర్లిపోఁ దలఁచి
నను వెంట నంపుమన్నాఁ డదిగాన
నాతనివెనువెంట నంపుదు ననుచు
నాతోడ నెఱిఁగించినాఁడే యోయమ్మ!
యనవుడు తనపుత్త్రి నలిన కౌఁగిటను
నునిచి హా యని యేడ్చి యో యమ్మ! యనుచు
నను బాసి పోయెదె నాముద్దులాడి!
యని తల్లి పుత్త్రియు నందంద యేడ్వ
దమయంతిదాదులు దాసజనంబు
గుమిగూడి యంఱుప కో యని యేడ్వఁ
జనుదెంచి భీమభూజననాయకుండు
తనపుత్త్రి నూరార్చి తనయింటిఁ దెలిపి
దాదుల వారించి దమయంతిఁ జూచి
యాదరంబునఁ బల్కె నది యేమి తల్లి!
యేల యేడ్చెదవు నీ కేమిటఁ గొదువ
లాలితసౌందర్యలక్షణాహ్వాయుఁడు
ఇల నేడుదీవుల నేలెడురాజు
నలరాజచంద్రుండు నరలోకనాథుఁ
డట్టిభూనాయకుఁ డతివరో! నిన్ను
నెట్టనఁ జేపట్టె నీ కేల నగవ
నరలోకనుతుఁ డైననలచక్రవర్తి

యరయ నీవలన నా కల్లుఁడై యొప్పె
పెక్కుకాలము నాకు బిడ్డలు లేక
మక్కువ నిను గాంచి మాన్యుండ నైతి
సురనాయకుల నేఁడ చూడంగఁ గలిగెఁ
గర మొప్పఁ జిరకీర్తి గలుగుటఁ జేసి
ఇందీవరాక్షి! నీ విందును నందుఁ
బొందుగా వచ్చుచుఁ బోవుచు నుండు
మమ్మరో! నీయన్న నంపుదు వెంట
నమ్మదంబునఁ బోయి చను దెమ్ము నీవు
మనమున దుఃఖంబు మాను మోయమ్మ!
నినుఁ జూడ కెన్నాళ్లు నిర్వహించుదు నె
పెనుపొంద వెంటనే పిలువ నంపింతు
నని బుజ్జగించుచు నాదరబుద్ధిఁ
దనపుత్త్రి నలునకుఁ దగ నొప్పగించి
తనయకు నరణంబు తనియంగ నిచ్చి
పోయి ర మ్మని పల్కఁ బొలఁతి శోకమును
బాయక తమతల్లిపదముల వ్రాలి
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కోర్కి దీవించి
చెచ్చెర బుద్ధులు సెప్పంగఁ దొడఁగె
మతితోడ గురుభక్తి మాన కెల్లపుడు
సతతపతివ్రతాచర్యల విడకు

పతిమాట నడుచుచుఁ బరిచర్య సేసి
పతిని శ్రీపతిఁగాఁగ భావింపు మమ్మ!
వసుమతి మనసరివారలలోనఁ
బొసఁగ సత్కీర్తులఁ బుట్టింపు మమ్మ!
మదిరాక్షి చెలువంద మనవంశమునకు
వదలక మఱియొకవన్నె దే వమ్మ!
కుసుమకోమలి! బంధుకోటి కీర్తింప
వసుమతీశుఁడు మెచ్చ వర్తింపు మమ్మ!
సరసత నాథుండు చనువిచ్చునపుడు
సరిమురిఁ బలుమాట లాడకు మమ్మ!
యని ముద్దు వెట్టి చయ్యన బుద్ధి సెప్పి
మునుకొని మోమున మోమును జేర్చి
నాయమ్మ! నాకూన! నాముద్దుచిలుక!
పోయి ర మ్మనవుడు పోయి తండ్రికిని
మ్రొక్కిన దీవించి మొగి బుద్ధి సెప్పి
గ్రక్కున నవరత్నఖచిత మాశిబిక
లోలోన నీరేజలోచన నునుప
నాలోన వలుఁ డొక్కయరదంబు నెక్కి
మామను వీడ్కొని మగువయుఁ దాను
ప్రేమతో దమునుండు వెంబడి రాఁగ
కరిరథ్యభటఘోటకంబులు గొలువ

వరుస ముప్పదిరెండు వాద్యముల్ మ్రోయ
వారక భటులు కైవారంబు సేయ
వారకామిను లిరుపంక్తుల నాడఁ
జేరి పుణ్యాంగనల్ సేసలు సల్ల
ధారుణీసురులు బాంధవులు కీర్తింప
దివినుండి దేవతల్ దీవించు చుండ
నవనిఁ బువ్వులవాన లంతటఁ గురియ
మనుజేంద్రుఁ డిటువంటిమహిమ శోభిల్ల
జనుదేర నప్పుడు సంభ్రమం బెసఁగఁ
పురమువా రెల్ల రుప్పొంగుచుఁ గూడి
పరునశో నెదురుగా వచ్చి వీక్షింప
పరివారజనములు భక్తి సేవింప
నరపతి తనపట్టణముఁ బ్రవేశింపఁ
బురసతీజనము లప్పుడు వేడ్కఁ లలర
గురుతరప్రీతిచే గుంపులు గూడి
దమయంతిఁ గనుఁగొని తమలోన తాము
ప్రమద మెలర్పఁగాఁ బలికి రి ట్లనుచు
నీమానినీమణి నిదె చూడరమ్మ!
రామాభిరామ నిర్భరపుణ్యసీమ
సీమ కా దిది మంచి చెలువైన లేమ
లేమ కా దిది మంచి లేమావికొమ్మ

కొమ్మ గా దిది మంచి కలుకు కెందమ్మి
తమ్మి గా దిది మంచి తావిపూలతీగ
లతిక గా దిది మంచి లావణ్యప్రతిమ
ప్రతిమ గా దిది పుష్పబాణుని దంతి
దంతి గా దిది రతి తగి మెచ్చుకాంత
కాంత గా దిది సీటు గలభోగికన్నె
కన్నె గా దిది మెచ్చు కనకంపుఁ దిన్నె
తిన్నె గా దిది తావి తేటపన్నీరు
నీరు గా దిది చిన్ని నెలరాజుతీరు
తీరు గా దమ్మ యీ దేవిలావణ్య
మంతయు వర్ణింప నలవియే మనకు
వింతగా నని యిట్లు వేషభంబులను
వినుతింప నలమహీవిభుఁ డివ్విధమునఁ
దనరారు శుభముహూర్తంబునఁ దనదు
నగరుఁ బ్రవేశించె నాతియుఁ దాను
జగతీశులును మహాజనులు బాంధవులు
హితులు మంత్రులు పురోహితులును దదను
మతి నేగి రట తమమందిరంబులకు
అంతట దమనాఖ్యుఁ డామహీశునకు
సంతసంబున మ్రొక్కి జననాథ! యేను
పొలుపొంద నూరికిఁ బోయి వచ్చెదను

కలకంఠి దమయంతి కన్యకామణికి
వయసు మిక్కిలి లేదు వసుధాతలేశ!
దయ నేలుకొమ్ము బిత్తరిని మన్నించి
యని విన్నపము సేసి యా దమయంతి
గనుఁగొని పొది బుద్ధి గలిగి భూవిభుని
మర్మంబు లెఱిఁగి సన్మతి భక్తి వెలయ
నర్మిలి నడువుము నయముతో నీవు
అరయంగ నూరికి నరిగెద ననినఁ
దరళాక్షి తనయన్నఁ దప్పక చూచి
కన్నులఁ గురుబాష్పకణములు దొఱఁగ
నిన్నాళ్లవలె నుండ కిఁక బుద్ధి గలిగి
మన్ననఁ బ్రజలెల్ల మహి మెచ్చి పొగడ
నన్నికార్యంబుల నరసి సద్భక్తిఁ
దల్లిదండ్రులమాట దాఁటక రాజ్య
మెల్ల నేలుము ప్రజ లెన సంతసిల్ల
మెచ్చుకీర్తులచేత మెలఁగు మోయన్న!
విచ్చేయు మనుడు వేవేగంబె యతఁడు
తనబలంబులు గొల్వఁ దనపురి కరిగి
తనతండ్రిఁ గూడి భూతల మేలుచుండ
నంతట నిషధేశుఁ డా దమయంతి

సంతసంబునఁ గూడి సరసులయందుఁ
గేళీవనములందుఁ గృతకాద్రులందు
మేలిమిపొదలందు మేడలయందు
నిరుపమానవిభూతి నిరతంబు నిట్లు
సురతభాసురకేళి సొక్కి సోలుచును
శ్రీరామచంద్రునిరీతి సంప్రీతి
ధారుణీచక్రంబుఁ దగ నేలుచుండె
నని యిట్లు పృషదశ్వుఁ డాధర్మజునకుఁ
జెనుపొంద మున్ను తా విన్నమార్గమున
వరుసతో నలచక్రవర్తిచరిత్ర
సరసులు మెచ్చ విస్తారంబు గాఁగ
వినుతవాక్యంబుల వెలయంగఁ జెప్పె
ననుచు వాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తివంతుఁ డాశ్రితకల్పతరువు
కరుణాపయోనిధి కందాళదొడ్డ
యాచార్యునకు శిష్యుఁ డైనట్టివైష్ణ
వాచారతత్పరుఁ డతిదయాపరుఁడు
పొలుపు మీఱినచక్రపురివిహారుండు
వలనొప్ప నతనికి వరకుమారుండు

అకలంకమానసుం డమితపుణ్యుండు
సకలవైష్ణవపాదసంసేవకుండు
రంగనామాత్యుండు రాజపూజితుఁడు
సంగీతసాహిత్యసత్కళావిదుఁడు
సరససత్కవివరసద్భూషణుండు
ఆరయంగ నాతని కనుఁగుసోదరుఁడు
తనరిన యంత్రవిద్యాప్రవీణుండు
జనలోకవిదితుండు సజ్జనహితుఁడు
తిరువేంగళార్యుండు ధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనిపుత్త్రుఁ డబ్ధిగంభీరుఁ
డమలమానసుఁడ విద్యావిశారదుఁడ
రమణ నే వరకవి రాఘవాహ్వయుఁడ
నరహరి ఘటికాద్రినాథుని పేరఁ
బరువడి నే నాంధ్రభాషలఁ దెలియ
నవని శ్రీహరిదాసు లైనట్టి సరస
కవుల సత్కృప నాకుఁ గలుగుటఁ జేసి
యీ నలకథయందు నిది పూర్వభాగ
మేను రచించితి నీచరిత్రంబు
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన

నెవ్వరు వ్రాసిన నీశుని కరుణ
నాయురారోగ్యంబు లైశ్వర్యములను
బాయకుండగఁ బుత్త్రపౌత్త్రసంపదల
నాచంద్రతారార్కు లై యుందు రెలమి
భూచక్రమున మఱి పూజితు లగుచు 898

పూర్వభాగము సంపూర్ణము.



*

# తృతీయాశ్వాసము.

---

## ఉత్తరభాగము.

శ్రీకరచారిత్ర! శృంగారగాత్ర!
పాకశాసనవేద్య! భవరోగవైద్య!
చిరపుణ్యకీర్తి! యాశ్రితనుతకీర్తి!
కరుణానివేశ! శ్రీఘటికాద్రివాస!
యవధరింపుము పాండవాగ్రతనూజుఁ
డవిరలమతితోడ నాదమయంతి
పరిణయక్రమ మెల్ల భక్తి శోభిల్ల
నరిమురి విని విస్మయానందుఁ డగుచు
కరములు ముకుళించి ఘనయోగిచంద్ర!
యెఱిఁగింపు మటుమీఁది వృత్తాంత మెల్ల
ననవుడు బృహదశ్వుఁ డారాజుఁ జూచి
వినుమని వేడ్కతో వివరింపఁ దొడఁగె
నంతటఁ గొన్నాళ్ల కాదమయంతి
కాంతాలలామంబు గర్భంబుఁ దాల్పఁ
బరిపూర్ణసోముని బడలించుమోము
దొరకొని వేగుచంద్రునిరీతి నుండె

ననవిల్తుపూఁచెం డ్లనం దగుచనుల
మొనల నల్లనివర్ణములు గానుపించె
మృదుబింబముల వన్నె మెచ్చనిమోవి
కదిసిన మలినంబు గప్పినట్లుండె
బడలికల్ మేనునఁ బర్వె నందంద
నడుము మందం బాయె నాభి గన్పడియె
నవరణ నల్లపూసలపేరువోలె
నవిరళం బగుచు నూగారు నూపట్టెఁ
గలికిచూపులఁ జంద్రికల్ పర్వె నఁగ
వలచఁబాఱెను గండపాలికాయుగళ
మలివేణి ముఖచంద్రుఁ డమృతంపురసము
చిలుకుచందంబునఁ జిట్టము లెసఁగ
గగనభాగంబు నాకాంత మై యొప్ప
పగిదిఁ గౌఁదీఁగె చూపట్టె నానాఁటఁ
బొలు పొంద నవమాసములు పూర్ణమైన
నలర సమస్తగ్రహంబులు వరుసఁ
దప్పక తమతమతావుల నుండ
నప్పుణ్యలగ్నంబునందు నయ్యింతి
మరునిభుం డైనకుమారునిఁ గనియెఁ
బురుహూతసమునిఁ దత్పుత్త్రినిఁ జూచి
గురుతరమతి తనకులగురు వైన

గురువు వసిష్ఠుని గోరి రప్పించి
ధారుణీసురుల బాంధవుల నాగరులఁ
గూరిమి నందఱఁ గూడ రప్పించి
యంతట గురునాథుననుమతంబునను
సంతోషచిత్తుఁడై జాతకర్మంబు
నలరంగఁ జేయించె నపుడు పుత్త్రునకుఁ
జెలువు మీఱఁగ నింద్రసేనాహ్వయంబు
నొనరంగఁ బెట్టి పుత్త్రోత్సవం బెల్ల
ననురక్తిఁ జేయించె నపుడు భూసురుల
కాదిభూదానకన్యాదానములను
గోదానములఁ జేసి కౌతుకం బెలర్పఁ
దక్షిణవారి కందఱి కభీష్టముల
మక్కువ నొసఁగి యిష్టిమై నేలుచుండె
అది యెల్లఁ గనుఁగొని యాకలిపురుషుఁ
డెదలోనఁ జింతాసమేతుఁడై యపుడు
దమయంతితోఁ గూడ ధారుణీశ్వరుఁడు
కొమరుని బడసి యీకుంభిని నెల్ల
నేలుచున్నాఁడు నే నిట వచ్చి యెంత
కాల మాయెను ఇంతఘనుఁ డౌట యెఱుఁగ
నెఱిఁగిన నే నేల యిందు వచ్చెదను
హరిహరబ్రహ్మాదు లంతటివారి

నామాయఁ బడ్డనైతు నరులు నా కెంత
యేమిసేయుదు నింక యేవిచారంబు
కోమరువాల్లను బెడ్డకోమటివలెను
దేమలక వెనువెంటఁ దిరుగఁ బోయెదను
వనజాక్షికిని స్వయంవర మున్నమాట
విని దాని వరియింతు వేవేగ ననుచు
పురుహూతుకడ కేల పోయి చెప్పితివి
సురనాయకుఁడు మున్ను సుదతిని గోరి
పోత్రిమి నీ వేల పోయెద వనుచు
నాతోడ నతఁ డేల నవ్వుచు జెప్పఁ
గోపించి యప్పు డా కుధరారితోడ
నేపునఁ జలపట్టి యేగతి నైనఁ
గలఁచి గాఱించెదఁ గాక నే ననుచు
పలుదెఱంగుల నేల పంత మాడితివి
పురుహూతుఁ డప్పుడే పోవ ద్దటంచు
పరసతిఁ బలుమాఱు చాటించి చెప్పె
వీఁకతో నామాట వినక వచ్చితని
నాకేశుఁ డేమని నవ్వునో యెఱుఁగ
నితఁ డనాచారంబు లెన్నఁడు చేయు
నతివేగ నే నెప్పు డంటఁ బోయెదను
తనవల్లఁ బొసఁగని తప్పులు గలవె

యని యని తలపోసి యంతలో రోసి
యింత కాలము గాచి యిఁక నేను బోవ
పంతంబు గా దిది దేహట్టున నైనఁ
జేరి యీప్రతిన నేఁ జెల్లింప కున్న
నారయ నన్న గా దంట్రు లోకముల
నని యిట్లు మదిలోన నందంద తలఁచు
చును గాచి యుండె నశుద్ధిఁ గోరుచును
నంతటఁ గొన్నాళ్లు కాదమయంతి
కాంతాలలామంబు గర్భంబుఁ దాల్చి
సానఁ బట్టినమరుశరమో యనంగ
మానుగా నొక్కకుమారుని గనియె
ధరణీశుఁ డప్పుడు తన తనూభవుకు
నరుదార జాతకర్మాదుల నెల్ల
నేత్రోత్సవంబుగా నిఖిలంబుఁ దీర్చి
పుత్త్రికోత్సవ మిట్లు బుధు లెన్న నడపి
పెన్ను మీఱఁగ నింద్రసేనాహ్వయంబు
కిన్నయ కిడె ధరాకాంతుఁడు వేడ్క
నట నశ్వమేధాధియజ్ఞముల్ సేసి
కుటిలుల నడఁచి సద్గుణుల రక్షించి
యాచారవంతుఁ డై యతిధర్మబుద్ధి
భూచక్ర మెల్ల నేర్పున నేలుచుండె

నామాత్రి దైవారి యట నొకనాఁడు
వేమాఱు దా శౌచవిధి సల్పునపుడు
మడిమ నొకించుకమాత్రంబు నీటఁ
దడియక పొడి యున్న ధర్మేతరుండు
ముదమున నది దెల్లముగ నిరీక్షించి
యదయుఁడై తనకార్య మంత యీడేరె
నని పొంగి తనదు మే నంతయుఁ దాచి
పనివడి సూక్ష్మరూపమ్ము ధరించి
మొదలున భారమై యుండక యెప్పు
డురుగక యచ్చోట నూఁతగా నిలిచె
అది గానలేఁ డయ్యె నవనీశ్వరుండు
విదితసత్కర్మముల్ వేగ తీర్చుచును
నిర్మలచిత్తుఁడై నెలఁతయుఁ దాను
ధర్మంబు దప్పక ధర నేలు చుండి
యొకనాఁడు నలవిభుం డుత్సాహి యగుచు
నకలంకరత్నసింహాసనసీమ
నిరుగడ హితపురోహితమంత్రివంశ
గురులు గొల్వఁగ నిండుకొలు వున్న వేళ
కలి తన రూపంబు కఠినరూపంబు
గలయొకబోయ యై కనుపట్టె నపుడు
కుఱుచవెంట్రుకలపైఁ గుళ్లాయిఁ బెట్టి

గఱుతుగాఁ జిగురుటాకులు గొన్ని పట్టి
నాకెకు ముదురుమీసముల నల్లుచును
బోరనఁ జనుదెంచి భూనాథుఁ గాంచి
చెలువంగ మింటికి చెయ్యెత్తి మ్రొక్కి
మెలఁకలఁ దనజాతిమాటల ననియె
వినుఁ సామి నా చిన్నవిన్నపం బొకటి
ఘనమైనదేవర ఘనమైనదొరవు
మే మున్నచారమున మృగములు పెక్కు
సామి కైన గణింప శక్యంబు కాదు
మన్నుబోతులు మఱి మనపులేనుఁగులు
గున్నలు సింగముల్ తొలఁగక యుండు
లేడిపిల్లలు దుప్పు లేనూఱుకోళ్లు
కూడి మిన్నులఁ దాకఁ గుప్పించి దాఁటి
పందులు నదులవెంబడి ద్రవ్వుచుండఁ
గుండేటిఁ గుందేలు కుప్పించి దాఁటు
నెలుఁగులు చీమల నెగఁ బిల్చుఁ బుట్ట
బిలముల గుహలందు బెబ్బులుల్ చిఱుత
పులులు గొండ్రిలుచుండు భూరుహాగ్రముల
జాతిగున్నలును గండభేరుండములును
లావుకల్ చిలుకలు లకుముకుల్ జిలుఁగు
పావురంబులు సాళువపుడేగములు

పోలు పొందు బహుమృగంబులు ఖగంబులును
గల పిట్లు మే మున్న కాంతారభూమి
నా వింత లన్ని యే మని విన్నవింతు
భాషించి కన్నులపండువు గాఁగ
మేటిఘోటక మెక్కి మృగయులతోడ
వేఁట లాడఁగ మీరు వేంచేయవలయు
ననవుడు మోదించి యాత్మ నుత్సాహించి
యొనరంగ వానికి నుడుగర లిచ్చి
యరుగుము రేపటి కాలాగె మేము
అరుదెంచెదము వేఁట లాడంగ ననిన
విని బోయవాఁ డంత వేవేగఁ గదలి
చని పురి వెడలి యిచ్చ నదృశ్యుఁ డయ్యె
మనుజేంద్రుఁ డంతట మంత్రిని జూచి
యనురక్తితో వేఁట లాడఁగ వలయు
మనము రేపటికి సమ్మదము దైవార
నని పల్కు చుండఁగా నంతలోపలను
విపులతేజము మాని వెసఁ గప్పె మింటి
యపరభాగంబున నర్కుండు గ్రుంక
జగతీశ్వరుఁడు కొల్వు చాలించి లేచి
నగరిలోపలి కేగె నయమార్గమునను
నలి రేగ యంతలో నాల్గు దిక్కులను

బలు వైనచీకటుల్ పర్వ నందంద
కలువలు వికసించెఁ గమలముల్ మొగిచెఁ
దళతళ వినువీథిఁ దారలు పొడమె
నంతఁ జంద్రోదయం బైన నిద్రాత్రి
నెంతయు వెన్నెల లెసఁగె నా పిదపఁ
గమలబాంధవుఁడు నిక్కముగ నీ దిశకు
నమరంగ నిదె వచ్చు నని పల్క వచ్చు
వేఁగుఁ వాఁడును బోలె వెలి వేఁగుచుక్క
బాగుగాఁ బూర్వదిగ్భాగంబునందుఁ
జూపట్టె నంతలోఁ జుక్కలు మాసె
నేపు మీఱఁగ పక్షు లెలుఁ గిచ్చి కూసెఁ
దరిగెఁ గేళీగృహాంతర్దీపరుచులు
పొరిఁ బొరిఁ గుక్కుటంబులు కూయఁ దొణఁగె
ముద మంది తామరల్ ముఖములు విచ్చెఁ
బొదలక కల్వగుంపులు చింత నొందెఁ
పొరిఁ బొరి పాములు పుట్టలఁ జేరెఁ
దఱు చైనభూతముల్ తల సూప వెఱచెఁ
దనరినయింద్రనందనవనంబునను
ఘనతఁ బూసిన కింశుకంబో యనంగ
నరుణోదయం బయ్యె నంతలోపలను
ధరణీసురులజేతఁ దాఁ బూజఁ గొనుచుఁ

దపముల మెచ్చు నెత్తఃబుల హెచ్చు
తపనుండు పూర్వభూధర మెక్క నంత
నలరాజు మేల్కని నగరు వెల్వడలి
వెలయంగ సంధ్యాదివిధు లొప్పఁ దీర్చి
కుంకుమఁ బన్నీరుఁ గూర్చినగంధ
పంకంబుఁ దనమేన బాగుగా నలఁది
నలువుగాఁ గస్తూరినామంబుఁ దీర్చి
చెలఁగుచు విరిసరుల్ సిగ నిండఁ దుఱిమి
బిరుసువన్నెరుమాలుఁ బొందుగాఁ జుట్టి
సరి లేనిరత్నభూషణములు పెట్టి
వరుస బంగరువ్రాఁత వ్రాసినజిలుగు
సరిగెదుప్పటి మొల సంఘనఁ దాల్చి
పాటించి కన్నులపండువుగాఁగ
వేఁట శృంగారంబు వెలయంగ మించి
యపరిమితోత్సాహుఁ డగుచు నలుండు
విపినయాత్రాభేరి వేయించె నంత
నపుడె యీ బ్రహ్మాండ మగలిన ట్లయ్యె
భూతల మదరె నభోవీథి బెదరె
భీతిల్లె గ్రహములు బెగడె భూతములు
జలధులు గలఁగె నక్షత్రముల్ రాలెఁ
గులగిరుల్ గదలె దిక్కులు వీలె నపుడు

శత్రురాజన్యులు సకలంబు డించి
మిత్రుల డించి నమ్మినవారి డించి
హయముల డించి భోగావళి డించి
రయమున వారణరథముల డించి
కొందఱు కొండల గురుతరాటవులఁ
గొందఱు పట్టిరి గుండెలు జెదరి
చపలతఁ బ్రజలు మూర్ఛను నొంది రంత
నపరిమితోత్సాహులై వేటకాండ్రు
కుఱుచమీసమ్ములు గుజ్జురూపములు
బిరుసైనమేనులు పెద్దపిక్కలును
చిఱుతపీనులు నెఱ్ఱజీర్లకన్నులును
గురువిందపూసలఁ గొమరొప్పు పేర్లు
నెఱిమించఁ దిలకించు నీలిధట్టులును
కుఱుచకాసెలచెంగుకొనలు బిగించి
పట్టుచుంగులు మీఁదఁ బ్రబలి తనర్పఁ
జుట్టుకాసెలు నిండ నురియలు చెక్కి
పిడెములు మొలఁ జెక్కి బిరుదుమాష్టీలు
బెడ గొందుపీఁచుల బిల్లలు కుట్టి
కడిఁదిమేకంబులు గఱవక యుండఁ
దడబడఁ బాములు తరుమక యుండ
వల నైనబడనికల్ వాకట్టువేళ్లు

తలముళ్లఁ దిరముగాఁ దాల్చి మేనులకుఁ
దళుకుగా మించుదంతపుబిల్ల నమరు
చిఱుతకాసెలు వలచెంపల నమర
వలలబంధ్లను పోగువాగుమోకులును
బలువాడి మీఱినసందిబల్లెములు
జిగురుకోలలు మేటిచిక్కము లురులు
తెగనీలిదుబ్బులఁ ద్రిప్పుడు త్రాళ్లు
పిగిలిచెంప్లమరిన పడ్డయీటెలును
జిగివెండికట్లచేఁ జెలఁగుసింగిణులు
మెలపుసింగంబులమీఁదను గదియఁ
గలిగినవేఁటకుక్కలను బంగారు
గొలుసులఁ బట్టించి ఘోరాననములు
గలిగి భయంకరాకారులై వెడలి
రంతట నలవసుధాధీశుఁ డధిక
సంతోషమున మణిస్యందనంబందుఁ
దనయుండు మంత్రియుఁ దనకూర్మిసతియుఁ
దనుఁ గొల్వఁగాఁ బ్రమోదంబున నెక్కి
భేరి వేయించెను బృథివి కంపింప
వారక దొర లిరువంకలఁ గొలువ
జనవల్లభుఁడు వేఁటఁ జనుదెంచె నపుడు
గొనకొని నల్లనికొండలో యనఁగ

కరమొప్ప నవ్వేఁటకాండ్రు వేవేగ
అరదంబుముందఱ నందంద రాఁగ
బలుసింగములనైనఁ బాఱఁ బోనీక
చలమున గుండియల్ జాఱఁ గుమ్మెదము
పులి నైన గవిఁ జొచ్చి పోట్టలివలెను
యులిమీఁదఁ బడి కుమ్మి యీడ్చి తెచ్చెదము
మదగజంబుల నైన మదము లడంచి
పదపడి విడువక పట్టి తెచ్చెదము
దొరసి మిన్నుల బాఱు దుప్పుల నైన
బిరబిర ఖండించి పెఱికి తెచ్చెదము
హరివరాహంబుల నందంద తఱిమి
జరజరఁ గండలు చెండి తెచ్చెదము
పులులఁ గాననములఁ బోనీక చేతి
బలిమి బల్లెంబులపాలు చేసెదము
ధరణీశ! యనుచుఁ బంతము లాడుకొనుచు
నరుగుచో నెదుట నింపయి మాఁకులుంగ
భల్లాతకీ పారిభద్ర మధూక
సల్లకీ కురువక సాల హింతాల
బదరి తింత్రిణీ బిల్వ పాటలీ క్రముక
కదళీ వటాశ్వత్థ ఖర్జూర లుంగ
పనస పిప్పల నింబ బంధూక సరళ

ఘనసార తాళ మాకందాదితరులు
ఘనపదం బంటి చుక్కల రాయు చుండ
గొనకొని ముప్పిరిఁ గొనుచు నేలాది
మల్లి కాదికలతల్ మహీజకుంజముల
నల్లన రవిరశ్మి యడరనియిరుల
నడవిఁ బ్రవేశించి యారాజవిభుఁడు
కడుపడి మేఘముల్ గర్జించినట్లు
ముద మొప్ప శంఖసి మ్రోయించె నపుడు
బెదరి మృగావళి భీతిల్లి కలఁగి
పిలపిల చెవు లెల్ల బిక్కరించుకొని
సొలసి నల్దిక్కులు సూచుచు నుండ
పిడుగులకంటెను బెడిద మైనట్టి
కడువాఁడితూపు లొక్కట నలుం డేయఁ
దనువుల నాటినఁ దత్తరించుచును
గొనప్రాణములఁ దన్ను కొనెడియేనుఁగులు
విలవిలఁ బ్రాణముల్ విడుచుసింగములు
బలునెత్తురులఁ దోఁగి పడెడుబెబ్బులులు
పడి మెడల్ దెగి నేల వ్రాలుదుప్పులును
బడిబడి పోలేక పడుగండకములు
యురములు దెగి నేల నొరగుదున్నలును
సిరములు దెగి పడుసింగిలీకములు

పలుమాఱు గూయుచుఁ బడెడుజింకలును
దెలియక భయమునఁ ద్రెళ్లునక్కలును
యవనిపైఁ బడి పొరలాడుపందులును
తవిలిన పొదలలో దాగుకుండేళ్లు
లీరీతి మృగముల నేపడగించి
ధారుణీశ్వరుఁ డంత దయఁ దాల్చి నిల్చి
వేఁట సాలించిన వేఁటకాండ్రడవి
దాఁటించి మదిఁ దప్పి దారినయట్టి
ఘనమృగంబులమీఁదఁ గదియుచు భీతిఁ
గొనఁగ నేవుల నుసికొలిపి బాణములఁ
బదములు ఖండించి పార్శ్వముల్ నఱికి
రదములు గెడపి కరంబులు ద్రుంచి
నఖములు దునిమి ఖడ్గములు ఛేదించి
ముఖములు చెక్కి కొమ్ములు నుగ్గు చేసి
నడుములు నఱికి మార్గంబు గావించి
తొడలు చెండాడి కుత్తుక లుత్తరించి
ముక్కులు చెక్కులు మూపులు తలలు
ప్రక్కలు పిక్కలు బరులును దరలు
కరములు నురములు గాళ్లును వ్రేళ్లు
శిరములు పిఱుఁదులు చెవులు ఫాలమ్ము
లత్తరి యిది యది యని చెప్పరాక

కత్తులఁ బచ్చడిగాఁ గోసి రట్లు
తుత్తుమురై రూపు దోపక కలిసి
నెత్తురుముద్దఁగుల నెఱిఁ దేలి యాడ
నల లొడ్డి యురు లొడ్డి వాగులు గట్టి
కలయ మచ్చులు సల్లి కనుములు గట్టి
యేజాతివిహగంబు లేరీతిఁ బలుకు
నా జాడపలుకుల నవ్వు పిల్చుచును
దిరుగుడు త్రాళ్లను దెఱఁగొప్పఁ గట్టి
యురు లొడ్డి జిగురుల నుసురుగాలముల
సాళువంబుల మేటిజక్కువంబులను
లాలన నాడెడులావుకంబులను
కముజులఁ జిలుకలఁ గ్రౌంచపక్షులను
భ్రమయించుపూరేండ్లఁ బావురంబులను
బెళగువ్వలను గొంగపిండులు నిట్లు
పులుఁగుల నన్నిటి బోరనఁ బట్టి
వేఁటచాలించి యాపృథివీశుకడకు
మేటి దంతంబులు మేటిజల్లులును
కరిశిరంబులలోనిఘనమౌక్తికములు
వరుసతోఁ బునుఁగుజవ్వాదికస్తూరిఁ
గడువేడ్కఁ గొని తెచ్చి కానుక లియ్యఁ
దడయక యవియెల్ల దమయంతి కిచ్చి

పరఁగంగ వారికి బహుమాన మిచ్చి
యురువునఁ దనమంత్రి మోము వీక్షించి
తలఁపున నీ వేఁటతమకంబు కతనఁ
దలకొని మన మెంత దవ్వు వచ్చితిమి
యనుచును దనపురి కరుదెంచు నెడను
దనరిసవనదేవతలు వేడ్కఁ జూచు
బాగైన నిద్దంపు స్ఫటికదర్పణము
లాగున నీలోత్పలంబులచేతఁ
దళుకైన కమ్మగందమ్ములచేత
మెఱుఁగు నీలపుగుండ్ల మెచ్చని తీరు
మెఱయించు మీటితుమ్మెదగుంపుచేత
కర మొప్పు మంచి చెంగల్వలచేతఁ
బైడిఱెక్కలు గలపక్షులచేత
వాడిగోరుల గోరువంకలచేత
బలువుగా నున్నట్టిబకములచేత
సలలితం బగుక్రౌంచసంఘంబుచేతఁ
గ్రమ మొప్పఁ జక్రవాకంబులచేత
రమణీయమై తదారావనీరంధ్ర
కలకలశబ్దసంగతమైనయొక్క
కొలను గనుంగొని కువలయేశ్వరుఁడు
తరుణియుఁ దాను నత్తరిఁ దేరు డిగ్గి

కరతలంబున మంత్రికర మూతఁగొను మ
జలజాకరము సొచ్చి జలములఁ గ్రోలి
యలరంగ నచ్చోట నతివిచిత్రముగను
జెలువు మీఱఁగ జగజెంపుగాఁ బ్రబలి
విలసిల్లుసహకారవృక్షంబునీడ
సరసిజపత్త్రిముల్ సాలంగ నెఱపి
యొరపుగాఁ జిలిరాకు లొనరంగఁ బర్చి
పఱచిన మృదుచారుపానుపుమీఁద
ధరణీశుఁ డతులమోహంబులోఁ గుతను
దలఁపున దమయంతి గమయంతితోఁ జెలు
తలగడగాఁ జేసి తగ విశ్రమించి
గురుతుగా ఘనువంపుఁ గొనలను వచ్చు
సురటి వట్రువగాలి సుడియంగఁ ద్రప్ప
నలతతోఁ గనుమోడ్చుపంతలోపును
గలఁగి యొప్పనికలఁ గసి మేలు కాంచి
డిగ్గున లేచి నల్దిక్కులు సూచి
యగ్గలంబుగ ఖేద నందంద పడెడు
నమ్మానవాధీశు నప్పుడు చూచి
యమ్మానినీమణి యతిభక్తితోడ
నరు దైనకెండమ్మి నలరించు ముద్దు
కరమునఁ జెలు వందఁగా వీఁపుఁ జఱచి

రమణీయ మగుతనరత్నకంకణము
రమణున కప్పుడు రక్షగాఁ గట్టి
యిది యేమి వెఱచితి యినకులాధీశ!
మదిలోన నీవు సామాన్యునివలెను
వక్రంబు నీ భూమి వసియింపనీక
చక్రంబు పనిసేయ జగము నేలుదువు
ఘనుఁడవు సకలలక్షణగుణోన్నతుఁడ
వనుపమాజయశాలి వర్కవంశజుఁడ
వని తన్నుఁ దెలిపిన యాపువ్వుబోణిఁ
గనుఁగొని నలమహీకాంతుఁ డిట్లనియె
నెలనాగ! యే మని యెఱుఁగంగరాదు
కలఁగకు కొఱగానికలఁ గంటి నిపుడు
తెలియఁ జెప్పెద దానితెఱఁ గెల్ల వినవె
యలివేణి యీరాజ్య మంతయు మనము
విడిచి వేదనఁ బొంది విపినంబులోన
నుడుగక నిద్దఱ మొక చీరఁ గట్టి
పరువడి బాధలఁ బడి కొంతకాల
మరిగినపిదప శ్రీహరికటాక్షమున
మనము రాజ్యసుఖాప్తి మనఁ గంటి నిప్పు
డని యిట్లు దుస్స్వప్న మధిపతి సెప్ప
వెఱచి తా వెఱవనివిధమునఁ బలికె

నరయంగ దీనికి నడలు నేమిటికి
అందుల కేమి శ్రీహరియాజ్ఞ మీఱి
పొందునే దుఃఖంబు భూతలాధీశ!
సత్యమే జయ మని సకలశాస్త్రములు
నిత్యంబుగాఁ బల్కు నిఖిలంబులోన
సమగాన సత్యమే యధికధర్మంబు
సద్గతి భాగ్యసంపద గల్గు మనకు
నని యిట్లు పలుకంగ నటు వివేకించి
తనబల మంతయుఁ దన్నయుఁ గొలువ
భేరీరవంబులు పెల్లుగా మ్రోయ
ధారుణీనాథుండు తనపురి కరిగి
వెలయుచుఁ గలిమాయ వే యొక్క వేళఁ
దెలిపియుఁ దెలియని దెఱఁగున నుండ
భీమునివరపుత్రి బిసరుహనేత్రి
భామాలలామ నిర్భరగుణోద్దామ
పరమపతివ్రత బహుధర్మనిరత
వరరూపవిభవ లావణ్యవిహారి
దమయంతి సత్యంబు దరలంగనీక
నమరిన వేడ్కతో నప్పటప్పటికిఁ
దనప్రాణవిభునకు ధర్మశాస్త్రముల
ననురక్తిఁ జెప్పఁగా నతఁడు సత్యమునఁ

జెలువంద రాజ్యంబు సేయుచు నుండఁ
గలిరాజు మఱి కొంతకాలంబు వెనుక
మనమునఁ దలఁచి యమ్మనుజనాయకుని
ఘనముగా నేఁ బన్ను కపటజూదమునఁ
గలరాజ్య మెల్ల నొక్కటన యోడించి
తొలఁగి పోఁ జేసెదఁ దొలుతఁ గా నలకు
నలనాఁడు ధరణీధరారాతితోడఁ
బలికినపంతంబు ప్రబలఁ జెల్లింతు
నని యొక్క చెనఁటిబ్రాహ్మణరూపు దాల్చి
తనుఁ జూచువారలందఱు నవ్వుచుండఁ
కఱకునల్లనిమేను కిరినస్వరంబు
కాఱుచపాదంబులు క్రూరదంష్ట్రిలును
పిల్లువంకిలకాళ్లు పిఱిసినబొమలు
పల్లమీసంబు లొప్పసిగుంటకనులు
నరసినగడ్డంబు నత్తనాసికయుఁ
బరఘాగాఁ బెట్టినపట్టెవర్ధనము
కసిఁదిబిఁ బోష్ఠంబు కడుబొక్కినోరు
నిడుపైనమెడయును నిక్కినరొమ్ము
బలువుగా మాసిన ప్రాతదోవతియు
వెలయంగఁ జే నొక్కవేణుదండంబు
వలనుగా జగి ముడిపై చుజందెంబు

కలిగి భయంకరాకారుఁడై నలుని
దాయ పుష్కరుఁ డను ధారుణీనాథుఁ
డాయెడఁ దనవార లంపఁగా గొలువఁ
బాలుపొందఁ దనపురంబునఁ జొచ్చి మాఱఁ
గొలు వున్నయత్తరి గొబ్బునఁ బోయి
భుజగంబునై నడిఁ బొడఁగాంచి యతని
'విజయోస్తు' అనుచు దీవించి యిట్లనియె
న న్నెవ్వఁడో యని నరనాథ! బుద్ధి
నెన్నకు కలి యని యెఱుఁగుము నన్ను
దురితకర్మములకు దొర నగునాకు
సరి యైనవాఁడు ముజ్జగముల లేఁడు
హరిహరబ్రహ్మశక్రాదుల నైనఁ
దరిలక పెక్కు బాధలఁ బెట్టువాఁడ
మనుజేశ! నన్ను సామాన్యుఁడ వంచు
నొనర నీ మదిలోన నుంచకు మెపుడు
విరసత నితఁ డేమి వెతఁ బెట్టుఁ దలఁచి
యరుదెంచెనో యని యడలకు మీవు
పన్నుగా నీ కొక్కపనిఁ జెప్పఁ దలఁచి
క్రన్నన నేను నీకడకు వచ్చితిని
అఱిముఱి వేవేగ నాపని సేయు
మఱి నీవు వినకున్న మాచిత్త మెడలు

వసునీశ! యాంకార్య మంతయు నిపుడు
వివరంబుగా నీకు వివరింతు నింక
నలివేణి దమయంతి యనియెడికాంత
కల దొక్కయువతి చక్కనిముద్దుగుమ్మ
నలినాక్షి పుట్టిననాఁటనుండియును
నలరుచు నేఁ బెండ్లి యాడెద ననుచుఁ
గాచియుండఁగ నన్ను గాదని మిగుల
నా చంద్రముఖిఁ బెండ్లియాడి మాణిక్య
ములవంటియిద్దఱు ముద్దుబిడ్డలను
అలరంగఁ గాంచి యీయవనిరాజ్యంబు
నేలుచున్నాఁడు న న్నెంచక నలుఁడు
తాలిమిఁ గొనదు చిత్తం బిట్టిపనులు
సరిపోయి యుండునే జగతి నేరికిని
అరుదెంచి నేఁ బెండ్లియాడెడు దాని
నెలమిఁ దాను వరించె నెంతటివాఁడు
బలభేదికన్న దిక్పాలురకన్న
నరనాథ! ధారుణీనాథులకన్న
సరసత నాకన్నఁ జక్కనివాఁడొ
నలుఁ డంచు వాని నానాతి వరించె
నిలతలాధీశ! నీ కిది సమ్మతంబె
ఎం తైన నలుఁడు నాయిష్ట మారయక

నింత కార్యము చేసె నిఁక చూఁడు మైన
నే మాయె వేవేఁగ నేగి జూదంబు
నామహీశునితోడ నాడుము నీవు
చెలు వంద వాని పాచికలలో గూడి
నిలచి యోడింతు నే నిఖిలరాజ్యంబు
నేకచక్రంబుగా నీయిల నెల్లఁ
జేకొని వేడ్క నీచేత నేలింతు
నన్నికార్యంబుల కలుగుచు నేనె
యున్నాఁడ నీ కేల యుర్వీశ! భీతి
అనవుడు సంతోష మంది పుష్కరుఁడు
వినయంబుచేఁ గలి వేల్పునుఁ గనియె
పొసగంగ నేను నీ బుద్ధులు దాఁట
వసుమతి నే నెంతవాఁడ నో దేవ!
ఆరూఢి జూదంబు లాడెద ననుచు
నారాజుకడకు నే నరిగితి నేని
సరసత నను దనసముఁడ నటంచు
నెఱిఁగి నాతోఁ బంతమిడి భ్రష్టునట్లు
లాడునే జూదంబు నతఁడు వద్దనక
వేడుకతోడుత విను మేను చపిన
ననవుడు నే వానియాత్మలో నుండి
యనురక్తితో జూద మాడెదు బుద్ధిఁ

బుట్టెంతు వేవేగఁ బొమ్ము నీ కేల
ఇట్టివిచారంబు లేగతి నైన
వానితోఁ జలపోరి వానిరాజ్యంబు
పూని నీ కీయకపోను నీ యాన
చెలు వంద రాజ్యంబు సేయు మటంచు
పలికి యదృశ్యుఁ డై పాపవల్లభుఁడు
చనియె నా నలమహీశ్వరుఁ డొకనాఁడు
మన మెలర్పఁగ సభామంటపంబునకుఁ
జనుదెంచి సకలరాజన్యులు భటులు
ఘన మైనమంత్రిపుంగవులు బాంధవులు
హితులు గాయకపురోహితులు నాశ్రితులు
నతివేడ్కఁ గొలువ సింహాసనమందు
సమరంగఁ గూర్చుండి యతివేడ్కతోడ
రమణులు వింజామరంబులు వీవ
వాకిట భట్లు కైవారముల్ సేయ
సారెకు సజ్జనుల్ సన్నుతి సేయ
కవినందిమాగధుల్ గడఁగి కీర్తింపఁ
బ్రవిమలసకలసంపదలచే నిట్లు
దివిజులతో నున్న దేవేంద్రుపగిది
కువలయేశుఁడు నిండుకొలువున్నవేళ
జననాథుకడకుఁ బుష్కరభూవిభుండు

తనవార లెల్ల మోదంబునఁ గొలువఁ
జనుదెంచి యతనికి సద్భక్తి మ్రొక్కి
వినుతులు సేయ న వ్విభుఁడు పుష్కరుని
ననుపమగతి నొక్కయర్ధాసనమున
నునిచిన మోదించి యుచితవాక్యములఁ
బరిణామమే యని పార్థివు నడుగ
హరికటాక్షంబున నందంద మాకు
ఘనతరసౌఖ్యంబు గలుగు నెల్లపుడు
మనుజాధినాయక! మఱి నీకు శుభమె
యనవుడు నీ దయ నవనీతలేశ!
యనుపమసుఖముగా నసుఖంబు గలదె
యనవుడు నిషధభూమీశుఁ డి ట్లనియె
నెనయ నాపుష్కరాధీశుని జూచి
ధరణీశ! నీ వేమితలఁపునఁ దఱఁచి
కరమొప్ప నేఁడు మాకడకు వచ్చితివి
యెన్నఁడు రావు నీ వేతెంచు టరిది
క్రన్నన వచ్చినకార్యంబు చెప్పు
మనవుడు పుష్కరుం డవనీశుఁ జూచి
గొనకొని నినుఁ జూడఁ గోరి వచ్చితిని
ఇది ఇంతె కాని యొం డేమియు లేదు
ముద మంద మదిలోన ముచ్చట దీర

మన మిద్దఱముఁ గూడి మఱి వేడ్కఁ జూద
మనురక్తి మీఱంగ నాడుద మనిన
ధరణీతలేశుండు తల యూఁచి పలికె
ధరలోన మాకు జూదం బాడఁ దగదు
ప్రవిమలసత్యసంపద పాసి పోవు
నవివేక మొలయు దురాగ్రహం బొదవు
నటుగాన జూదంబు నాడంగఁ దగదు
అటువంటిపని సేయ నర్హమే మనకు
నని పల్కుచుండఁగా నప్పుడు కలియు
మనమునఁ బ్రేరేప మది జూద మాడఁ
గోరిక వొడమి యుక్కువలయాధిపుని
గారవించి నలుండు కడక నిట్లనియె
పగడసా లాడంగఁ బ్రమదంబు నొంది
జగదీశ! యిచటికిఁ జనుదెంచినపుడు
నినుఁ జిన్నపుచ్చుట నీతిగా దింక
ననురక్తి నొకయాట యాడుడి మనుచు
మేలిమిపైడి నిర్మించినపగడ
సాలఁ దెప్పించి యచ్చటఁ జక్కఁ బఱచి
తిర మొప్పఁగా నాల్గుదిక్కులయందు
నరగున సారెలు చక్కఁగా నిలిపి
యొనరంగ పందెమేమని నలుం డిట్లు

లన విని పుష్కరుం డనియె నవ్వుచును
ఇనకులాధీశ్వర! యే నోడితేని
పనిబూని యేను మీబంట నయ్యెదను
నేరుపు నెఱుఁగక నీ వోడితేని
నీరాజ్య మంతయు నెమ్మి నా కొసఁగు
మని నిట్టియొడబాటు శాస్త్రలో మెచ్చి
వెనుకొన్న వేడ్కతో వెలయఁ బుష్కరుఁ
డోడరె జూదం బాడఁ దొణఁగి నలుండు
తడయక మేటినంతపుఁ బాసికెలను
అమరించి యొకబార యనుచు దొర్లించి
సమముగా దుగ నచ్చి చౌవంచ పగడ
యిత్తుగ యని వార లిరువురు నాడ
న త్తఱి పాసిక లందుండి మఱియు
కలి నలధారుణీకాంతుని చేతఁ
బలుమాఱు పందెంబు పడకుండఁ జేయ
నలుఁ డది చూచి చింత గదా యటంచుఁ
జలము కోపంబు రోషంబు నీమూఁడు
ముప్పిరిగొనఁగ నాముదువున నాడ
నప్పుడు కలిమాయ యని శాన లేక
సరిలేని మత్తగజంబుల నోడెఁ
గరకరి గజతురంగంబుల నోడెఁ

దడబడ కరుగురథంబుల నోడెఁ
గడఁగి నిండినధాన్యకణజంబు లోడె
పస గల్గుబంగారుపల్లకీ లోడె
మసలక ఛత్త్రచామరముల నోడె
రంగైనదివ్యాంబరంబుల నోడె
సంగీతములు పాడుసకియల నోడె
కోమరారుముత్యాలగొడుగుల నోడె
రమణీయ మగుధనరాసుల నోడె
వారక భటజనవర్గంబు నోడె
తేరుల నోడె మేదిని యోడుతఱిని
సచివుండు మదిలోన సంతాప మంది
యుచితవాక్యంబుల నుర్వీశుతోడ
ననియె నీధారుణియందు నో దేవ!
యనఘుల కిట్టిదుర్వ్యసనంబు గలదె
యిది యేమి పని యని యిప్పుడు తోఁచె
మదిలోన నిగ్గాడ మఱచితే నీతి
యీజూద మాడుట యేమి పౌరుషము
రాజేంద్ర! నగరికి రండు పోవలయు
నదె నిన్ను చెలులు రమ్మని పిలిచెదరు
ఇది వేళ కాదు నీ వింతట నిలువు
ధరణీశ! యాఁకలిదప్పులు మఱచి

తొలఁక యాడంగ ధర్మంబు కాదు
లే లెమ్మ ఆట సాలింపుము వెనుక
నాలాగె వేంచేసి యాడేదు కాక
అని పల్కి చెయి పట్టి యువలికిఁ బెనుఁగఁ
గనుల నెఱ్ఱఁగఁ జేసి కరిఁ గాంచి సింహ
ముఱకఁ జూచినరీతి నూరక చూచి
పరునడి గర్జించి పలిక భూవిభుఁడు
సీ కేల యిటువంటిసీతులు సెప్పఁ
జేకొని యెవ్వరు చెప్ప ర మ్మనిరి
విడు విడు మని చెయ్యి విడిపించికొనుచు
నుడుగక కలిమాయ నొగి యాడఁ దొడఁగె
నప్పుడు చింతించి యామంత్రివరుఁడు
తప్పక నలుఁ డు జూదం బాడు తెఱఁగు
చేరి వ ద్దని బుద్ధి సెప్పినవితము
ధారుణి నొక్కటి దక్క నంతయును
నురువిడి తోడుత నోడిన తెఱఁగు
కెరలి యాతఁడు కోపగించిన తెఱఁగు
దమయంతి కప్పుడు తగఁ జెప్పి పనిచె
దమయంతి యపుడు సంతాపంబు నొంది
యిది యేమి పని వచ్చె నిఁక నేమి సేతు
వదలక తనమంత్రివాక్యంబు వినక

యదయుఁ డై యీరీతి నాడినయపుడే
యిది దైవమాయ యొం డేమియు లేదు
మదిలోన నిఁక ననుమానంబు వలవ
దది యాదిగా నింక నెట్టిదుఃఖంబు
పొదలి యేగతి మమ్ముఁ బొంద నున్నదియొ
పదపడి దుస్స్వప్నఫల మెల్ల నిప్పు
డది యేలఁ బోనిచ్చు ననుభవింపకయ
నుదుట నేమని వ్రాసెనో మున్ను బ్రహ్మ
తనచేయుపూర్వకృత్యంబుల దాఁట
వనజాసనాదిదేవతలకుఁ దరమె
ఇటువంటిజూదంబు లెవ రైన మున్ను
తటుకున నాడిరే ధరణిలో ననుచు
నవ్వాడు వార్ష్ణేయుఁ డనెడుసారథిని
దవ్వుక రప్పించి తగ నంత చెప్పి
కొడుకును గూఁతును గొని వేగ నీవు
తడయక మాతల్లిదండ్రులయొద్ద
విడిచి యిక్కడ నున్నవృత్తాంత మెల్లఁ
గడువేగ యెఱిఁగించి కదలి ర మ్మనిన
నరుదైన యొకమేటియరదంబుమీఁద
నిరువురుబిడ్డల నెలమి నెక్కించి

పరువునఁ దోడ్కొని వార్ష్ణేయుఁ డపుడు
పరఁగంగ నా విదర్భపురంబుఁ జేరె
నప్పుడు పురము వా రందఱుఁ గూడి
తప్పక తమలోనఁ దాము చింతించి
తలపోయఁ దొడఁగిరి ధారుణీశ్వరుఁడు
చెలువంద రాజ్యంబు సేయుచుండఁగను
సకలజనావళి సంప్రీతిఁ బొందె
నిఁక నెల్లరకో యిది యెఱుఁగంగరాదు
పోడిమి మన మైనఁ బోయి జూదంబు
నాడంగ వల దని యరసి చెప్పదము
మనమునఁ దనమంత్రిమాటలు వినని
మనుజనాథుఁడు మనమాటలు వినునె
పూని శుభాశుభంబులు రెండు తనవి
యైనవి తెలియక యాడుచున్నాఁడు
జూదంబు నాడెడుచోరపుష్కరుని
వాదించి పోఁ దోలువారు లేరైరొ
యలరి భూపతి జూద మాడంగఁ బోవ
వల దంచుఁ బెద్ద లెవ్వరుఁ జెప్పరైరొ
యవనీశ! యీ జూద మాడరా దనుచు
నెవ రైన భూజను లెఱిఁగింప రైరొ

ఘనమైనకర్మముల్ గదిసినవెనుక
విన వచ్చునే యిది విష్ణునకైన
నైనను మన మిప్పు డందఱ మేగి
మాను మీజూదంబు మానుజేశ! యనుచుఁ
బలుదెఱంగులఁ జేరి పలుకుదమని
చెలరేగి మన మేమి సేయఁ బోయెదము
జూద మాపుట వసిష్ఠుం డెఱిఁగి యున్న
గా దని మాన్పడే కష్టజూదంబు
ఇఁక నైన న మ్మాని యిట కేగుదెంచి
యకలంకమతితోడ నా రాజుఁ గాంచి
యాడఁ గూడదు జూద మాపెకు మంచు
నేఁడు చెప్పినఁ గాని నిలుపునే రాజు
మనమాట నిపుడు సమ్మదమున వినును
అని పౌరజను లెల్ల ననుమానమునను
జని చని నలరాజచంద్రుని గాంచి
మునుకొని భయమున మ్రొక్కి యి ట్లనిరి
మానవాధీశ్వర! మమ్ముఁ గావఁసి
మాను మీ జూదంబు మది నమ్మ రాదు
కపటమై యున్నది కాన నీ వాద
మిపుడు చాలింపుమా యిందఱితోడు
పయి వచ్చుపని సేయఁ బంతంబు గాదు

పయి రానిపని సేయ వలయు నేరికిని
అవనీశ గెల్వ లే దయ్యె నింతైనఁ
దవిలి పోరాటము మించెఁ దగ దింక విభుఁడు
మనవుడు వారల నపు డాగ్రహించి
కనుఁగొని చెయ్యెత్తి గర్జించి పలికెఁ
జేరి నాకును బుద్ధి సెప్పఁ డటన్న
వా రెవ్వ రనుచు దుర్వారోగ్రుఁ డగుచు
కలియు గ్రూరుఁ డగుచు నాఁకలిఁ గొన్నయట్టి
పులివోలె గర్జించి పోఁ దోలెఁ బ్రజల
నీరీతిఁ బ్రజ లంద ఱేగిన వెనుక
నారాజు మఱి జూద మాడుచు పరుసఁ
దన దైనరాజ్య మంతయు నోడి పెట్టె
వెనుకొన్న కలిమాయ వెతచేత నోడె
చప్పన్న దేశ రాజన్యులు మున్ను
కప్పంబు దెచ్చిన కానిక లోడె
నవఖండభూమిమండలముల నోడె
నవలక్షపర్వతసంధుల నోడె
నలు వంక నోడెను నాల్గుదిక్కులను
ఇల నేడుదీవుల నెల్లను నోడెఁ
గట్టుచీరలతోడఁ గర మర్థి నిలిచి
యట్టిట్టు తొలఁగక యన్నలుఁ దున్న

నతనిఁ గన్గొని పుష్కరాఖ్యుఁ డానలుని
సతికి నవ్వార్త నిచ్చలు చెప్పి పనుప
దమయంతి యది విని తనమనంబునను
గ్రమ మొప్పఁ జింతతోఁ గడువెఱఁ గంది
యంతఃపురంబున నప్పుడు వెడలి
కాంతలు పురజనుల్ కడు వెఱఁ గంది
చూచుచుండంగ నాసుందరి సభకు
రాజధర్మము మాని రయమున వచ్చి
యిది యేమి భూనాథ! యీచోద్య మనిన
నదయుఁడై యేమన కతఁ డూరకుండె
నప్పుడు పుష్కరుం డది చూచి నలుని
దప్పక యిప్పుడే తరుణితోఁ గూడి
యీరాజ్యమున నుండ కేకాన కైనఁ
జేర బొమ్మనిన నాక్షితిపతిఁ జూచి
నలుఁ డిట్టు లనియె నో నరనాథచంద్ర!
నలలితంబుగ మేము చనియెద మింక
కలిరాజు మ మ్మింత గాసి పెట్టఁగను
ఎలమితో నడవికి నేము పోయెదము
నీ వింక నిద్ధారుణిని నేలు మకట
యావిధి చేసె నేమం దింక ననుచు
బ్రవిమలంబుగ మంత్రి పాటించి తెలియ

వివరింప నే నేల వినకపోయితిని
కర్మ మేమిట నైనఁ గావించుఁ గాని
కర్మము మేలును కర్మమే కీడు
కర్మమే సుఖదుఃఖకారణం బగుచు
కర్మంబు వచ్చినఁ గైకొన కిపుడు
పొమ్మన్నఁ బోవునా పూర్వకృతంబు
తమ్మిచూలికి నైన ధరవైరి కైన
హరి కైన సతిమనోహరునకు నైన
సురల కైనను మానుష్యు లనంగ నెంత
యనుభవింపక తీర దదియెల్ల నిక్క
మని యిట్లు తెలిపోసి యప్పు డాత్మపతిఁ
గనుఁగొని పలికెను గ్రమముతో సుతను
మనము కానలకు సమ్మతిఁ బోవవలయు
మనమున నిఁకఁ జింత మాని రమ్మనిన
విని యాసతీమణి విభునివాక్యంబు
జవ దాఁట కప్పుడే సమ్మతి వెడలె
నవనీశుఁ డింతితో నడవికిఁ జనుట
పురజను లాలించి పురపురఁ బొక్కి
వెఱచుచుఁ దమతమవీథుల నిలచి
గుంపులు గూడుక గుజగుజ రాజ
దంపతులను జూచి తహతహఁ బలికి

రక్కటా యిట్టిమహాపుణ్యమతుల
కక్కష్టమును బొందు నేటికిఁ గలిగె
నిటువంటియాపద లేటికి వచ్చె
నెటువలెఁ బోవునో యేమి సేయుదము
వేరు పుణ్యాత్ములు లేరు సజ్జనులు
వీరికి నాపద విడుచు నెద్దాన
నని యిట్లు పురజను లలమటపడుచు
తనుఁ జూడ వారలఁ దాను జూడకయ
తల వంచుకొనుచును నగుసిగ్గుతోడ
కలివేధఁ దగిలినకతమున నిట్లు
పురవీధు లప్పుడు పొందుగా వెడలి
పురపురఁ బొక్కుచుఁ బురి నిర్గమించి
కరముఁ జింతించుచుఁ గాంతతోఁ గూడ
దొరకొని దైవంబు దూఱుచుఁ జనియె
అక్కట పురజను లందఱు నవుడు
రక్కసి పుష్కరరా జని వెఱచి
దమయంతితో నలధరణీశ్వరుండు
తముఁ బాసి చనుట కాత్మనె కుంది రంద
అప్పుడు నిషధేశుఁ డాపురి వెడలి
తప్పక దమయంతిఁ దగఁ జూచి యనియె
నేమి సేయుదు కార్య మిఁకఁ దప్పి వచ్చెఁ

గామిని! మన మింకఁ గానలయందు
దైవతంత్రమున నిత్తరి నుండవలసె
దైవంబు నన నేలఁ దమకర్మ మిట్లు
బాధించుచుండంగఁ బగఁ బట్టినట్లు
వేధించి పుష్కరవిభుఁడు జూదంబు
నాడించి సంపద లన్నిఁటఁ గొనియె
పోడిమి చెడి యిట్లు పొగలంగవలసె
ధర్మమార్గంబునఁ దనరుట మనకు
నిర్మల మగుబుద్ధి నెక్కొను మందు
నని యిట్లు దమయంతి నట్లూరడించి
పనివడి పురసమీపంబునఁ దనరు
నొకపర్వతముఁ గాంచి యురువివేకమున
నకలంకచిత్తులై యప్పుడింటందుఁ
నుపవాసముల నుండి యుదయాస్తమెసంత
నపరిమితాయాసులై తోర్వఁ బట్టి
యావనభూమిలో నప్పుడిద్దఱును
బోవంగఁ బోవంగఁ బొదరిండ్లనడుమ
బ్రహ్మసమానుండు బ్రహ్మర్షివరుఁడు
బ్రహ్మలోకమునుండి వచ్చిన ట్లున్న
యావసిష్ఠుని గాంచి యంత మోదమున
సావధానము గాఁగ సాఁరెకు మ్రొక్కి

నలరాజచంద్రుండు నయము మీఱంగఁ
గులకాంతతోఁ గూడి గురుభక్తియుక్తి
మ్రొక్కినఁ గనుఁగొని మునినాయకుండు
నక్కజంబుగఁ జూచి యప్పుడి ట్లనియె
నిదియేమి జననాథ! యిందు వచ్చితివి
ముదితతోఁ గూడ నీముద మెల్లఁ దొలఁగి
యీవిధిఁ జనుదేర నేమిటఁ గల్గె
నని ముని పలుకంగ నవనీవిభుండు
కనుఁగొని సంతోషకలితుఁడై పలికె
నో వసిష్ఠమునీంద్ర! యోదయాసాంద్ర!
నావిన్నపం బెల్ల నయముగా వినుము
గతజన్మకర్మసంస్కారఫలంబు
కతన నీదురవస్థ క[illegible] మా కిప్పు
డెఱిఁగి యెఱింగి [illegible]ల నన్నదుగ
నరు దండ నేల నే నై విన్నవింతుఁ
దొడర పుష్కరరాజుతోఁ జూద మాడి
పుడమిని సంపత్తిఁ బొరిఁబొరి నోడి
మానినితోడ సమ్మదమున నిపుడు
కాననభూమికిఁ గదలి పోయెదను
పరమయోగీంద్ర! నీపాదపద్మములు
కర మొప్ప సేవింపఁ గలిగె భాగ్యములు

అనవుడు హా! యని యమ్మునీశ్వరుఁడు
తనమనోదృష్టిచేఁ దప్పక చూచి
వెఱ గంది యమ్మహావిభున కిట్లనియె
ధరణీశ! మున్ను నీకమయంతిఁ బెండ్లి
యాడిన నీమీఁద నది నెప మెన్ని
పోడిమి సెడఁ గలిపురుషుఁ డీ[illegible]చె
మంచి దందుల కేమి మహిమ శోభిల్ల
మించినసత్కీర్తి మెఱసెద వీవు
కర్మవశంబునఁ గలుగుబాధలకు
ధర్మంబు వదలకు తలఁచకు సుఖము
మదిలోన సత్యంబు మఱవకు మెప్పుడు
పొదవినసౌఖ్యంబుఁ బొందెద వీవు
ఖగపతిపై నెక్కి కమలావిభుండు
వగ పెల్ల మాన్పి ప్రోవఁగఁ జూచు నిన్ను
వెఱవకు మని పలికి విభుని వీడ్కొలిపి
సరగున ముని నిజాశ్రమమున కరుగ
నంతట జననాథుఁ డాసమీపమున
వంతలఁ గుందుచు వాసరత్రయము
నుపవాసముల నుండె నువిదయుఁ దాను
జపలపుష్కరభీతి జన రెవ్వ రటకు
భూకాంతుఁ డప్పు డా పొలఁతుకఁ జూచి

యూఁకటిపెల్లున సందండఁ బలికె
నలినాక్షి! పూర్వజన్మంబున మనము
తెలియక మఱి మూఁడుదినముల నెవరి
నుపవాసములఁ గుంద నుండఁ జేసితిమొ
చపలాక్షి! మనకు నీజన్మంబునందు
నూరిముందటికాన నుపవాసగతుల
నూరక మూఁడునాళ్లుండంగఁ గలిగె
పెట్టినవారికిఁ బెట్టుఫలంబు
పెట్టనివానికిఁ బెట్టదు సుమ్ము
జలజాక్షి! కలిమియే చక్కదనంబు
కలిమి గల్గినవాఁడు కలరు బంధువులు
కలిమియే సౌఖ్యంబు గలిమియే సుఖము
కలిమియే చుట్టాలు గలిమియే సఖులు
కలిమియే పతులును గలిమియే సుతులు
కలిమియే సకలంబు గలిమాయచలను
కలిమి పోయినవెనకఁ గడఁగి చుట్టంబు
తెలనాగ యొక్కరైన నిందు రారైరి
పుడమి సౌఖ్యంబులఁ బొందినవారు
చెడినయప్పుడు చెంతఁ జేరంగ నీయ
రలరుచుఁ బుక్కరుఁ బాడుజూదంబు
చెలియరో! యది చూడఁ జిత్రమయ్యెడిని

ఇది దైవమాయ యొం డేమియు లేదు
మదిలోన నొకచింత మఱి పోల దింక
విపినభూములలోన విహరింపవలయు
నిపుడు నీ కోఱబుద్ధి నెఱిఁగింతు వినుము
శృంగారవనములోఁ గ్రీడింపలేని
యంగన! వని నెట్లు లటఁ జరించెదవు
మును సౌధసోపానముల నెక్కలేని
వనిత! యె ట్లెక్కెదు వసుధాధరముల
స్ఫటికంపు మేల్కట్ల పై నెక్కలేని
కుటిలకుంతల! యెట్లు గుట్ట లెక్కెదవొ
యురు దైన రత్నదేహళి దాఁటలేని
గరిత! యేగల దాఁటఁగలవు ఘట్టముల
నా వెంట నడిగాక నడువంగ లేవు
వారక బిడ్డలవద్దికిఁ బోయి
నీతల్లిదండ్రులనిలయమం దుండు
నాతి నీ వేడఁ గాననభూమి లేడ
నే తెఱంగున నిర్వహింతు వట్లాట
నీమహోటవులకు నేల వచ్చెదవు
కోమలి నా మేలుఁ గోరుచు నిపుడు
కలఁగక పుట్టింటికడ కేగు మనిన
నెలుఁ గెత్తి బెట్టుగా నేడ్చె భూనాథ!

యిటువంటిమాటల నిపు డాడఁ దగునె
కటకటా నే నెంత కడుపాపమతినొ
అరిమురి నడవి మీ రడలుచు నుండ
నరనా! థపురమున నా కుండఁ దగునె
కలఁగి మీ రడవులఁ గాయలు నమలఁ
జెలఁగి నే నన్నంబె చేయి ముట్టఁ దగునె
పర్ణశాలల మీరు పవళించి యుండ
స్వర్ణగేహంబుల శయనింపఁ దగునె
నగములపై మీరు నవసి వర్తింపఁ
దగినమేడల నుండఁ దగు నయ్యె నాకు
మృగములలో మీరు మెఱసి వర్తింప
మగువలలో నాకు మఱి యుండఁ దగునె
గిరిగృహంబుల మీరు క్రీడించుచుండ
విరులపాన్పున నాకు విహరింపఁ దగునె
నినుఁ బాసి నిముసంబు నిలువంగఁ జాల
ననుఁ బాసి పొమ్మన నాయమా నీకు
ఎఱిఁగి యెఱింగి న న్నిటు పల్కఁదగునె
నరనాథ! ని న్నరణ్యంబున కనిచి
తగిలి బిడ్డలఁ జేరఁ దగునయ్యె నాకు
జగతీశ నీపరిచర్యఁ జాలించి
భయదాటవుల నిన్నుఁ బాసినవెనుక

ప్రియ మొప్ప నాకును బిడ్డ లేమిటికి
తరమిడి మాతల్లిదండ్రు లేమిటికి
సురుచిరం బైనట్టిశుభము లేమిటికిఁ
బరఁగంగఁ దనువునఁ బ్రాణ మేమిటికి
నరనాథ! యనుచు మానక యేడ్చు చుండఁ
గన్నుల నిండారఁ గాఱుకనీరు
మన్ననఁ దుడిచి యామహీపతి తనదు
కన్నులఁ గడుబాష్పకణములు దొఱఁగ
నన్నులవేణితో నప్పుడి ట్లనియె
నేణాక్షి నిన్ను నే నెడఁబాసినపుడె
ప్రాణముల్ మేనిలోపల నుండఁగలవె
యెడమీనియడవిలో నిడుముల నీవు
పడఁ జాల వని యిట్లు పలికితిఁ గాని
మెలనాగ! యిపుడు నీ వేల యేడ్చెదవు
కలఁగకు నినుఁ బాయఁ గలనటె నేను
అని యూరడించు తొయ్యలిఁ దోడుకొనుచుఁ
జను చున్న మిక్కిలి సాధింపఁ దలఁచి
యప్పుడు కలి వార లరిగెడిత్రోవఁ
దప్పించి ఘనపర్వతంబుల శిలలఁ
గట్టుల గుట్టల ఘన మైనపొదల
ఘట్టంబులను మహాకంటకచయము

సంతంతఁ గల్పించి యత్యూష్మ మగుచు
సంతాప మొనరింపఁ జాలినయెండ
సంతటఁ గల్పించి యలసటఁ గొలిపి
యంత కంతకు నీడ లగపడ నీక
మడుఁగుల నున్నసర్మలసలిలంబు
లెడపక యున్నియు నింకిపోఁ జేసి
యాఁకటిపెల్లున నలసి యే మైనఁ
జేకొని తిన నని చేదుగావించి
తెరవులఁ దప్పించి తెలివిఁ దూలించి
పరువుల నలయించి భయముఁ బుట్టించి
నడుపుల సొలయించి నయముఁ దూలించి
తడఁబాటుఁ దెప్పించి దప్పిఁ బుట్టించి
యీరీతిఁ గావింప నినకులాధిపుఁడు
బోరన నది దాఁటిపోవ నయ్యెడను
మగువ క్రొమ్ముడి తోఁగిన ములయుకంపలను
దగిలినదనచేతఁ దప్పించుకొనుచు
మురువు దూలిన వాఁడిముండ్లఁ జేఁ దీయ
వెఱచి మెల్లనె తీసి వెలవెలఁ బాఱి
పఱతెంచి కంపలఁ బయ్యెదకొంగు
నరిమురిఁ దగిలిన నవి తీయలేక
తను వాఁడి గలఱాళ్లు దాకి పాదముల

కనుముల నెత్తురు గాఱ నందందఁ
గన్నుల ముత్యాలకై వడి నీరు
చన్నుగట్టులమీఁద జలజల రాల
జాఱినవెండ్రుకల్ నరిపడఁ గేల
సారెకు సారెకుఁ జక్కఁ జేయుచును
గదలిపోవుచు వట్టు గట్టినతనదు
పెదవులఁ దడపుచు బెగడుచు నవని
నడుఁగిడ లేక హా యనుచు శోకింప
పుడమిఱేఁ డాత్మలోఁ బరిపరిఁ బొక్కి
పరిపూర్ణకళసోము బడలించు మోము
చరణముల్ ధూళిధూసరములై యున్న
నీపాతకంబున కేమి సేయుదును
పాపపుదైవ మీపగిదిఁ గావించెఁ
గటకటా నేఁ బాపకర్మవర్తనుఁడ
నటుగాన నీదుఃఖమందు నీయింతి
మటుమాయ కలి పట్టి మగువను నన్నుఁ
బటుగతి నీరీతి బాధించుచున్న
దని తలపోయుచు నాయింతిఁ గదిసి
యనునయించుచుఁ దనహస్తంబుచేత
నెలమిమై నూఁతగా నిచ్చి తోడ్కొనుచు
లలనయుఁ దాను మెల్లనె కొంతదూర

మరుగుచు నున్న విహంగముల్ రెండు
మఱవఁ గూడనికలిమాయచే నెలమి
నవరత్నఖచిత మానవ్యవక్షములు
పవడంపుఁజాయచేఁ బరఁగు నాసికయుఁ
బసిమిమించులఁ బోలి ప్రబలుచూపులును
అసమానరుచిఁ దేట నలరుపక్షములు
గలిగి ముద్దులుమూటఁ గట్టినయట్లు
కలిమాయచే నొప్పి గగనమందుండి
కపటంపుఁ బక్షులు కవకిన యనుచు
విపులేశుముందఱ వెఱవక వ్రాలె
వ్రాలినఁ గనుఁగొని వసుమతీనాథుఁ
డాలోలనేత్రితో ననియె నిట్లనుచు
అలివేణి! మన కిప్పు డాఁకలిచేత
బలహీన మగుటకుఁ బరమేశ్వరుండు
మనమీఁద దయ గల్గి మఱి వీనిఁ బనిచెఁ
బనిఁ బూని యీ రెండుపక్షులఁ బట్టి
యనురక్తి భక్షింత మతివ! యిద్దఱము
అని పల్కి పక్షుల నవుడు పోనీక
కదియఁ బోయినఁ జూచి కపటంపుఁబక్షు
లదరినగతి వేగ యవ్వలి కెగయ
మెల్లనే చనిచని మేదినీనాథుఁ

డల్లనల్లన నప్పు డటు పొంచిపొంచి
పట్టి చేతులు రెండు పాఱఁజూచుటయు
నట్టె చివ్వున లేచి యావల నిలువ
మఱిమఱి వాని వెంబడిఁ బడి తఱిమి
తఱిమి డగ్గరి పోయి దక్కిన ట్లుండి
యవ్వలి కెగరిన నారాజవిభుఁడు
క్రొవ్వఱంచెదఁ గాక గొబ్బున దీని
నేనేర్పుచే నైన నిటు వెంటఁ దగిలి
పోనీక పట్టెదఁ బొడలి యో నిప్పు
డని యిట్లు మతినిశ్చయం బొనరించి
ననబోణి నందుంచి నలమహీవిభుఁడు
పట్టఁ బోయిన మిట్టి పడి వెన్క నిలుచుఁ
బట్టుకుండిన నేలఁ బాతరలాడుఁ
దగిలినగతి నుండుఁ దగులక పోవు
దిగులొందినట్లుండు దిక్కులఁ జూచు
వేసారి మరలిన వెన నొద్ద వాలు
గాసిల్లిపట్ట డగ్గరినను దొలఁగు
దవ్వుల కేగును దగ్గఱ వచ్చు
నివ్విధంబునఁ బక్షు లెంతయు నలుని
నలయించి యలయించి యధికదూరమునఁ
జలమునఁ గొని పోవ జనలోకనాథుఁ

డలసి చింతించియు నటఁ బోక నిలిచె
వలనొప్పఁ బులుఁగులు వచ్చి భూవిభుని
దగ్గఱవాలినఁ దనమొలవల్వ
దిగ్గున పైఁబడఁ దిగిచి వైచినను
బంచఁ దామొత్తుక పక్షులు దివికి
నంచలంబున నేగి యందుండి పలికె
ధర నీవు నాఁడు జూదం బాడువేళ
గరిమఁ బుష్కరుపాసికలలోన నుండి
నీరాజ్యమంతయు నెఱి నాచుకున్న
వారము మేము గువ్వలము గా మయ్య
యెలమి రాజేంద్ర! మే మెవరమో యనుచుఁ
దలఁపకు మదిలోనఁ దరమిడి మమ్ముఁ
బంచఁ గైకొని వేగ పాఱి రమ్మనుచుఁ
బంచినఁ గలిమాటఁ బాటించి యిటకుఁ
బరువున నరుదెంచి పరికించి నిన్ను
నిరువుర మిట్టట్టు లెఱిఁగి దూలించి
నిలుచుచు నమ్మించి నీమొల నున్న
వలువఁ గైకొంటిమి బలిబలీ నిన్ను
మెచ్చవచ్చును మేము మెల్లనే పోయి
వచ్చెద మింక నంచుఁ బలికి మాయాత్మ
నెనసి యుండినకోప మింతటఁ బోదు

పనవి నీ వీఁకఁ బడుపాటులు చూడు
మని యుగ్గడించుచు నాకలిమూఁత
లనురక్తితో మాయ మై పోయె నంత
నాపత్తు లడఁగిన నాశ్చర్య మంది
భూపాలతిలకుండు పొగిలి చిత్తమున
ఘన మైనశోకసాగరమున మునిఁగి
తన దేవిఁ గని స్నిగ్ధశోకంబునఁ బలికెఁ
బత్తులు పలికినపలుకులు వింటె
సాక్షిగాఁ దామరసాక్షి! నీ విపుడు
కల్లజూపం బాయెఁ గటకటా నేఁటి
కెల్లెడ నింతైన నెఱుఁగ! లేనైతి
నింతటఁ బోవదే యెఱనాఁగ మనకు
నెంతేసియిడుములు కిరవు గాఁగలవొ
కటకటా మనమీఁదఁ గరుణయు లేక
నిటు చేయఁగాఁ గలి కేమి చేసితిమొ
తొలఁగునే నేఁ గన్న దుస్స్వప్నఫలము
పలుమరు ననుభవింపక కాని విడదు
కట్టిడిదైవంబు కలరాజ్యమెల్ల
నష్టకైకొని యరణ్యమునందుఁ ద్రోచెఁ
దుదను గట్టినబట్ట దోఁచుకపోయె
నిది యేమి మాయయో యెఱుఁగంగ రాదు

ఏమి చేయుదు నింక నేమందు విధిని
నీమహాటవిలోన నిద్దఱ మింక
నలివేణి! యేదుఃఖ మనుభవించెదమొ
తెలియంగఁ జాల మేతెఱఁగింక మనకు
అని యని పలుమాఱు నడలుచుఁ బలుకఁ
దనప్రాణవిభుతోడ దమయంతి పలికె
ఏల చింతిలఁబోఁగ యినకులాధీశ!
పాలించి చూడుమా బుద్ధికార్యంబు
కాలకర్మంబులు గడపినచోట
ఫాలలోచనుఁ డైనఁ బాపఁగఁ గలఁడె
జలధి మేరకు మీఱి చనుదెంచె నేని
కలదె యుపాయంబు కట్టించి నిలుప
వసుధ నీతకు ముంచి వచ్చునే లోఁతు
విస మెక్కునే తల వెంట్రుకల్ గడచి
మిన్న వేగమె వచ్చి మీఁద వ్రాలినను
మన్ననఁ జెయ్యాని మఱి నిల్వఁ దరమె
యెంతేసికార్యంబు లేగుదెంచినను
వంత నొందుచు ధృతి వదలంగఁ దగదు
తటుకున దైవంబు దయ లేక మనల
నిటు చేసితే ఇంక నే మనవచ్చు
నింతకు మిక్కిలి యేమి వచ్చినను

నంతయు దుస్స్వప్న మని యాత్మ నెఱుఁగు
తలఁపకు రాజ్యంబుఁ దలఁపకు సుఖముఁ
దలఁపకు బిడ్డలఁ దలఁపకు పురము
వదలకు ధైర్యంబు వదలకు బుద్ధి
వదలకు హరిచింత వదలకు నీతిఁ
బుట్టుభోగము లెల్లఁ బోయిన వెనుక
బట్టకు వెఱపకురే భానుకులేశ !
యనుచు నూరార్చి నెయ్యంబున నపుడు
తనకొంగుసగము నాతనిమీఁదఁ గప్పి
నునుఁగక యిద్దఱు నొకచీరఁ గట్టి
యుడలుచు నడవిలో నధికదూరంబు
నడచి పోవఁగఁ జూచి నగి వారు మఱియు
నడలంగఁ గలి ధరామరరూపుఁ దాల్చి
కడువేడ్క నచట మార్గంబులు నాల్గు
తడయక కల్పించి తా నొక్కతోవ
తెరవరి విధమునఁ ద్రిమ్మరు చుండె
ధరణీతలేశుండు దమయంతి యటకుఁ
జనుదేరఁ గపటవేషధరుండు పలికె
నొనరంగ నిద్దఱు నొకచీరఁ గట్టి
యెందుఁ బోయెదరు మీ రీకానలోన
నెందుండి వచ్చితి రిట్టిదుఃఖంబు

లెందుకు వచ్చె మీవృత్తాంత మెల్లఁ
గొందల మందక గునుగక నిల్చి
యెఱుఁగంగఁ జెప్పు మీ రెవ్వ రటన్న
ధరణీతలేశుఁ డాతని కిట్టు లనియె
వినుము విప్రవరేణ్య! విశ్వంబులోనఁ
గొనియాడఁ దగుభానుకులజుఁ డావీర
సేనసుతుండ నీక్షితితలేశ్వరుఁడ
మానితసకలసామ్రాజ్యసంపదల
గపటజూదమునఁ బుష్కరునకు నోడి
విపినంబులోపల విహరించుచుండి
చపలాక్షితోఁ గూడి సరసత రాఁగ
కపటమార్గంబున ఖగములు రెండు
వచ్చి పట్టుట కేను వైచినవల్లె
నిచ్చఁగా మింటికి నెత్తుకపోవఁ
బొలఁతి కట్టినయట్టి ఘట్టంబుకొంగు
నెలమిమై గట్టుక యిట వచ్చినాఁడ
ననఘాత్మ! నే నలుం డను పేరివాఁడ
ననవుడు కపటబ్రాహ్మణుఁ డిట్టు లనియె
నింతిని నీవెంట నిడికొని నీవు
వంతఁ గుందుచు ఘోరవనములోపలను
నీరీతి తిరుగాడ నిది కార్య మగునె

ఈరామ నీవెంట నిడుమలఁ బొందఁ
జాలదు మాకిది సంతాప మయ్యె
నీలోలలోచన నీకఁ జూచె నేని
ఘోరమృగంబులు గూల్చి భక్షించు
నో రాజ! యడవికి నొక్కఁడవే రాక
యెలనాగ నిచ్చటి కేల తెచ్చితివి
వలవదు పాపంబు వచ్చు భూనాధ!
పదపడి కలిరాజు పన్నినమాయ
యిది మాకుఁ జూడంగ నింతటఁ దొలఁగ
దెం తేసికష్టంబు లింక రాఁగలవొ
యింతిని నీకఁ బుట్టినింటికి ననుపు
మిట కేల తెచ్చితి విది బుద్ధి యగునె
కటకటా యిఁక నైనఁ గొంత నంపింపు
మినకులంబున జనియించిననృపులు
ఘను లంద ఱిపుడు నీఘన తెందుఁ బోయె
నొకబుద్ధిఁ జెప్పెద నుర్వీతలేశ!
యిఁక నైన వినుము నీ విం దుండఁ గూడ
దిదిగో నాలుగుత్రోవ లేర్పడి యున్న
వది విదర్భపురికి నరుగుచు నుండు
నది యయోధ్యాపురి కరుగుచు నుండు
నది సుబాహునిపురి కరుగుచు నుండు

నది ఋతుపర్ణపురాధ్వంబు గాన
నిమ్మార్గములను మీయుద్ధతిమతికి
సమ్మతం బగుత్రోవఁ జనుఁడు వేవేగ
భూప! యీనాలుగుపురములలోన
దావు విదర్భాఖ్యఁ దనరిననగర
మని చెప్పుచు నదృశ్యుఁ డై పోయె నతఁడు
మనుజేశుఁ డంతట మగువ నీక్షించి
తొయ్యలి! యీనాల్గుత్రోవలలోనఁ
జయ్యన నేత్రోవఁ జనుదెంత మనినఁ
గరివృకవ్యాఘ్రసూకరసింహసర్ప
శరభాదిబహుసత్త్వసంచారవనులఁ
దిరుగంగ నేటికి దేవుఁడే మనకు
తెరవు విదర్భకుఁ దెలియంగఁ జెప్పె
మనుజేశ! యట కేగి మనవారియొద్ద
ననుపమగతి నుంద మని భక్తి మ్రొక్కి
ర మ్మని పిలిచిన రమణీలలామ
కమ్మానవేశ్వరుం డనియెఁ గ్రమ్మఱను
వనజాక్షి మును నిన్ను వరియించునాఁడు
ఘను లగుమంత్రాంగకర్తలు దొరలు
కరులు తేరులు తురంగంబులు భటులు
బిరుదువాద్యంబులు భేరులు వన్నె

పల్లకీ లమితసువాసినీవిప్ర
పల్లవాధరలు పార్శ్వమ్ముల నెదుట
నేతేర మీాతండ్రి యేలువిదర్భ
కేతెంచినాఁడ బర్హిర్ముఖుల్ మెచ్చ
చపలాక్షి! కలి నన్ను జలమునఁ బట్టి
కపటజూదమునఁ బుష్కరునకు నన్ను
నోడించి యుద్దుల కోకచేలఁ జేసె
నేను లజ్జదొలంగి నే నీవిధమున
భామ నీతో విదర్భకు నెట్లువత్తు
మామ నేగతిఁ గాంతు మది సిగ్గులేక
భూమీశుసభలోన బుధు లెల్ల వినఁగ
నే మని నాథంగ మెఱిఁగింతు సచలఁ
జెడి చుట్టములచెంతఁ జేర నేఁజాలఁ
గడపట నతిహీనుగాఁ జూతు రబల
నీ వచటికిఁ బొమ్ము నీబిడ్డ లచట
నేవిధి నున్నారొ యెఱుఁగంగఁ జాల
నా వెంట నది గాక నడువంగ లేవు
హో విదర్భ కిటన్నఁ బొలఁతి యిట్లనియె
భూమీశ! నినుఁ బాసి పో పా పట్టంచు
వేమరు పలుకుట విహితమా నీకు
జలములలో నున్న జలచరజంతు

విలమీఁదఁ ద్రోచిన నెబ్బంగి బ్రతుకు
పరుదార తరువుతో నల్లినతీఁగ
తరువుఁ బాసిన నది తానిల్వఁ గలదె
నినుఁ బాసి పోఁజాల నీపాద మాన
ననుఁ బాసి పోవుట న్యాయమా నీకు
పసవెడు నాతోడఁ బలుక నీమాట
యనినఁ గామినిఁ జూచి యవనీశుఁ డనియె
నలివేణి! మన మిప్పు డఖిలహీనతను
నులుకుచు నిద్దఱ మొకచీరఁ గట్టి
పోడిమి నేరీతిఁ బోవంగ నగును
నేఁడు రాజ్యము వోయె నిర్నిమిత్తమునఁ
బై చీరయును బోయెఁ బక్షులచేత
నీచీరకొంగును నేఁ గట్టినాఁడ
నావిదర్భాపురి కట నీవు నేనుఁ
బోవంగ నప్పుడు పురజనుల్ చూచి
యిల నేడుదీవుల నేలెడువాని
చెలు వెల్ల వదలి పైచీరయుఁ బోయె
సురలను నొల్లక సొక్కి యీరాజు
వరియించినఫలంబు వనితకుఁ గలిగె
నని తూలనాడెద రది గాన నటకుఁ
జనను నే నీ వైనఁ జను మన్న బెదరి

చెదరినమనమున చెలియ యిట్లనియె
హృదయేశ! నన్ను నీ విట్లు విడఁ దగునె
యడవులలో నీవు నడలుచు నుండ
కడువడి మావారికడ కెట్లు పోదు
నినుఁ బాసి ప్రాణంబు నిమిషమాత్రంబు
తనువున నిల్వంగఁ దగునె ప్రాణేశ!
తొల్లి చేసినయట్టిదుష్కృతఫలము
నెల్లఁ బొందక యది యేలఁ బోనిచ్చు
హారునకు మొదలుగా హాస్య సిద్ధించు
హరియంతవానికి నడలంగ వలసె
దినకరచంద్రులు దిరుగంగ వలసె
నొకర నొక్కడను గా లూదంగ లేక
యాయువు విద్యలు నఖిలసంపదలు
వ్రాయఁ బుట్టిననాఁడు వనజజుం డతఁడు
నుదుట వ్రాసినవ్రాఁత నులిమితె చెడునె
మదిలోన నీ వింక మఱుగంగ నేల
నని పల్కె నిద్దఱు నపుడు సన్మతిని
జనుచున్న ముంగట సహకారసాల
మాలూరకరకతమాలమధూక
తాలఖర్జూరహింతాలామ్లపనస
సరళకింశుకలుంగజంబూపటాది

తరులమధ్యంబునఁ దగునొక్కకొలనుఁ
గనుఁగొని సోపానగతి డిగ్గి నీరుఁ
దనియంగఁ ద్రావి గతశ్రము లగుచుఁ
గొలను వెల్వడలి దిక్కులు చూచి విజన
నిలయ మొక్కటిఁ గాంచి నెఱి దాని డాయ
నరిగి కూర్చుండిరి యటఁ గలిమాయ
నెఱయంగ నొకమాయనిద్దుర గప్ప
వఱపున వాడినవల్లి చందమునఁ
బిగుసనితిన్నెపైఁ బడి నిద్ర వోయెఁ
దనకు నిద్దుర రాక దరిదాపు లేక
వనితయుఁ దా నొక్కవస్త్రంబు గట్టు
కతమున నెడబాయఁగాఁ గూడ కపుడు
మతి గణించుచుఁ గలిమాయచేఁ దనకుఁ
గలరాజ్య మెల్లఁ బుష్కరరాజు కోడి
కలఁగుచు శపథంబు గడువంగ లేక
తన దేవియును దాను తనపురి వెడలి
చనుదెంచి మూఁడువాసరము లచ్చోట
నాఁకట నలసి ఘోరాటవులందుఁ
బైకొక్క కపటంపుఁ బక్షుల కిచ్చి
తగిలి యనేకబాధల గుంది కుంది
వగచుచు నచటికి వచ్చి చేరుటయు

నటమట దుఃఖంబు లన్నియుఁ దలఁచి
చటులమధ్యాహ్న భాస్కరకిరణముల
స్ఫుటముల కందిన పూఁదీఁగెవోలె
నటవుల ద్రిమ్మరి యాఁకట సొలసి
మదిరాక్షి తన దేవి మహిమీఁదఁ బండి
నిదురఁ బోవఁగఁ జూచి నృపకుంజరుండు
సన్నుతసకలరాజన్యకామినులు
కన్నుసంజ్ఞల నూడిగంబులు సేయ
హంసతూలికలశయ్యను నిద్ర వోవు
హంసయానకు పాను పయ్యెఁ బో నేల
ననుఁ గూడి వచ్చి కానలఁ బొందినట్టి
తనదుఃఖ మింతయుఁ దగఁ జెప్పుకొనదు
దీని ఘోరముఁ జూడఁ దీరదు నాకుఁ
బూని యిచ్చట డించి పోయెద నింక
వనిత నన్ గానక వనవాస ముడిగి
తనపుట్టినింటికిఁ దగఁ బోయి చేరు
నిటువలె దీని కే నెంత చెప్పినను
దిటమరి కలఁగి వాదించుఁ బో ననుచు
నని పల్కి. కలిదైవ మప్పుడు ప్రేరేపఁ
దనప్రాణనాయకి తగఁ గట్టినట్టి
చీర సగంబుగాఁ జేతులఁ బట్టి

నారి మేల్కాన కుండ నడిమికి నలుఁడు
తునియించి మనమున దుఃఖంబుఁ జెంది
విన కుండ మెల్లనే విలపించి తొలఁగి
పోయెద నని లేచి పోయి రాజేంద్రుఁ
డాయెడ మఱి నాలు గడుగులు పోయి
పోలేక మదిలోనఁ బొగిలి మూర్ఛిల్లి
యాలేమదగ్గఱ కరుదెంచి మగుడ
తనువు పాదంబులు తప్పక చూచి
తనలోన నిట్లని తలఁచి శోకించెఁ
గటకటా నేఁ బాపకర్ముండ ననుచు
నెటు లెఱుంగక యయో యాతరలాక్షి
కోరి వచ్చిన దేవకులజుల నెల్ల
వారించి నన్నేల వరియించె నొకొ
పడఁతి నోచిననోముఫల మిట్టు లుండె
నిడుములఁ బొందెడినీయరణ్యమునఁ
గట్టెఁడి విధియాజ్ఞఁ గడవంగ వశమె
యిట్టికాఱడవిలో నెంనాగ! నిన్ను
నొంటిగా విడచి నే నొగిఁ బోవఁ జాల
వెంటఁ దోడ్కొనుచును విహరింపలేను
కామిని! నీకు నాకతమునఁ జేసి
ఈమహాటవిలోన నిట్లుండఁ గలిగె

నెనయుంగ నీభాగ్య మిట్టుండె ననుచుఁ
దనమది నొక్కింత ధైర్యంబుఁ దెచ్చి
వనిత పయ్యెదకొంగు వలె నొప్పఁ గప్పి
యనుమాన మేటికి నరిగెద ననుచు
నడలుచు మఱి నాలు గడుగులు పోయి
తడఁబడి పోలేక ధరణిపైఁ ద్రాలి
దిగ్గన లేచి యాదేవిని జూచి
దగ్గర కేతెంచి తనలోనఁ దాను
బెగ్గలం బందుచు భీతి నిట్లనియెఁ
బడలి నీ వడవులఁ బడఁజాల వనుచుఁ
దడయక నీతల్లిదండ్రులకడకుఁ
బొమ్మని చెప్పినఁ బోఁ జాల వెట్టు
లమ్మ నావెంటనే నవయంగ వత్తు
నటువంటిదాని ని న్నక్కటా నేఁడు
ఇటువంటియడవిలో నెట్లు డించి పోదు
నని యమ్మహీపతి హా యని వగచి
తనమది నిట్లని తర్కించె నేను
బోయినవెనుక నీ పూఁబోణి లేచి
పాయక యెబ్బంగిఁ బలవించు నొక్కొ
పలవించి యడవిలోపల నన్ను వెదకి
బలునైనమృగముల పా ల్పడు నొక్కొ

పతిచేత నొల్లమి పడఁతి నే ననుచు
మతి దప్పి ప్రాణముల్ మఱి వీడు నొక్కొ
యని యని పలుమాఱు నందందఁ దలఁచి
తనుఁ బాయఁ జాలని తలఁపు వర్ణించి
మానినిగుణములు మానుగాఁ బొగడి
మానినీమణిమోము మఱిమఱి చూచుఁ
జనుఁగవ వర్ణించు సన్నంపునడుము
వినుతించుఁ గన్నులనెడలుపు నెంచుఁ
దేనియరుచుల నొందినపలుకు లెంచుఁ
దా నిచ్చుచనవులఁ దప్పక యెంచు
మునుపటిరతిసుఖంబులఁ దలంచుచును
దనలోనఁ దాను సంతాపంబు నొందు
మఱియును దెగువతో మానిసి డించి
సరగునఁ జనుదేర సతిమీఁద మోహ
మనుతీఁగ కాళ్లకు నప్పుడు చుట్టి
పెనఁగొనఁ బోలేక పృథివిపై వ్రాలి
పుడమిఱేఁ డట మూర్ఛ వోయి యొక్కింత
తడవులఁ దెలిసి యాతరళాక్షిఁ జూచి
తిరిగి యచ్చటికి నే తెంచి దుఃఖమున
నరుణకాంతులజేవు రగులోచనముల
జలములు దొరఁగ నాజననాథుఁ డనియె

నెలనాఁగ! నిను బాసి యే నెట్లు పోదు
వనజాక్షి! నినుఁ గూడి వర్తించు ఘోర
వనములు శృంగారవనములై యుండు
నో లేమ! నీ వున్న నొగిఁ బూరిశయ్యా
లీలంశో హంసతూలికపాను పగును
ఓరామ! నీవున్న నుగుదుపొముంగును
మీఱిన బంగారుమేడలై యుండు
శాలిక నినుఁ గూడి వసియించు నర్త
శాలలు మఱి చిత్రశాలలై యుండు
మెలఁత నీ సన్నిధి మృగగర్జనములు
వల నొప్పు సంగీతవాద్యమై యుండు
మదిరాక్షి! నీవు సమ్మతి నిచ్చుఫలము
మదకి దివ్యాన్నసమ్మదము ఘటించు
నీయట్టికులసతి నీయట్టిసాధ్వి
నీయట్టిప్రియురాలు నీయట్టిముగ్ధ
నీయట్టికులశీల నీయట్టియబల
నీయట్టిలావణ్యనిధి యెందు గలదు
తలఁచేఁగా దైవంబు దయ యింత లేక
యెలనాఁగ! నే సింక నేమిసేయుదునె
అని యని పలవించి యామహీశ్వరుఁడు
తనమది నొక్కింత ధైర్యంబుఁ దెచ్చి

యింతగాఁ జింతింప నేటికి ననుచుఁ
గాంతారభూములఁ గలిగినయట్టి
కరిసింహశార్దూలగండభేరుండ
శరభపన్నగశశచమరీలులాయ
కాకాదిపక్షిమృగంబులచేత
నేకముఁ బొందక యీయిందువదన
తమతల్లిదండ్రులదగ్గఱఁ జేరు
సమరంగ హరికృప ననుచు దీవించి
పోయెద నని లేచుఁ బోలేక మగుడి
పోయి మిక్కిలి నగఁ బొంది మూర్ఛిల్లు
హా యని వెలుఁగెత్తి యందంద నేడ్చుఁ
బోయెద నని పోయి పొక్కుచుఁ దిరిగి
చయ్యన దమయంతిసరసకుఁ జేరి
యయ్యెడ నలుఁడు మహార్త్తి నిట్లనియె
నిటు డించి పోయిన నీయిందువదన
యటు నిటు పడి పోయి యమ్మయిల్ సేరి
యడవిలో శూన్యగృహంబునఁ దన్ను
విడిచిపోయెను గూర్కువేళ నిజేశుఁ
డని తెల్పఁ దనవార లది విని నన్ను
మనమున నెటువంటిమాట లాడుదురో
యదిగాక పురజను లందఱు నన్ను

పదపడి నలుఁ డిట్టిపాతకంబునకు
నడలక యొడిఁగట్టె ననుచుఁ దిట్టుదురో
పడఁతి యి ట్టిడుముల పా లైనఁ జూడఁ
జాలక విడిచెద సత్య మీమాట
పాలించి విను మమ్మ! భూదేవి! నీవు
ఆకాశవాణి! నీ వరయంగ వినుము
ఏకతంబున మీర లిద్దఱు సాక్షి
మెలఁత నేగతి నైన మీరు రక్షించి
తలిదండ్రిదగ్గఱఁ దగఁ జేర్పవలయు
నని యొప్పగించి చయ్యనఁ బోదు ననుచుఁ
జనిచని మఱి పోవఁ జాలక తిరిగి
వచ్చి యాదమయంతివదనంబుఁ జూచి
యచ్చోట నెలుఁ గెత్తి హా యని యేడ్చి
పోలేక పోలేక పొగలుచు నుండ
నాలోనఁ గలిదేవుఁ డతివపైఁ గలుగు
మోహపాశంబుల మొదలంటఁ బట్టి
సాహసంబునఁ ద్రుంపఁ జయ్యన నలుఁడు
మనమున నివి యేమి మమత లటంచుఁ
జన నిశ్చయించి యచ్చట నిల్వలేక
నదులు శైలంబులు నగరముల్ గడచి
పొదలుచు వేవేగఁ బోయె భూవిభుఁడు

పోవంగఁ గలి తనబుద్ధిఁ జింతించి
వావిరి పీనిలావణ్యంబుఁ జెఱుతు
నని యగ్నిదేవుని నర్చించి బిలిచి
కని మాఱురూపునిఁగాఁ జేయు మితని
ననిలుని సీకు సాహాయ్యంబు గాఁగఁ
బనుపుదుఁ జను మన్న బనిఁ బూని పేర్చి
యురువడి విసరుమహోగ్రవాయువులఁ
దరుశాఖ లన్నియు దఱచుగా నొరసె
నాకాకచే నిప్పు లందందఁ బొడమి
యేక మై యాకాన నేర్చుచు వచ్చెఁ
దగిలి పెన్మంటలు ధగధగ మండ
భుగభుగ పొగల గుంపులు మింటి కెగయఁ
దఱచుగా మండుచుఁ దరువుల కెగసి
దరికొని పొదరిండ్లు దళముగా మండ
మ్రాకులు ఫెళఫెళ మహిమీఁద వ్రాల
వీఁక మృగంబులు వెలవెలఁ బాఱ
ఖగములు ఱెక్కలు గాలిన కమలి
మొగిసి పోవఁగ లేక యిల వ్రాలి పొరల
నక్కడక్కడ దాగినట్టిసర్పములు
యక్కజంబుగ నన్ని యడలుచు మడియ
ఘన మైనసప్తసాగరము లింకించి

కనలుచు సకలలోకములు దహింప
వచ్చినబడబాగ్నివడువున వచ్చు
చిచ్చుఁ గనుంగొని క్షితితలేశ్వరుఁడు
బోరన నది దాఁటి పోయెద ననుచు
దిసఁ జై రాఁగ నాదిక్కున నొక్క
పాదరిల్లు తగిలి యద్భుతముగా నుండఁ
గర్కోటకుం డనుఘనపన్నగంబు
కక్కసపడుచు నాఘనవహ్నినడుమ
వేణుశాఖాగ్రంబు వేవేగఁ బ్రాకి
ప్రాణభీతిని మహీపతి ట్టు లనియె
నోరాజదేవేంద్ర! యోదయాసాంద్ర!
యోరాజితాకార! యోదీనరక్ష!
యీవహ్ని వెడలించి యిపుడు ప్రాణముల
నీవహ్నిలోపల నిటు చిక్కినాఁడ
కావవే రాజేంద్ర! కరుణతో నన్ను
అని దీనతను బల్కనప్పు డాపాముఁ
గనుఁగొని నలమహీకాంతుఁడు నవ్వి
ధరణిఁ బాముల నమ్మఁ దగ దందు రుర్వి
వెఱతు ని న్నంటఁగా విషధర! యనిన
భూవరుఁ జూచి యాభుజగ మి ట్లనియె
దావాగ్ని నిప్పుడు దాఁటించి నీవు

నా కుపకారంబు నయ మొప్పఁ జేయ
నీకుఁ బ్రత్యుపకృతి నేఁ దెలిఁగింతు
ననవుడు వేవేగ నగ్నిలోఁ జొచ్చి
జననాయకుఁడు కృపాసాగరుఁ డగుచు
నా పాముఁ గొనివచ్చి యావల విడువ
భూపతిఁ గనుఁగొని భుజగ మి ట్లనియె
మనుజేశ! యిటువంటిమంటలోఁ జొచ్చి
నను నీవు రక్షించినావు నీమేలు
మఱవ నే నీ కొక్కమాటఁ జెప్పెదను
సరణి ముందఱ నొక్క సరసకాసార
మున్నది యట నన్ను నొనరఁ గొంపోయి
మన్నించి విడువుము మఱి నీకు నొక్క
మేలుఁ జేసెద నన్న మేదినీనాథుఁ
డాలించి యాపాము నతఁడు గొంపోయి
సరగున నపుడు కాసారంబులోనఁ
గరుణతో విడిచె నాఘనపన్నగంబు
విడిచినయప్పుడు వివర మొప్పంగఁ
గడువడి నలరాజుకాళ్లను గఱచెఁ
గఱచినఁ డఱచు వంకలు వోయె మేను
కుఱుచచేతులు మఱి గుజ్జుపాదములు
బిఱుసువెండ్రుకలును బేడిగడ్డంబు

నఱ యంగుళంబులు నంటుచెక్కిళ్లు
పఱుసనిమీసంబు ప్రతిగుంటకనులు
కఱకునల్లనిమేను ఘనమైనకడుపు
గలిగినఁ జూచి భూకాంతుఁడు నవ్వ
కలఁగుచుఁ బలికె నక్కలిమాయఁ దలఁచి
యప్పుడే యిట్టికార్యముఁ జేతు వనుచుఁ
జెప్పితి నాలాగె చేసితి వహహా
కత్తిచే నఱికినగాయంబుమీఁదఁ
దత్తరపడ దెబ్బ తగిలినరీతి
నైనది యైన నే మనుచు ధైర్యమున
ధ్యానించునలునితో నాసర్ప మనియె
జననాథ! నీ కింతసంతాప మేల
కనలక వినుము నేఁ గఱచినవిధము
మునుకొని తొలిజన్మమున బ్రహ్మఋషికి
ఘన మైనదోషంబుఁ గావించినాఁడ
నామాని కోపించి యడవిలో నిట్లు
పాముగా నుండుము పాపాత్మ! యనుచు
బలు వైనఘోరశాపం బిచ్చె నాకు
నలయుచు నే నపు డాత్మఁ జింతించి
మునినాథ! యీశాపమోక్షంబు నాకు
ఘనతతో నెప్పుడు గలుగు నటన్నఁ

గలిరాజుమాయచేఁ గల రాజ్య మెల్ల
నలరాజు పుష్కరనరనాథు కోడి
పైనున్నవస్త్రంబు పక్షుల కిచ్చి
కానలలోఁ దనకాంతను విడిచి
నీ వున్న యెడకు నా న్నృపుఁ డేగుదెంచి
భావించి యగ్నిలోఁ బడకుండ నిన్నుఁ
గాచి రక్షించినఘనుని పాదంబు
చూచి ముట్టిననాఁడు శుభమూర్తి వగుదు
వని చెప్పి యతఁ డేగె నంతటనుండి
యినకులాధీశ! నే నిచ్చట నుండి
గానకొని నీరాకఁ గోరుచుండుదును
వనమునఁ గాలాహివలె వచ్చి నిన్ను
గఱచితి నని యాత్మఁ గలఁగకు నరుల
తెఱఁ గెల్లఁ జెప్పెదఁ దెలియంగ వినుము
కాంతి కోర్వఁగ లేరు ఖలు లర్థి భూమి
కాంతులు నీవసంగతి కోర్వఁ గలరు
అటుగాన నీఘోర మైనరూపమునఁ
బటుగతి విహరింపఁ బాటి ధరిత్రి
విభులేశ! నీ వింక విపినభూములను
విపరీతబుద్ధిని విహరింపఁ గూడ
దరయుచు నీ వయోధ్యాపురి కేగి

యరుదార ఋతుపర్ణుఁ డనురాజు చెంతఁ
జేరి సారథ్యంబుఁ జేయుచుఁ బాక
మార్గాఢిఁ జేయుచు నతని మెప్పించి
బాహుకుం డనుపేరుఁ బడసి యత్యంత
సాహసం బలర నచ్చట నుండు మంతఁ
గొంతకాలమునకుఁ గోమలిఁ గలసి
సంతోషమతిని రాజ్యముఁ జేయఁ గలవు
నిషధేశ ! విను మింక నీశరీరమున
విష మెంతకాలంబు నిన నుండు నప్పు
డురగరాక్షసపిశాచోగ్రభూతములు
దురితంబు లేవియు దొరయవు నిన్ను
అని కరాటములోన నమరినయొక్క
కనకవస్త్రము ధరాకాంతున కిచ్చి
కర మర్థి నీరూపు గావలె ననుచు
ధరణీశ ! నను నీవు తలఁచి యాకోక
ధరియించినప్పు డందము మీఱ నీకు
వరుస నీరూపలావణ్యముల్ గల్గు
నేపార నే నింక నేగెద ననుచు
నాపాము మాయమై యరిగె నంతటను
జననాథుఁ డత్యంతసంతోష మడర
ఘనతరవేగుఁడై కదలి యయోధ్య

కరిగి యాఋతుపర్ణు నందందఁ గాంచి
కరములు ముకుళించి ఘనభక్తిఁ బలికె
నవనీశ! బాహుకుఁ డనుపేరివాఁడ
తవిలి సారథ్యంబుఁ దగఁ జేయ నేర్తు
విశ్వంబులోపల వెలుఁగొందియున్న
యశ్వలక్షణముల నమరంగ నేర్తు
వారక రుచులుగా వండంగ నేర్తు
నీరీతి విద్యల నెఱుఁగంగ నేర్తు
వల నొప్ప మిముఁ గొల్వ వచ్చితి నన్ను
దలఁచి నీబంటుగాఁ దగ నేలు మనిన
ఋతుపర్ణుఁ డాతనిరూపంబుఁ జూచి
ప్రతిఁ గాన మీరూపభావంబులకును
ఇట్టివాఁ డొకఁ డున్న నెప్పుడు మనకుఁ
బుట్టు ముచ్చటలును బొద్దువోయెడిని
యని పల్కి నలుని నత్యాదరంబునను
మనుజేశుఁ డపుడు సమ్మతిఁ గొల్వు నిల్పె

---

# చతుర్థాశ్వాసము.

అట మున్ను నలరాజు ననుఁగుబిడ్డలను
దఁటుకున దమయంతితలిదండ్రు లింట
విడిచి వార్ష్ణేయుండు విపినభూములకు
వెడలె నలక్షితివిభుఁ డింతిఁ గూడి
యనుమాట విని మున్ను యాఋతుపర్ణు
నొనరంగ మఱి కొల్చి యుండె నానలుఁడు
అరసి వార్ష్ణేయుండు నందందఁ జూచి
వరసతిఁ దనరథసారథి గాఁగ
నెఱిఁగి యాతనితోడ నేమాటఁ దెలుప
కెఱుఁగనిగతి నుండె నేమియు నవల
నక్కడ దమయంతి యదరి మేల్కాంచి
పొక్కుచుఁ దనపతిఁ బొడఁగాన కులికి
నలుదిక్కులును జూచి నలినాక్షి గుంది
చలియించి చించినచీరయుఁ గాంచి
దిగ్గున లేచి పూఁదీఁగెకై వడిని

నగ్గలంబుగ మూర్ఛ నవనిపై వ్రాలి
యూనినయామూర్ఛ నొక్కింత తెలిసి
మే నెల్ల నులియుచు మెల్లన లేచి
నేలలఁ బుణుకుచు నిగిడినవగల
వాలుఁ గన్నుల నీరు వరద లై పాఱఁ
బలు తెఱంగులఁ దనప్రాణేశుఁ దలఁచి
వెలవెలపాటున విలపింపఁ దొడఁగె
హారాజదేవేంద్ర! హాదయాసాంద్ర!
హారాజమందార! హాదయాకార!
శ్రీకరఘనమూర్తి! రిపుసమవర్తి!
నాకేశనుతకీర్తి! నలచక్రవర్తి!
అక్కటా యిట్టిఘోరాటవిలోనఁ
దక్కక నను డించి తలిగి పోఁదగునె
ననుఁ బాసి పోనని నాతోడఁ జెప్పి
పెనునిద్రవోయినప్రియను నన్ను డించి
కటకటా నామీఁదఁ గరుణఁ జాలించి
యిటు డించి పోవ నీ కేమి చేసితిని
నినుఁ బాయఁగాలేను నిమిషమాత్రంబు
ననుఁ బాసి పోవుట న్యాయమా నీకు
ఒక్కటే ప్రాణంబు లొనర నిద్దఱికి
మక్కువ లొక్కటే మనకు నిద్దఱికి

నోడకు మనుచు న న్నూరడఁ బలికి
పాడియే యడవిలోపల డించి పోవ
నిట్టికాఱడవిలో నిటు నన్ను డించి
యెట్టులు పోవఁ గాఁ జెల్లునే నీకుఁ
నైకొనఁ గెడఁబాయఁగా నెన్నఁ డైన
నీకు నేఁ జేసిననేరంబు లేమి
కట్టిఁడిదైవ మీకానలో నన్ను
ఇట్టు లొంటిగ నుండ నేలఁ జేసె నొకొ
యెన్నఁడు రాదుగా యిటువంటివిదుర
నిన్ను నన్నును బాప నేఁడు వచ్చినది
తనువునఁ బ్రాణముల్ దలఁగకున్నంత
నినుఁ బాసి యోర్తునే నిమిషార్ధ మైన
ఇట్టికాఱడవి న న్నేకత డించి
యెట్టు పోలే వని యెంచితి మదిని
ననుఁ బాయవచ్చునా నాప్రాణవిభుఁడ
వని నిన్ను నమ్మితి నవనీశ చంద్ర !
యిచ్చట నను డించి యేలఁ బోయితివి
చచ్చిన నొకచోటఁ జావమే మనము
కలపాటి నొకభంగిఁ గాలంబు నడిపి
మెలఁగమే యడవుల మేదినీనాథ !
గ్రహవేధ లవి యెట్టిగతుల వచ్చినను

గృహిణి వీడుట నీకుఁ గృత్యమే నాథ!
నటికినఁ ద్రొక్కిన నలియఁ గొట్టినను
జెఱకు తియ్యనగాని చే దౌనె నాథ!
కరుణను నీదువాక్యముల వీనులను
వెఱవక యెన్నఁడు విందునో నాథ!
కామించి కన్నులకఱ వెల్ల దీర
నీమూర్తి నెన్నఁడు నేఁ జూతు నాథ!
యేతెరవునఁ బోతి వేను వచ్చెదను
నాతోడఁ జెప్పవే నాప్రాణనాథ!
యీవిధి మనల నే డిద్దఱిఁ బాప
దైవంబు నాల్గుపద్ధతులఁ గల్పించెఁ
బ్రాణేశ! కానలోపల నిన్నుఁ బాసి
ప్రాణంబు లెబ్బంగిఁ బట్టుదు నింక
భూమీశ! ననుఁ బాసి పోయెడువేళ
నేమని పలవించి తేమంటి నన్ను
ఏదేశమునకుఁ బోయితివో యెచ్చోట
నేదుఃఖ మందితో యేమి సేయుదును
జగదీశ! నేఁ బాపజాతిని గాన
నిగుడి యీయాపద నిను బొంద నయ్యె
నే సర్వలక్షణాన్విత నౌదు నేని
వాసవనుత! యింత వచ్చునే నీకు

నరలోకనాయక! ననుఁ జెట్టఁబట్టి
పరఁగ రాజ్యముఁ బాసి భటులను బాసి
హయరథావళిఁ బాసి యఖిలంబుఁ బాసి
భయదకాంతారంబుపా లైతి వకట
నిద్రింప కా త్రిచే నీవు గూర్చున్న
నిద్రవోవుట నాకు నీతియే తలఁప
నేరము నామీఁద నిజముగాఁ గలుగ
నోరువ కేఱు పోతి వుర్వీశతిలక!
పతితలఁ బెఱుఁగనిపడఁతి యే లనుచు
నతివేగమున డించి యరిగితి వేమొ
పున్నమచంద్రుని బోలునీమోము
నెన్నఁడుఁ గందునో యినకులాధీశ!
ఇక్కడ ననుడించి యెచటికి నీవు
ఎక్కడికేగితి విటు చెప్పు మయ్య!
ఇది నాకు నొంటిగా నిప్పుడు తోఁచె
నిది నాకు నడవిగా నిప్పుడు తోఁచె
నేమి సేయుదు నింక నేమందు విధిని
నీమహాటవిలోన నెబ్భంగిఁ గాంతు
నరనాథ! యిట వచ్చి ననుఁ గావ కున్న
పరఁగ నాప్రాణముల్ పట్టంగఁ జాల
మరుగున నేటికి మఱి డాగి యుండఁ

బరువున వచ్చి నాప్రాణముల్ గావు
కవఁ బాసి పోయి భూకాంత! నీ విభుఁడు
భువి నెన్ని బాధలఁ బొందుచున్నావొ
కల నైన నీమాటఁ గా దనఁ జాల
నలరాజచంద్ర! కానలనేల డించి
తెవరికిఁ దొల్లి నే నేమి చేసితినొ
భువి నిట్టిపా ట్లెల్లఁ బొందితి నడవి
నెక్కడికేగుదు నేమి సేయుదును
దిక్కెవ్వ రిటమీఁదఁ దెఱఁ గేది నాకు
నీదుఃఖవార్ధి నే నేరీతిఁ గడతు
నేదెస వెదకుదు నీకానలోన
వెదకుచుఁ గలి యిట్లు వేధించుచుండ
హృదయేశ! నీవిపు డేమి గావింతు
వలసితి వీయరణ్యములలో నున్న
బలుమృగంబుల కగపడుదుగా కనుచు
నలినాక్షి తనప్రాణనాథుని దలఁచి
పలుతెఱంగుల నిట్లు పలవించు చుండ
మలమల మాడెఁ గోమలలతాతరులు
శిల లెల్లఁ గఱఁగె రాజీవాప్తుఁ డదరె
గాలి వీవక మానెఁ గన్నుల నీరు
రాల నేడ్చుచు నున్నరమణిని జూచి

మృగములు నిలుచుండె మేఁతలు మఱచి
ఖగము లాధ్వని విని కలఁగుచు నుండె
నప్పుడు దమయంతి యచ్చోటుఁ బాసి
ముప్పిరిఁ గొనుశోకమునఁ బ్రాణవిభుని
నడవిలోపల బాలహారిణియుఁ బోలె
వెడవెడ నందంద వెదకంగఁ దొడఁగెఁ
దరులార! నాసహోదరులార! మీరు
ధరణీశ్వరుని జూడఁ దగఁజూపరయ్య!
సురలార! మీ రైన సురరాజవిభుఁడు
తరలి పోయినజాడఁ దగఁ జెప్పరయ్య!
భూదేవి! నీ వైన భూలోకనాథుఁ
డేదెసఁ బోయెనో యెఱిఁగింపు మమ్ము
నసుఁ గావరయ్య! కిన్నరులార! పుణ్య
ధనులార! ఘనులార! తాపసులార!
కరులార! హరులార! గవయంబులార!
శరభసాళ్వములార! సర్పంబులార!
మనుజేశుఁ డరిగినమార్గంబు నాకు
నెనసినఁ గరుణతో నెఱిఁగింపరయ్య!
అనియని యడుగుచు నటునటు పోయి
ఘన మైనపొద లెల్లఁ గదలించి చూచి
వీరు వా రనక యవ్విధమునఁ దిరుగ

నోరెండ ధృతిదూలె నొచ్చెఁ బ్రాణములు
ముడివిడి క్రొమ్ముడి మూపుపై జాఱ
నడుగులు తొట్రిల నందంద బడలి
పగడంపు వాతెర పదునింకి వాడ
జిగిదక్కి పావట సీకాకువడగఁ
గన్నుల జలజలఁ గారెడునీరు
చన్నుమిట్టలమీఁద జలజల దొరుగ
సన్ననెన్నడు మసియాడి వడంకఁ
దన్ను దూరుచును గద్గదకంఠ యగుచు
హాయని యెలుఁగెత్తి యఱచి హానాథ
మాయజూదం బింతమట్టుకుఁ దెచ్చి
మాయత్రోవలఁ జూపె మాయురే నాథ
పోయితే యెచటికిఁ బోయితే యనుచు
నెడపక యుబ్బంగి నేడ్చుచు విభుని
విడువక వెదకుచు విపినంబులోనఁ
గుందుచు దమయంతి కొంతదూరంబు
సందుగొందులఁ జూడఁ జనుచున్న నవుడు
పదపడి యాసమీపంబున నొక్క
పొదరింటిలో నున్న పుట్టలోనుండి
తనతల యెత్తి యాతస్వి నీక్షించి
పెనుబాము చెలఁగుచు బిరబిర వచ్చి

రోజుచుఁ గన్నుల రోషాగ్ను లడర
రాజిల్లువిషములు రాజి మండుచును
గలిదేవుపనుపునఁ గామినిఁ గదియు
విలవిలఁ బ్రాణముల్ పిడిచినభంగి
హానాథ యని మూర్ఛ నవనిపై నొరిగెఁ
బూని యప్పుడు పాము భూమీశుదేవి
పదములఁ బట్టి తప్పక మ్రింగు చుండె
మదిరాక్షి యప్పుడు మది మూర్ఛఁ దెలిసి
తను మ్రింగు నాఘోరదందశూకంబుఁ
గనుఁగొని శోకాగ్నిఁ గ్రాగుచుఁ బలికె
నక్కటా యీఫణి కాహార మైతి
నిక్కడ నాకింక నెవ్వారు దిక్కు
పామును విడిపించు బలవంతు లెవరు
నామేను మ్రింగుచున్నది యంతకంత
కలరాజ్య మెల్లఁ బుష్కరున కర్పించి
కలిరాజు మాయచేఁ గానలఁ జొచ్చి
యిడుములఁ బడి జీవితేశునిఁ బాసి
కడపట వచ్చి యీ కాలాహిచేతఁ
బడుటకు నావ్రాఁతఫల మిట్టు లుండె
నడరంగ నిపుడు నా యాపద మాన్ప
వడి నిట కెవ్వరు వత్తురో యింక

పుడమిఱేఁ డెచటికిఁ బోయెనో యెఱుఁగ
నీ వేళ నిందున్న నీపాముచేతఁ
జావనిచ్చునె దీని సాధించుఁ గాక
దైవమా యిట్టిబాధలకు లోఁజేయ
నీవేళ నీకు నేనేమి చేసితిని
అని యేడ్చుచుండంగ నాయార్తరవము
విని కలిమాయచే వేవేగ నొక్క
బోయవాఁ డరుదెంచి బోరన నపుడు
పాయక తనచేతఁ బట్టినపెద్ద
కత్తిచే నాపాముకంఠంబుఁ ద్రుంచి
యెత్తి యావల వైచి యెలనాగఁ జూచి
వెఱవకు లే లెమ్ము విపినంబులోనఁ
దిరుగాడ నేల నిత్తెఱఁగున నింతి
యెవ్వరివనితవో యెందుండి వచ్చి
తెవ్వని వెదకెదో యీపాముచేత
నేగతిఁ జిక్కితి విది యెల్ల నాకు
వేగంబ తెలుపుము వెఱ పెల్ల మాన్పు
దనవుడు లేచి యయ్యలినీలవేణి
తనదువృత్తాంత మంతయుఁ జెప్పఁ దొడఁగె
నోయన్న! వినుర యీయుర్వి యంతయును
బాయక చక్రింబు పను లొనరింప

నేలిననలునకు నిల్లాల ధరణిఁ
బాలించు భీమభూపతి పుత్రి నేను
దమయంతి యనుపేరఁ దనరినదాన
రమణతో నిషధపురంబున నుందు
నరిమురి పగదాయ యైనపుష్కరుఁడు
ధర నెల్లఁ గపటజూదంబునఁ గొనియె
నది యాది గాఁగ మహారణ్యమునకు
బెదరుచు రాఁగ నా ప్రియుని చేలంబుఁ
గపటంపుఁబక్షులు గైకొని చనియె
నపుడు శోకంబున నడలుచు మేము
ఒనరంగ నిద్దఱ మొకచీరఁ గట్టి
చను దేరి యొకశూన్యసదనంబుఁ గాంచి
యరిగి కూర్చుంటిమి యంతలో నేను
మఱచి నిద్దుర వోవ మదిలోన నలిగి
నాపతి భూపతి నాపాటుఁ జూడ
నోపక నాచీర నొకసాము చించి
యది కట్టి నను విడనాడి పోయినను
గుదులుచు నే మేలుకొని లేచి విభుని
గానక యేడ్చుచు కడు ఘోర మైన
కానలో వెదకి యెక్కడఁ గానలేక
యిక్కడి కరుదేర నీపాము నన్ను

దక్కక మింగ నిత్తఱి నీవు వచ్చి
యీపాముఁ జంపి నన్నెలమిఁ బ్రోచితివి
యీపార్థివేంద్రుఁ డెం దరిగెనో యెఱుఁగ
ననవుడు విని మనం బపుడు ఘుటిల్ల
వనజాక్షి కాబోయవాఁ డిట్లు లనియె
నీరజానన! నీవు నిదుర వోఁ జూచి
కోరి నీకట్టినకోకఁ జించుకొని
యడలంగ నిట్టిఘోరాటవిలోను
విడచి పోయినవాఁడు విభుఁడటే నీకు
పడతి నిఁక గానలపాలుగాఁ జేసి
యెడపక పోవువాఁ డెందైనఁ గలఁడె
మగువ నిన్నిట డించి మఱి బోవువాఁడు
పగవాఁడు గాక నీపాలిఁటిమగఁడె
అడవిలో నీరీతి నలజడిఁ బడుచు
విడువక నీవేల వెదకెదు వాని
నలివేణి యీపాముకన్నను మంచి
బలువైనఘోరసర్పంబులు గలవు
అడవిలోపల నొంటి నరుగంగ నేల
నిడుమలఁ బడుచు నీ విందీవరాక్షి!
వలవదు నావెంట వలనొప్ప రమ్ము
నలునికన్నను మంచినాథుండ నేను

నీ కేల జింతింప నీకోర్కు లెల్లఁ
జేకొని కొనసాగఁ జేయుదు నన్ను
నమ్మి నాయింటికి నలినాక్షి! రమ్ము
సమ్మతి నాయింట సకలసంపదలు
గల వన్నిటికి నీవు కర్త నై యుండు
పలుతెఱంగుల నన్ను బంటుగా నేలు
కొని యుండు నీ కేమి కొదువలు లేవు
ఒనరంగ నావెంట నూరక రమ్ము
పట్టణంబును బోలుఁ బరఁగ నావల్లె
నెట్టనఁ గనుఁగొని నీవె మెచ్చెదవు
మానిని! నేను సామాన్యుండఁ గాను
తేనియల్ వడియంగ దెఱవాల్లు గొట్టఁ
గడఁగి కన్నముఁ బెట్టి గడియలఁ దీయఁ
బుడమి ద్రవ్యము లెత్తి మూలల డాగ
ముడుపులు కతిరింప మొగి సొకుప్పఁజల్ల
నడుగు దాచుకపోయి యావల నడవ
వల లొడ్డ నురు లొడ్డ వాగులు గట్టఁ
బులుఁగుల వాకట్టి బోనన దొట్టి
గురుమృగంబులతోడఁ గూడంగఁ బాఱి
శరములఁ బడనేయ సరి నడుగెత్త
నాయంతవాలపరి నలినాయతాక్షి!

బోయరాజులలోనఁ బొడఁగాన మెందు
నేవేళఁ జూచిన నెట్టిమాంసంబు
గావలె నన్నను గలదు లే దనక
కావున నావెంటఁ గదలి రమ్మనిన
విని చాలఁ గోపించి వెలవెలఁ బాఱు
తనకోప మంతలోఁ దనలోన నడచి
యాపాపకర్ముని నందందఁ జూచి
యాపుణ్యసాధ్వి నెయ్యము మీఱఁ బలికె
ఓయన్న! యిది నీకు నుచితంబు గాదు
పాయక వినరానిపల్కు పల్కెదవు
ధరణీశుసతియును దనమతల్లియును
సరి యండ్రు పెద్దలు జగతిలో నెల్ల
ననుమాట వినవుగా యన్న! నీ కిదియు
వినిపింతు నిది బుద్ధి వెలయంగ వినుము
తనరినయేగురుతల్లులలోనఁ
దనగురుసతి యొక్కతల్లి యై యుండుఁ
దనరాజుసతి యొక్కతల్లి యై యుండుఁ
దనయన్నసతి యొక్కతల్లిగా నుండుఁ
దనసతితల్లియుఁ దల్లిగా నుండుఁ
దనుఁ గని చన్నిచ్చుతల్లియుఁ గాక
తనతల్లిసము లైనతల్లులు వీరు

ఇలలోన వీరియం దెవ్వారి కైన
సొలవక కామించి చూచినంతటనె
యాయువు సెడి పోవు నపకీర్తి సెందు
మాయును ముఖలక్ష్మి మానంబు దూలుఁ
బాపంబు వర్ధిల్లు బల మెల్ల నడఁగు
రూపంబు సెడి పోవు రోగంబు వచ్చు
నేపు రా దెన్నఁడు నెడయుఁ బుణ్యంబు
తాపంబు వొడము సంతాపంబు వచ్చు
నాపద లరుదెంచు నపజయం బొదవు
చూపులు వొలియును సుఖ మెల్ల నొలఁగు
సంపద లెడఁబాయు సత్యంబు వోవుఁ
బెం పెల్ల వెసఁ జనుఁ బెనుభీతి సెంగుఁ
దేకువ దప్పును దీనత వచ్చు
దాకొను ధైర్యంబు తలఁగును మఱియు
నంతటఁ బోవక యమకింకరాళి
కుంతముద్గరశూలఘోరగదాది
సాధనంబుల మఱి శస్త్రాస్త్రములను
బాధింతు రిదిగాక బహుపురీషాద
పూతి గంధంబులఁ బొరలింతు రుగ్ర
వైతరుణీనది వడి నెట్టి త్రోతు
రుడుగక పెక్కడ లుంతురు మఱియుఁ

బడిపడి నరకకూపములఁ బాతకుల
నని వేదశాస్త్రంబు లనిశంబు దెలుపు
మనమున నిట్టిదురర్థముల విడువు
మటు గాన నీతల్లి నగుదు నిచ్చటికిఁ
బటుగతి వచ్చి యీపాపమును జంపి
నన్ను రక్షించితి నాతండ్రి వైతి
వన్న నీ విటువంటియల్పకార్యంబు
సనుఁ బల్కఁ దగ దన్న నాతిమాటలను
విని వాఁడిసూదులు వీనులలోనఁ
గ్రుచ్చినగతి నొచ్చి కోపించి బోయ
యచ్చపలాక్షితో నప్పు డిట్లనియెఁ
దరళాక్షి! యిటువంటిధర్మశాస్త్రములు
సొరవు వీనులకు నీసుద్దులు విడువు
మును నీవు యమలోకమున బాధ లెల్ల
ననుభవించినయట్లు నరసి చెప్పెదవు
పాపపుణ్యంబులఁ బరికింప మెప్పు
డేపార శాస్త్రంబు లెఱుఁగము మఱియుఁ
గలకంఠి! యముఁడు మాకడకు రా వెఱచు
గిలిగింతలను బెట్టఁ గెరలునే శిలలు
మాకుఁ బాపము లేదు మదిరాక్షి! నిన్నుఁ
గైకొని పొందక కాని నేఁ బోవ

నన విని యపుడు రౌద్రాకార యగుచుఁ
దనలోన మండుచుఁ దరళాయ తాక్షి
వెలయ నావృత్తంబు వీఁ డేమి యెఱుఁగుఁ
గలుషాత్ముఁ డని వానిఁ గనుఁగొని పలికె
నోరి పాపాత్మ! యీయురగంబుఁ జంపి
కారుణ్యమున నన్నుఁ గాచితి గాన
రయమున నినుఁ జంప రా దని యున్న
భయ మింత లేక దుర్భాష లాడెదవు
నీ వేడ నే నేడ నీమాట లేడ
నీ విందు నుండక యిపుడు పొమ్మనిన
నప్పుడు వాఁడు రౌద్రాకారుఁ డగుచు
నిప్పులు గన్నుల నిండార దొఱఁగ
నప్పద్మలోచన నల్లనఁ జూచి
కప్పినకామాంధకారంబుచేతఁ
దనమేను దెలియక దగ్గఱ రాఁగ
వెనుకకుఁ బోయి యావెలఁది యిట్లనియె
నిం దెందు వచ్చెద వికఁ జూడ రోరి!
పొందిననీగర్వము నడంతు ననిన
బలవంతమున నన్నుఁ బట్టి పైఁ బడినఁ
జెలి! యేమి చేసెదు చెప్పుమా యిప్పు
డని పట్టఁ గమకించునంతలోపలన

యొనరంగ నీఁక నూరకుండ రా దనుచుఁ
దనలోనఁ దలఁచి యాతామరసాక్షి
మనమున వాకున మఱి చేఁతలందు
నరునిఁ గెల్చినపతివ్రత నౌదు నేని
నరలోకవిభుఁ డైననాకూర్మివిభుఁడు
వరుస సత్యంబుఁ దప్పక మను నేని
హరికృపఁ బొందినయంగన నేని
బోయవాఁ డిప్పుడే పొలసి దుర్గతినిఁ
బాయక పడు నని పడఁతి శపించె
సడలనియాఘోరశాపాగ్ని దగిలి
యుడుగక యాబోయయు బ్బెల్లఁ బొలసి
పిడుగులు వడి కొండ పృథివిపైఁ గూలు
వడువునఁ దెప్పున వసుధపైఁ గూలి
కలఁగుచుఁ బలుమాఱుఁ గాళ్లు చేతులును
విలవిలఁ దన్నుక విడిచెఁ బ్రాణముల
నంతలో దమయంతి యచ్చోటుఁ బాసి
వంతఁ గుందుచు శోకవార్ధి నీదుచును
భూపాలుఁ డిటు పాసిపోవుటఁ జేసి
యీపాతకుండు న న్నిట్లాడెఁ గాక
నావిభుఁ డిం దున్న నన్ను బాధింప
భావించునే వీఁడు పలుగాకి గాన

మగదిక్కు లేకున్న మగువప్రాణంబు
దగదు బెట్టక యుండ ధారుణిమీఁద
నిట్టిపాతకు లెంద ఱిచ్చోటఁ దెరువు
గట్టిక నన్నింత గాసిఁ బెట్టుదురొ
పతి డించి పోయినపడఁతిని బుద్ధి
మతులు సందేహించుమాటలు నిజము
మాటికి మగవాఁడు మహిమీఁద నరుగ
నాఁటది యొంటిగా నరుగంగఁ బోల
దాఁడుపుట్టుకఁ బుట్టినట్టిదోషంబు
వాఁడిమి భువిఁ బగవారికి వలన
దక్కటా యబల నీయడవిలోపలను
దిక్కు మాలినయట్లు తిరుగంగ వలసెఁ
గొండల నడవులఁ గ్రుమ్మరఁ జాల
నొండేల నిఁకఁ బ్రాణ మునుపంగఁ దగదు
పెనిమిటి కెక్కక ప్రియు నెడఁ బాసి
చను మని యెవ్వరు శపియించి రొక్కొ
యని తీఁగెమెఱుఁగున నాకోమలాంగి
దననాథుఁ బేర్కొని తా నేడ్చుకొనుచు
నరుదార నెదురుగా ననలుండు ప్రబలి
పరువడిఁ బొద లెల్ల భస్మీకరింపఁ
దరళాక్షి గని వేడ్క దావాగ్ని నడుమ

నరుదారఁ జొచ్చిన నది సల్ల నయ్యెఁ
కరి తొండములు దనకరములఁ బట్టి
కరికరిఁ బెనఁగినఁ గరు లూర కుండె
నెలుఁగుపిల్లలఁ బట్టి యిట్టట్టు సేయ
వలఁ గొని యెలుఁగు లవ్వలకుఁ దొలంగెఁ
బులు లున్నకడకు గొబ్బునఁ బోయి కదిసి
పొలియుట కెదిరినఁ బొరిగొన కఱచె
కంఠీరవంబులఁ గదిసి యాకంబు
కంఠి సీరిన నవి గదియక పోయె
నడవిపందులఁ జేరి యందంద ఱాళ్ల
నడరుచు రువ్విన నవి పాఱిపోయెఁ
బాముపుట్టలలోన బాహువుల్ సాచి
పామినఁ గఱవక ఫణులు దొలంగెఁ
దొణికెడుకొలఁకులఁ దుమికిన జలము
ఫణివేణి కూరులబంటి యై యుండె
నది సూచి హా యని యదంద యేడ్చి
యిది యేమి మాయయో యెఱుఁగంగ రాదు
పరువడి నే మహాపాపిని గాన
సరగున నిపు డేల చావు సిద్ధించు
నని యని వగచుచు నాదమయంతి
చని చని మఱియును జఱియలఁ దుమికె

నీరీతిఁ బ్రాణమ్ము లేమిటఁ బోక
యారామ యడవిలో నలమటఁ బడుచు
జను లేమి తిందురో చావున కనుచు
మునుకొని విషపత్త్రముల్ గోసి తినిన
నావిషపత్త్రంబు లాఁకలిఁ దీర్పఁ
జావు రాదని యోడ్చి చనుచుఁ గట్టెదుటఁ
బనస పిప్పలి నింబ పాటల వకుళ
ఘనసార సౌవర్ణ ఖర్జూరములును
పొన్నలు పొగడలు పోఁకమ్రాకులును
గన్నేరులును మల్లికలు చూతతరులు
కదళికుండకదంబకాంచనకుటజ
బదరతింత్రిణిబిల్వపారిభద్రములు
తెలియంగఁ గమ్మపూఁదీఁగెలు ప్రబలి
బలు వైనచలువచప్పరముల నలరఁ
జల్లనినీడల జాతివైరంబు
లెల్లను విడిచి ప్రియంబునఁ బొదలి
సింగంపుఁగొదమలు సేరి యేనుఁగులఁ
జెంగలించుచు ముద్దు సేయుచు నుండు
పెనుజాడఁ దప్పినపెయ్యల వెదకి
కొని పోయి మొదవులఁ గూర్చెడిపులులు
లేడిపిల్లలను శాలించుచుఁ గూడి

యాడుచు నుండి పెంపలరు రేఁచులును
సరసంబుగా ముంగిసలమీఁద నెక్కి
వరుసతోఁ బ్రాకెడివరపన్నగములు
ఎలుకలపిల్లల నెలమితోఁ గూడి
కులుకుచు ముద్దాడుకొనెడుపిల్లులును
పలుచనినీళ్లలోఁ బడి యున్నమీను
కులుకుచు వాసితోఁ గూర్చుకొక్కెరలు
కోకిలార్భకులను గూడి యుందంద
చేకొని మేఁత భక్షించు కాకులును
పొలుపొంద నివ్విధంబున వినోదంబు
గలిగియుండినయొక్కఘనతపోవనము
దమయంతి కనుఁగొని తనలోనె మెచ్చి
యమరినయిట్టిపుణ్యాశ్రమభూమి
నేమాని యుండునో యిది చూత మనుచు
నామానినీమణి యచటి కేతెంచి
పురుషప్రమాణంబు భూమిపై కెగసి
పరమాత్ము నాత్మలో భావించువారి
నొక్కపాదాంగుష్ఠ మూర్విపై నిలిపి
నిక్కి భానునిఁ జూచి నిలిచినవారిఁ
దరుశాఖలందుఁ బాదములు దగిల్చి
కర మర్థి దల క్రిందుగా వ్రేలువారిఁ

బద్ధాసనంబునఁ బరఁగఁ గూర్చుండి
పద్మాక్షునుతులు దప్పక చేయువారి
హోమమంత్రంబుల నుచ్చరించుచును
హోమంబు లతిభక్తి నొనగి వ్రేల్చువారిఁ
గరములు ముకుళించి కన్నులు మూసి
చిరభక్తి జపములఁ జేసెడివారిఁ
గనుఁగొని మదిలోనఁ గడు సంతసిల్లి
చని చని ముందఱఁ గూర్చుండి యచటఁ
బొందుగా వేదార్థముల వేడుకలర
నొక్కరి కొక్కరు నొగిఁ జెప్పుచుండ
నక్కామినీమణి యమ్మహాత్ములకుఁ
దప్పక సాష్టాంగదండంబు వెట్టి
యప్పుడు దమయంతి హా యని యేడ్వఁ
గనుఁగొని చాల యోగధ్యానమహిమ
మనమున నది కలిమాయఁగా నెఱిఁగి
యొండొరుల్ సందడి నొనర వారించి
నిండినకృపతోడ నెలఁత కిట్లనిరి
యొలనాగ నీ విపు డేల యేడ్చెదవు
వలవదు కర్మంబు వచ్చినవేళ
మూఁడుకన్నులు గలమూర్తికి నైన
వాఁడిమి దప్పింప వశము గా దిలను

మదిరాక్షి చూచితే మాయోగదృష్టి
నది నీకుఁ జెప్పెద మంతయు వినుము
కలిరాజు పన్నినకపటజూదమున
కలరి నీవిభుఁడు రాజ్యంబెల్లఁ బాసి
కలకంఠి! నిను గూడి కానకు వచ్చి
పులుఁగులచేఁ జేలమును గోలుపోయి
చెచ్చెర నీపైఁటచెఱఁగుఁ గట్టికొని
వచ్చి కొలంకున వడి నీరుఁ ద్రావి
య త్తీరవిజనగేహముఁ బ్రవేశించి
నె త్తి నేలకు వ్రాల్చి నీ వందు నిదురఁ
బోవుచు నుండంగఁ బురపురఁ బొక్కి
భావించి నినుఁ జూచి పాసి పోలేక
శోకించి శోకించి సుందరి! నీదు
కోకకొం గొకయింత గొబ్బునఁ జించి
యది కట్టుకొని నిన్ను నచ్చట డించి
పదపడి పోవ భూపతి నొక్కపాము
గఱచిన నాతనికాంతియుఁ బాసి
పరువడి వికృతరూపమున నయోధ్య
కరిగి యాఋతుపర్ణు నందందఁ గాంచి
గురుతరభక్తిఁ గొల్చి వసించె
నలివేణి! నీ వన్న డానిద్రఁ దెలిసి

వెలవెలపాటున విభుఁ గానలేక
విపినంబులోపల విహరించు చుండ
నపు డొకపాము నయ్యెడ నిన్ను మ్రింగ
నొకబోయ మూర్ఖుఁ డాయురగంబుఁ జంపి
శుకవాణి! నిను బట్టఁ జూచిన నీవు
కోపించి యాపాతకుని కంతలోన
శాపంబు నొసఁగి యాజముపురి కనిపి
పతి లేనికతన నీపాపాత్ముఁ డకట
మతి దప్పి యిటువంటిమాట లాడె ననుచు
జావఁ దలంచి యచ్చటిమృగావళిని
వేవేగఁ గదిసిన వెఱచె నన్నియును
ఎలనాగ! నీ వంత నిటకు వచ్చితివి
కలిరాజు మిముఁ బట్టి కలఁగి యారీతి
వెఱపించు చున్నాఁడు వెఱవకు మింక
తరుణి! నీవిభుఁడు మోదమున నున్నాఁడు
లోలాక్షి! యీ రేడులోకంబులందు
నేలీల నైన నీ కెవ్వరు సములు
సరస పతివ్రతాజనము వీక్షింప
నరుదార సౌఖ్యంబు లనుభవించెదవు
మఱవకు నీ కొకమాటఁ జెప్పెదను
ఉరుతరాటవిలోన నుండకు మింక

పుడమి సుబాహునిపురమున కఱగి
తడయక నారాజు తరుణిదగ్గఱను
సైరంధ్రి నై కొల్చి సరసత నుండు
వారక యిఁక మూఁడువత్సరంబులకు
నీ నాథుఁడును నీవు నెమ్మదిఁ గూడి
మానితసకలసామ్రాజ్యసౌభాగ్య
మనుభవించెదవు నీ వడలకు మమ్మ!
పెను పొంద మేము సెప్పినమాట వినుము
నీవు వచ్చినదాఁక నిలిచితి మిచట
సావధానత సమస్తము నీకుఁ దెలిసె
తరలాయతాక్షి! మాతపము లీడేరె
బరువడి నిఁక మేము బ్రహ్మలోకమున
కరిగెద మిపు డన్న యామాట లెల్ల
వెర వొప్ప విని చాల విస్మయం బంది
కలఁగినచిత్త మొక్కటిగాఁగఁ జేర్చి
యలినీలవేణి యి ట్లని విన్నవించె
పరమపావనులార! ప్రణుతాత్ములార!
నరలోకనుతులార! నా తండ్రులార!
ఘన మగుమీపాదకమలంబు లేను
కనుఁగొని సేవింపఁ గలిగె నాభాగ్య
వశమున నేఁ బుణ్యవర్తన నైతి

విశదంబుగా నేను విపినంబులోన
నడలినవిధ మెల్ల నానతిచ్చితిరి
కడు వేడ్క వుట్టె నాకలుషంబు లడగె
వేడుక మూఁడేండ్ల వెనుక నావిభుని
గూడియుండుదు నంచుఁ గోరి చెప్పితిరి
యిది నమ్మఁ జాల నా కిది నిజం బనుచు
సదయత నాశిరస్స్థలి వంటుఁ డనిన
నెలనాగ! యింక మూఁడేండ్లకు వెనుక
బలవంతుఁ డైనసీప్రాణనాయకుని
గలసి నెమ్మదిని సౌఖ్యము నొందఁగలవు
సలలితంబుగ నిది సత్య మటంచు
కరములఁ జాచిరి కమలాయతాక్షి
సిరముమీఁదికి మునిసింహులు పిదప
నొనరంగ నాసుబాహునిపట్టణమున
కనుపముగతి మార్గ మప్పుడు చూపి
కడువేగ బ్రహ్మలోకమునకుఁ జనిరి
తడయక దమయంతి తనచింతఁ గొంత
మదిలోన నడచి యామార్గంబునందు
బెదరక చను చున్న పెరికెలవారు
దమయంతిచంద మంతయుఁ జూచి వగచి
క్రమ మైనరూపరేఖల మూసి చాల

నుడుగనివగవున నొంటిగా నీవు
నడచె దెచ్చటికి తిన్నఁగఁ జెప్పు వమ్మ!
నాతి నీపే రేమి నాథుఁ డెవ్వాఁడు
మాతోడఁ జెప్పవే మాతల్లి! నీవు
వనజాక్షి! యన విని వారలఁ జూచి
తనదువృత్తాంత మంతయుఁ జెప్పఁ దొడఁగె
వినరయ్య చెప్పెద విశ్వంబులోన
వినుతి కెక్కిన నలోర్వీపతిసతిని
ధరణిలో నాపేరు దమయంతి యండ్రు
నరలోకనుతుఁ డైన నాప్రాణనాథుఁ
డనగంగ జూదంబు నెలమితో నాడి
వసుమతి దాయాదివారల కోడి
యడవులఁ జరియింత మని వచ్చి మేము
పడరానియిడుములఁ బడి యొక్కచోట
నిలిచి యక్కట నేను నిదుర వోవంగ
కలిమాయచే నన్నుఁ గానలో డించి
భూనాథుఁ డెక్కడఁ బోయెనో యెఱుఁగఁ
గాన రే నలమహీకాంతుని మీర
లిల నేడుదీవుల నేలెడువాని
వలరి కృష్ణప్రీతికై బ్రాహ్మణులకు
భయభక్తి మీఱంగ బహుళసంపదలఁ

ప్రియ మొప్పఁగా సమర్పించినవాని
నిత్యసత్కీర్తుల నెగడెడివాని
నత్యంతహరిభక్తి నమరినవాని
జగతి నిక్ష్వాకువంశజుల కంద ఱికిఁ
బొగడొందుకీర్తులఁ బుట్టించువాని
నోతండ్రులార! మీ రుర్వి నెం దైనఁ
బ్రీతిఁ జూడరుగదా పృథివీతలేశు
ననవుడు విని వార లాత్మలో నగచి
పరివడి మాతఁగా భావించుకొనుచుఁ
దోయజహితదీప్తి దూఱనియట్టి
యీయరణ్యంబుల నేల వేగింప
బురములలోఁగాని భూలోకనాథుఁ
డురుతరాటవిలోన నుండంగఁ బోఁడు
సతి నీవు మా వెంటఁ జనుదెమ్ము భూమి
పతి యాజానుబాహునిపట్టణంబునకుఁ
బోవుచున్నార మోపూబోడి! యనుచు
వావిరిఁ దోడ్కొని వడి వడి నరుగఁ
జెదరక తాము చేసినపుణ్యమహిమ
నెదుట నొక్కతటాక మింపొప్పి యున్న
నదిగని జనుపవా రంద ఱాకొలనుఁ
గదిసి గోనెల నొక్కకడఁ బడఁ ద్రోచి

తనర నెద్దుల నీరుఁ ద్రావించి మఱియు
తనివి నింపార నందఱు నీరుఁ ద్రావి
వేడుక నాచెంత వెలసిన మ్రాకు
నీడల నందఱు నిలచి కూర్చుండి
తమతమబడలికల్ తీరె చెప్పుచును
దమయంతిఁ జూచి యోతల్లి ! నీ విపుడు
కొందుగక యుదకంబుఁ గ్రోలు మటన్న
మదిరాక్షి పోయి యామంచిజలంబు
లాకకొన్నిఁటినిఁ గ్రోలి యొగి మూర్ఛవోయి
వికలత్వమున లేచి విభునిఁ దలంచి
యెటు పోయితివి నాథ ! యిడుమల నొంద
నిటు నను డించి నీ వెం దున్నవాఁడ
వనుచు హా యని శోక మందుచు నుండె
జనుపవా రప్పు డాజలజాయతాక్షి
శోకంబు మాన్ప నచ్చో నొక్కచల్ల
మ్రాకునీడను జేరి మగువ కూర్చుండెఁ
దనవంశభవుఁడు భూధవుఁ డైననలుని
వనితకష్టముఁ జూడ వశము గా కస్త
గిరిఁ జేరె నన్నభంగిని నొప్పుగగన
సరణిని బశ్చిమాచలమున కరిగె
తడఁబడ మింట సంధ్యారాగ మొప్పెఁ

గడువడిఁ జుక్కలు గనుపట్టె మింట
నది నభం బిది భూమి యని యెన్న కుండఁ
గదిసి యంతంతఁ జీఁకటి నిండ బర్వె
మెండుగా ఘూకముల్ మెలఁగంగఁ జొచ్చె
దండిభూతంబు లుద్దండతఁ దిరిగె
బేతాళు భూమి కంపింపఁగాఁ గొలిచి
భూతంబు లందంద పొడసూపఁ దొడఁగె
సరగున నప్పు డాజనుపవా రెల్ల
మఱచి నిద్దురవోవ మత్తసామజము
లరుదెంచి యెద్దుల నటఁ గొన్ని జంపి
పెరికెలవారల పీచ మడంచి
కొండల మందింపఁ గూయుచు లేచి
కొందఱు సందుల గొందులఁ జొచ్చి
తమతమప్రాణముల్ దప్పించికొనిరి
అమరంగ మఱి కొంద ఱటుపోవ లేక
చరణముల్ తడబడి చన లేక యచటఁ
గరులచే మడిసి రా కల్లోల మైన
రవళి దిగ్గన లేచి రాజేంద్రు దేవి
వివశ యై యిది యేమివిధమొకో యనుచుఁ
గరులఁ గన్గొని చావు గల్గె నటంచు
దరియఁ బోయిన నవి తలఁగిన మరలి

వసుధపైఁ జచ్చినవారలఁ జూచి
వినువక యేడ్చుచు వెలఁది యిట్లనియె
నక్కటా యీపాప మంతయు నాకుఁ
గక్కసంబుగఁ జూడఁ గలిగెనే దోష
కారిని గాన నీకర్మంబు మీకుఁ
జేరెఁగా యిఁక నేమిసేయుదు నకట
నేను మీవెంబడి నెఱి వచ్చుకతన
నేనుఁగుల్ వచ్చి మి మ్మిటుఁ జంపి పోయె
నా కేల సిద్ధించు నలి నిట్టి చావు
చేకొని యిఁక నేమిసేయు నున్నదియొ
కలిరాజు చేసెడికపటవర్తనము
అలరంగఁ దెలియరా దని యేడ్చు చుండెఁ
జావక తప్పినజనుపవా రప్పు
డావెలందుకదుఃఖ మంతయు మాల్పి
నీవేమి సేతువు నీరజవదన!
యీవిధ మట్లుండె నడలంగ నేల
మన్నన నిను జూచి మమ్ము కొందఱిని
మన్నించి పోయె నా మదసామజమ్ము
లని పల్కుచుండఁగా నంతలో భానుఁ
డనురక్తిఁ బూర్వాద్రి కరుదెంచె నంత
నామత్తగజయాన యచ్చోటుఁ బాసి

యామార్గమునఁ బోవ నటఁ గొంతదూర
మునఁ గనుపించె గోపురకాంతిరుచులు
ఘన మైనమేడలు కనకహర్మ్యములు
కోట లుప్పరిగ లాకోమలి చూచి
పాటించి సైరంధ్రిభామవేషమునఁ
బురములోఁ జొచ్చి యప్పుడు మేను కుంచి
వెలవొప్ప నా రాజవీథి సిరితోఁ
గువలయేశ్వరుఁ బాసి కుందుచు వచ్చు
కువలయాక్షిని గుంపు గూడి చూచుచును
గువలయహితబింబకోమలాననలు
తవిలి యిట్లని రంతఁ దమలోనె తాము
చూడరో యమ్మ! యీసుదతిరూపంబు
వేడుక లూరెడు వెనఁ జూడఁ జూడ
నీవనితామణి యెవ్వరో కాని
భావింపఁ బతికిఁ దప్పనియరుంధతియొ
యనిశంబుఁ గొనియాడ నగుచంద్రమతియొ
మనసిజాతునివధూమణియొ రోహిణియొ
యమరేంద్రుమణి యొప్పు నసఁ దగు కొప్పు
కమలారిబింబంబు గదుకు నెన్నుదురు
నరవిందపత్రములట్లు నేత్రములు
మెఱుఁగుటద్దముజోడు మించు చెక్కిళ్లు

కంతుశంఖంబు పొంకంబు కంఠంబు
వింతపువ్వుల చెండ్లు వెలఁదిపాలిండ్లు
చిగురుటాకులబాగు చేతులలాగు
బిగియింప సాధ్యంబు పేదమధ్యంబు
స్ఫుటసైకతనిభంబు శ్రోణీతలంబు
పటుతరకదళికాప్రభ నొప్పుతొడలు
తలిరులచొప్పు పాదంబులయొప్పు
కలహంసినడలు చక్కనినాతినడలు
నింగిఁ దళుక్కున నెగయు మెఱుంగో
బంగారుబొమ్మయో పగడంపు లతికో
కలికిరాచిలుకయో కాయజుశరమొ
యలరుఁబంతియో యాణిముత్తియమొ
యని యిట్లు వినుతింప నాదమయంతి
గని పురసతులు డగ్గఱి మఱిమఱియుఁ
జూచుచుండంగ నాసుందరి యపుడు
సైచనివెత రాజసరణిఁ బోవంగ
నల్లనఁ బురనాథుఁ డైనసుబాహు
తల్లి శిరోగృహస్థలినుండి చూచి
తనచెంత నుండినతరుణికి ట్లనియె
వనజాక్షి! చూచితే వచ్చెడుదాని
నలినారిఁ బోలునాననకాంతి మించి

వల నొప్ప శ్రీలక్ష్మి వడువున నున్న
దీయింతి యెవ్వరో యెఱుఁగంగరాదు
పోయి నీవచటికి పొలఁతిని దోడు
కొని రమ్మటన్న నాకోమలి పోయి
మనుజేశుసతిఁ జూచి మాయమ్మ నిన్ను
అతివేగఁ దోడితెమ్మని సన్నుబంచె
నతిప నావెంట రమ్మని తోడికొనుచుఁ
జనుదేర నమ్మహీశ్వరుదేవిఁ జూచి
ఘన మార నారాజమాత యిట్లనియె
నిందీవరాక్షి ! నీ విటువంటివగల
నెందుఁ బోయెదవు నీ వెవ్వరిదాన
విలలోన నీకుఁ బ్రాణేశుఁ డెవ్వాఁడు
కలకంఠి ! నీమేనఁ గలలక్షణమ్ము
లరసి చూచినఁ జోద్య మగుచున్న దిప్పు
డెఱఁగింపు నీ విధం బెల్ల నా కనిన
జలజాక్షి సైరంధ్రిజాతికోమలిని
నలుఁ డను పేరిగంధర్వుఁడు విభుఁడు
నభమునఁ జరియించు నన్ను నేమరఁడు
ప్రభురాణి యనుపేరఁ బరఁగితి ధాత్రిఁ
గలిగిన సైరంధ్రికాంతలలోనఁ
గలపంబుఁ గడులెస్సఁగాఁ గూర్పఁ గలను

గోకలు గట్టను కుంకుమ వెట్టఁ
బోకలు వర్ణింప పువ్వులు గట్టఁ
గాటుకఁ బెట్టను గంధంబుఁ బుయ్య
పాటించి సూటిగాఁ బాపటఁ దీయఁ
గురు లెల్ల సవరించి కొప్పు గీలింప
తెఱఁ గొప్పఁ గస్తూరితిలకంబుఁ దీర్ప
నవరత్నములు దెచ్చి నవ్యసూత్రములఁ
దగిలించి గళమునఁ దగిలింప నేర్తుఁ
బనిఁబూని యిటువంటిపను లొనరింప
ననువుగా నాచేత నౌను గాదనకు
మఱవక నే నొకమాటఁ జెప్పెదను
పొరుగిండ్లపనులకుఁ బోవ నెన్నఁడును
జెలరేఁగి మగవారిచెంతకుఁ బోవ
వలు విచ్చి నగ నోపఁ బలుమాట లాడ
కొఱఁత నేఁ గట్టినకోకయె కాని
మఱి యేమి యొల్ల సమ్మదము దైవారఁ
దలఁపున నన్ను నీ దాసిఁగా నేలి
నిలువుము నిలిచెద నీవద్ద ననిన
నా రాజమాత యయ్యవనీశుసతిని
గారుణ్యరస మొలుకఁగాఁ జూచి మెచ్చి
యాదిలక్ష్మీదేవి యమరినయట్లు

ప్రోదిగా మాకెల్ల బుద్ధిఁ జెప్పుచును
నోనరంగ నావద్ద నుండవె యమ్మ!
యసురక్తి నీ కిష్ట మైనచందమున
ననుచుఁ గూఁతు సునంద యనుకన్యఁ బిలచి
యనిశంబు సతిఁ బ్రోవు మని యొప్పగించె
దమయంతి యచ్చటఁ దా నేర్పుపనులఁ
గ్రమ మొప్పఁ జేయుచు గలఁగుచు నుండె. 760

---

# పంచమాశ్వాసము.

---

అక్కడ నలుఁ డయోధ్యాపురంబునను
మక్కువ మీఱ నమ్మనుజేశుఁ గొల్చి
పలికి సమ్మద మైనపనులఁ జేయుచును
మెలఁగుచు నానలమేదినీనాథుఁ
డొకనాఁడు వెన్నెల యొగిఁ గాయుచుండ
నకలంకమతితోడ నటఁ బవ్వళించి
తనప్రాణనాయికిఁ దలఁచి చిత్తమునఁ
దనలోనఁ దా నిట్లు తలపోయఁ దొడఁగె
అక్కటా నిన్ను ఘోరాటవి డించి
పొక్కుచు వచ్చి యీపురిఁ జేరినాఁడ
నను నీవు వెదకి కానలలోనఁ దిరిగి
కనలేక యెట్టిదుఃఖముఁ బొందినావొ
గిరిగృహంబుల నన్ను గెరలుచు వెదకి
గురుమృగంబులచేతఁ గూలితి వేమొ
పన్నగాఁ బొదలలోపల నన్ను వెదకి
పన్నగంబుల కగపడితివో లేమ!

యాయెడ ననుఁ గాన కడలుచునుండ
బోయలమాయలఁ బోయితో భామ!
వెలవెలపాటున వెదకుచు నన్నుఁ
బలుమాఱు నీ వెంత బడలితో చెలియ
విడువక నను నీవు వెనుకంగ వచ్చి
యిడుములఁ బడుచు నెట్లేగితో తరుణి!
కలనైన ననుఁ బాయఁగాఁ జాల నంచుఁ
బలికితి విపు డెట్లు బాసితో లలన!
నిదుర మేల్కొని నన్ను నెమ్మిశోఁ గాన
కదరి యొంటిగ మూర్ఛ నందితో తరుణి!
యే దేశముల కేగి యెం దున్నదాన
వే దెస పాటిల్లె నిద్దతి కనుచుఁ
దనుఁ గొల్చురాజులఁ దాను సేవింపఁ
బనిచిన తనవ్రాఁతఫలము నెన్నుచును
దనలోన నీరీతిఁ దలపోయుచుండ
విని ఋతుపర్ణుండు విస్మయం బంది
యిదియేమి బాహుక! యెన్నఁడు నీవు
మదిరాక్షి కల దని మదిలోనఁ దలఁప
విప్పుడు తలఁచి నీ వేల శంకించె
దప్పు డాయింతిని నడవిలో విడచి
వచ్చితి వెంతలావణ్యంబు గలదొ

యచ్చపలాక్షి నీకన్నను మఱియు
నెట్టిరూపము గలయింతిరో దాని
నెట్టన నడవిలో నిల్పి రాఁ దగునె
కంతుఁడు నీమీఁద గదిసెఁ గాఁబోలు
నింతిని దలఁచి నీ వి ట్లేడ్చుచున్న
నది నిన్నుఁ దలఁచి పుష్పాస్త్రనిబాధ
మదిలోన నేమని మరుగు చున్నదియొ
హరిహరబ్రహ్మాదులంతటివారు
మరునకు వెఱచి భామల నురంబునను
శిరమున వాక్కునఁ జేర్చికొన్నారు
సరసత నీయంత చక్కనివాఁడు
పుక్కిట నిల్లాలిఁ బూనంగ లేక
యొక్కఁడ విట్లుండ నుచితమే యనిన
విని వెలవెలబాఱి వెఱచి నలుండు
జననాథ! నా కేల సతి నన్నుఁ జూచి
రోయక సతులు గోరుదురె నాపొందు
కాయజుఁ డిపుడు నాకడ కేల వచ్చు
నావగఁ జూచిన నగుదురు జనులు
భూవర! నేఁ బ్రొద్దు పుచ్చెడికొఱకు
పొలవక నొకరాజు నుద్దులు మదిని
దలపింప నుడివితి తప్పది నాకు

నను గేలిసేయకు నరనాథ! యనినఁ
దనలోన నవ్వుచు ధరణీశుఁ డరుగఁ
జచ్చినచావుగా జనలోకనాథు.
డచ్చోట నాత్మలో నడలుచు నుండె
నక్కడ నంత భీమావనీనాథుఁ
డెక్కడఁ బోయెనో యింతియు నలుఁడు
పొక్కుచు నేదేశమున నున్నవారో
అక్కటా అని యాత్మ నందంద పొగిలి
తనమంత్రివరుల బాంధవుల భూసురుల
యనుమతి వసుదేవుఁ డనుపురోహితునిఁ
బిలిపించి యతనికిఁ బ్రియము సంధిల్లఁ
బలికె హేమపటాదిబహుమాన మిచ్చి
అనఘాత్మ! నాకూఁతు రల్లుఁ డేదేశ
మున నున్నవా రొకో భూదేవ! నీవు
వేవేగఁ జని వారివిధ మెల్ల నరసి
రావలె నని తన్నుఁ బ్రార్థించుఁ దనఁ
బనిఁ బూని యప్పు డాబ్రాహ్మణోత్తముఁడు
తనవారితోఁగూడఁ దడయక యరిగె
గౌళదేశంబు బంగాళదేశంబు
మాళవదేశంబు మత్స్యదేశంబు
సౌరాష్ట్రమగధఘూర్జరమహారాష్ట్ర

శూరసేనపుళిందచోళలాటాది
దేశంబులం దెల్లఁ ద్రిమ్మరి కాశి
కాంచీప్రయాగాదిఘనపట్టణముల
సంచరించి యనేకశైలంబులందుఁ
బుణ్యాశ్రమంబులఁ బుణ్యఘట్టములఁ
బుణ్యతీర్థంబులఁ బుణ్యభూములను
గ్రమ మొప్ప వెదకి యెక్కడఁ గానలేక
తమలోనఁ దాము సంతాపంబు నొంది
యురువడి నానుబాహునిపట్టణమున
నరయుద మని యప్పు డాపురిఁ జేరి
యరయుచు నుండిరి యటఁ గొన్నినాళ్ళు
కురుభక్తి నానుబాహుం డొక్కనాఁడు
దానముల్ సేయంగఁ దలఁచిన ద్విజులు
భూనాథుఁ గనుఁగొనఁ బోవంగఁ జూచి
వసుదేవముఖ్యులు వారితోఁ గూడఁ
బొనఁగ దానముఁ బట్టఁ బోవుచందమునఁ
జని రాజభవనంబుఁ జయ్యనఁ జొచ్చి
యొనరు వింతలఁ జూచు చుండఁగా నచట
నెరయఁ జిక్కొదవిన నెరివేణితోడఁ
బరికించి నడిచెడిపదములతోడ
నుడుగక వెడలునిట్టూర్పులతోడ

గుటుగుటుక్కున మ్రింగు గ్రుక్కిళ్లతోడ
నన్నె జాతినయట్టివాతెఱతోడఁ
జెన్ను దొలంగి డస్సినమోముతోడ
లలి దప్పి మొలకుఁ జాలనిచీరతోడ
నలుకుచు నొకచోట నుండఁగాఁ జూచి
యవనీశుసతి యైనయాదమయంతి
యవునొకో కాదొకో యని సంశయమున
వను దేవుఁ డప్పు డావనితదగ్గఱకు
వెసఁ జేర రాఁ జూచి వెంవెలఁ బోయి
తనతండ్రిసన్నిధిఁ దగువిప్రుఁ డనుచుఁ
దనలోనఁ దెలిసి యత్తఱిఁ జూడ వెఱచి
యొనసినవగలతో నిల చూచుచుండఁ
గనుఁగొని దమయంతిగా మనంబునను
దలఁచి యావిప్రుండు తరలాక్షిఁ గదిసి
కలఁగిననీళ్లలోఁ గమలినిబోలి
జలధరంబులలోని శశిరేఖఁ బోలి
మలినాంబరములోని మణియునుబోలి
చలితధూమావృతజ్వాలికఁ బోలి
యోచంద్రవదన! యిందున్నావె నీవు
రాచపుట్టుకఁ బుట్టి రాయిడిఁ బడితె
దమయంతి! వినుము నీధవుఁ డెందుఁ బోయె

మమ్ముఁ బంచె మీతండ్రి మహి యెల్ల వెదక
అనుడుఁ బేరెలుఁగెత్తి యాదమయంతి
తనమొగంబునఁ జీరఁ దగఁ జేర్చి యేడ్వ
విని కలంగి సునంద వేవేగఁ గదలి
జననిదగ్గఱ కేగి చయ్యనఁ బలికె
మనప్రభురాణి యేమొకో కాని తెలియ
దెన లేనిదీనత నేడ్చుచు నున్న
దాకభూసురునిఁ జూచి యుడుగక యనిన
నకలంకగతితోడ నారాజమాత
గ్రక్కునవచ్చి యాకాంతాలలామ
నక్కునఁ జేర్చి యూరార్చి వాక్రుచ్చి
యచ్చట నున్నబ్రాహ్మణు విలోకించి
యిచ్చపలాక్షి యిల్లీల శోకింప
నిటకుఁ బంచినవార లెవ్వరు మిమ్ముఁ
దటుకున నిప్పు డంతయుఁ జెప్పు మనిన
విని వసుదేవుఁ డావెలఁది నీక్షించి
మనమున నలరి యామగువ కిట్లనియె
వినుము విదర్భభూవిభుపురోహితుఁడ
ననురక్తి వసుదేవుఁ డనుపేరివాఁడ
నీరజవదన యానృపశేఖరునకుఁ
గూరిమిపుత్రి మక్కువ దమయంతి

యను పేరు గలిగినయలినీలవేణి
కనకశోభనగాత్రి కంజాతనేత్రి
నలునిపట్టపురాణి నయకీరవాణి
విలసితకల్యాణి విపులాబ్జపాణి
పూర్వకర్మంబునఁ బుష్కరేంద్రునకు
సర్వమహీరాజ్యసంపద లెల్ల
జూదంబులో నోడి సుదతితో నలుఁడు
మోదంబుఁ దప్పి యిమ్ముల కాన కరిగ
ననువార్త విని మమ్ము నరసి రమ్మనుచు
ననిచె భీముఁడు మేము నందంద వెదకి
యెచ్చటఁ గానక యేము చింతించి
యిచ్చటఁ గనుఁగొంటి మీదమయంతి
నని చెప్ప విని వారి నగ్గించి కరుణఁ
గనుఁగొని దమయంతిఁ గౌఁగిటఁ జేర్చి
యారాజమాత యిట్లని యేడ్వఁ దొడఁగె
నారమణీమణిఁ బాసి తల్లడించుచును
బడతి! నీ వెట్టిబాధలఁ బొందినావో
పుడమితే డెక్కడఁ బోయినాఁ డమ్మ!
యెలనాగ! యొంటిగా నెట్లు వచ్చితివి
యిల నేడు దీవుల నేలుభూపతికిఁ
దరుణివై యిటువంటితగని వేషంబు

ధరియింపవలసెనా తల్లిరో! నీకు
నవనిలోఁ బాపాత్మురాలను గానఁ
గవఁ బాసినట్టిదుఃఖముఁ జూడవలసె
నా తల్లి! నా యమ్మ! నా ముద్దు చిల్క!
యీ తెఱంగెల్ల నా కెఱిఁగింప కప్పు
డేల దాఁచితివి నన్నెఱుఁగవే తల్లి!
పోలింప నీవు నాపుత్త్రివి నీదు
తల్లియు నే నొక్కతల్లి బిడ్డలము
తల్లి నీకే పినతల్లినిఁ జుమ్ము
చెప్పవే యిటకు వచ్చినతెఱంగనిన
యప్పుడు దమయంతి యతివ కిట్లనియె
ధర యెల్ల నోడి నా ధవుఁడును నేను
నురుతరాటవులకు నోగిఁ బోవుచుండఁ
బతి కట్టుపుట్టంబుఁ బక్షు లేతెంచి
యతివేగ కైకొని యరిగె నంతటను
నా కొకకొంగు భూనాథుఁడు గట్టి
శోకంబుతో నొక్కశూన్యగేహంబుఁ
చేరితి మట నిద్రఁ జెందిననన్ను
దేరిపాఱఁగఁ జూచి ధృతిఁ దిగనాడి
నాపతి భూపతి నాపాటుఁ జూడ
నోపక నాచీర నొకకొంత చించి

తా నదికట్టుక తలఁగిన లేచి
నానాథు నెచటఁ గానక యరణ్యములఁ
బడరానిబాధలఁ బడి సిగ్గు కొంత
విడువక సైరంధ్రివేషంబుఁ దాల్చి
నీతోడఁ జెప్పక నేఁ గొల్చి యుంటి
భూతలాధిపుఁ డెందుఁ బోయెనో యెఱుఁగఁ
గనకాంగి! మఱి యిట్లు కలి యేచఁ దొడఁగ
ననవుడు నగచి మున్నక్కటా యెవరుఁ
బొందని బాధల బొందితే యనుచు
మందయానకు వేగ మణిభూషణములు
కనకవస్త్రము లొసంగఁ దలంచి నీదు
పెనిమిటి నే సంక వెదుకఁ బంపెదను
జేకొని యిప్పు డీచీర ధరింపు
శోకంబు వల దన్న సుందరిఁ జూచి
చిఱునవ్వు నవ్వి యా చిగురుఁబోఁడి
యురు దారఁ దన శోక మడఁచి యిట్లనియె
నాసరివారిలో నగుబాటు కాఁగ
నీసొమ్ము ధరియింప నే నొప్ప నెట్లు
పతి నరణ్యంబునఁ బాసి యేతెంచి
యతివేడ్క సౌఖ్యంబు లందె నటంచు
నవని జనావళి యాడదె నన్ను

ఇది యేల నా జీవితేశుండు లేని
వెనుక సౌఖ్యము లేల వేడుక లేల
యినవంశతిలకుండు హృదయేశ్వరుండు
నా పాలిదైవంబు నా ప్రాణపదము
నా పెంపు నా సొంపు నా పట్టుగొమ్మ
నా మేలిచెలికాఁడు నా నోముఫలము
నా మెచ్చునలరాజు నన్నేలురాజు
ననుఁ గూడియుండిననాఁటికి సౌఖ్య
మనుభవించెదఁ గాక యమ్మ! నేఁ డేల
అనవుడు దమయంతి నగ్గారడించి
తనయున కెఱఁగించి తద్దయు భక్తి
నను దేవముఖ్యుల నరుసఁ బూజించి
పసగలబంగారుపల్లకి నుంచి
తామరసాక్షిని దగువారిఁ గూర్చి
భీముని పురికి నంపినఁ బోయి చేరి
నలినాక్షి యప్పు డా నగరిలోపలను
బలవరింపుచు వేగ పల్లకి డిగ్గి
తన తండ్రిపదములఁ దప్పక వ్రాలి
ఘనమైనశోకాగ్నిఁ గ్రాగుచు నుండఁ
దల్లి వేగమ వచ్చి తనయతో వగవు
వెల్లువ మునిఁగి యా వెలఁది యిట్లనియె

పట్టభద్రుని జెట్టఁబట్టి యీరీతి
కట్టఁ బట్టయు లేక కలఁగితే తల్లి!
నీతోటివా రెల్ల నెమ్మదిఁ బ్రతుక
నాతి! నీ కిటు వ్రాసెనా పద్మభవుఁడు
ఒద్ద బిడ్డలు లేక యుండెడి నీకుఁ
దద్దయు గష్టంబు దార్కొనఁ జేసెఁ
తల్లి! నేఁ డిటువంటి తగని వేషంబు
లెల్ల ధరించి నీ వెట్లోర్చి తమ్మ!
సరసిజానన! భద్రశాలల డించి
యురుశైలముల నెట్టు లుంటివో యమ్మ!
చపలాక్షి! సౌధసంచారంబు విడిచి
విపినభూముల నెట్లు విహరించి తమ్మ!
నెలఁత! నీబంగారు నిలయముల్ డించి
యిలఁ బర్ణశాలల నెట్టుంటి వమ్మ!
చెలియ! నీమృదు హైసశయ్యలు డించి
శిలలపై నెట్లు వసించితి వమ్మ!
నలినాక్షి! నీప్రాణనాథుని బాసి
యెలనాగ! యడవుల నెట్లుంటి వమ్మ!
మగువ! నీ కెన యైన మగువల డించి
మృగసంఘముల నెట్లు మెలఁగితి వమ్మ!
నీరూపు నీచూపు నీసొంపు పెంపు

నీరాజ్యవిభవంబు నేఁ డెట్లు పోయె
నెలమి నీబిడ్డల నిద్దఱిఁ జూచి
విలపించు చుండు మోవెలఁది! యేవేళ
నలమహీశుఁడు తన నగరంబుఁ బాసి
పొలఁతితోఁ గాననభూమికిఁ బోయె
ననువార్తఁ దెలిసి మీయయ్య యింతింత
యనరాని ఘోరశోకాబ్ధిలో మునిఁగి
యున్నాఁడు కొలువున కొక్కనాఁ డరుగఁ
డన్న దమనుఁడు మి మ్మందంద తలఁచి
తనలోనఁ దాను సంతాపంబు నొందు
నని యేడ్చి బిడ్డల నపుడు తెప్పించి
తనయ కొప్పించిన దమయంతి చనులు
పెను పొందఁ జేపియు బిడ్డలమీఁద
గఱిగలలోఁ బాలకైవడిఁ గురిసె
ధరణీశుసతి యంతఁ దనలోనె తాను
దనబిడ్డలను జూచి తనయన్నఁ జూచి
వెనుకొన్న వగలతో విలపింపఁ దొడఁగె
భూకాంతుఁ డప్పుడు పుత్రుండుఁ దాను
శోకంబు వారించి సుత నాదరించి
యేల యేడ్చెద వమ్మ! యినకులాధిపుని
నేలీల నైనను నిటకు రప్పింతు

నని పుత్త్రివృత్తాంత మంతయు నడిగి
విని యిట్టి వగలచే వేగితే తల్లి!
యని చాల విలపించి యారాజమాత
పనిచిన పల్లకిభటులను మగుడ
ననిచి యావసుదేవు నర్చించి మ్రొక్కి
కనకవస్త్రము లిచ్చి కడు భక్తిఁ బలికె
ధరణీసురేంద్ర! మీదయచేతఁ బుత్త్రి
నరయంగఁ గంటిమి యవనిలో నింక
నలుఁ డెందు నిలచి యున్నాఁడొకో కాని
తెలియరా దింక నే తెఱఁగున నైనఁ
గొనకొని వెదకి తోడ్కొని రమ్మటంచు
నన విని దమయంతి యతని కిట్లనియె
ధరణీ నిర్జర! యయోధ్యాపట్టణమున
నరయంగ ఋతుపర్ణుఁ డనురాజుచెంత
నావిభుం డార్తి నున్నాఁడు మహాత్ము
భావించి గుర్తింప వశము గా దెవరి
కందుకు నొకయుపాయముఁ దెల్పుదానఁ
బొందుగా మీర లాపురమున కరిగి
యాఋతుపర్ణునియాస్థానమునకుఁ
జేరి యిట్లని దూఱి చెప్పఁ డానలుఁడు
సత్యవ్రతుండు భూచక్రేశ్వరుండు

సత్యంతధార్మికుఁ డైనభూవిభుఁడు
నిత్యదానవినోది నిఖిలార్థవేది
యత్యుత్తముండు దయాపరమూర్తి
యట్టిమహామహుం డడవిలోఁ దరుణి
కట్టిన వస్త్రంబుఁ గడు వేగ చించి
కొని నిద్ర వోవఁగా ఘోరదుర్గముల
ననిచి పోఁ దగునె యీయువిద నటంచుఁ
బలుకుఁ డామాటకుఁ బ్రతిమాట మీఁకుఁ
బలికిన నాతనిభావంబుఁ జూచి
చనుదెంచు నే నొక్కచందంబు మీఁకు
వెనుకఁ జెప్పెద గాక వేంచేయుఁ డనుచుఁ
బలికిన నప్పు డాబ్రాహ్మణుం డాత్మఁ
దలఁచినగతి నయోధ్యాపురి కరిగి
సరగున ఋతుపర్ణుసభఁ గాంచి యొక్క
తెఱఁగున నావను దేవుఁ డి ట్లనియె
క్షితినాథ! నలరాజు చేసినచేఁత
వితతంబుగా నొప్పువిభవంబుచేతఁ
దనమేనుఁ దెలియక దాయతో జూద
మనురక్తితో నాడి యన్నియు నోడి
యడవికి చని చని యట నొక్కచోట
పడఁతి నిద్రింపఁగఁ బై నున్నకోక

సగము చించికొని యొచ్చటి కేగినాఁడొ
పగవానిగతి నెడఁబాయ రా దనక
ఘోరకాననమునఁ గులకాంత విడిచి
పాఱి పోవుట యేమి పౌరుషం బిలను
తరలాక్షి తన కేమి తప్పుఁ గావించె
నురుదుర్గభూముల నునిచి పోవుటకు
నలుఁ డిట్టిపాపంబునకుఁ బూను ననుచుఁ
దొలుత నెఱిఁగినఁ దొయ్యలి నియ్యఁ
దలఁచునే మాభీమధరణీశ్వరుండు
వల నొప్పఁ దనవంటివాఁ డీవిధంబు
సేసిన నిఁక నేమి సేయంగవచ్చు
వాసవాదుల నెల్ల వల దంచుఁ దన్ను
గోరి పెండ్లాడినకువలయగంధి
కీరీతిఁ జేయంగ నిది కార్య మగునె
విడిచి పోఁ దలఁచిన వెలఁదిఁ దోడ్కొనుచుఁ
దడయక నాలేమఁ దల్లియిల్ సేర్చి
పోవలెఁ గాక నీపోల్కిఁ గావించి
పోవచ్చునే యల్పబుద్ధిఁ జింతించి
పెనిమిటి క్షమియించుఁ బ్రియురాలితప్పు
లనపరాధిని వీడ నగునె రానుతను
దైవయత్నంబున దమయంతిదేవి

వావిరిఁ దనతల్లి వారియిల్ సేరె
వెలఁది నీయడవిలో విడిచితి ననుచుఁ
దలఁపక యున్నాఁడు తబిసిచందమున
కటకటా! మది ఱాయిఁగాఁ జేసికొనుచు
నెట నున్నవాఁడో యెఱుఁగంగ నేర
మవనిలోఁ గలిగినయట్టి దేశంబు
లవలీల గాఁగ మే మరసి వచ్చితిమి
ఖలుఁ డైనఁ గామినిఁ గానలో విడచి
తలఁగునే కూర్చినతరుణినిఁ బాసి
తెలియక యున్నాఁడు ధీరత్వమునను
మెలనాగ దిన మొక్క యేడుగాఁ దన్ను
దలఁచి వర్తించుచు దలఁకు చున్నదియు
తలిదండ్రు లాయింతి తాపంబుఁ జూచి
ఘోరదుఃఖంబునఁ గుందు చున్నారు
కారుణ్యజలనిధి గాంభీర్యకలితుఁ
డేరీతి నున్నాఁడొ యెట్టియాపదల
బోరన నెచ్చోటఁ బొందు చున్నాఁడొ
యని యని దమలోన నడచుచు నుండ
విని ఋతుపర్ణుండు వీక్షించి పలికె
ధారుణీసురులార! తడయక యిట్లు
దూఱంగ దగదు నిర్దోషుఁ డానలుఁడు

క్షితిలోనఁ దాము చేసినపాతకంబు
వెతలఁ బెట్టక పోదు విష్ణువు నైన
నూరక మీ రేల యూరూరుఁ దిరిగి
యీరీతి వెదుకంగ నేల మీ కనుచు
కర మొప్ప నలువిభాగ్యంబునఁ జేసి
తరళాక్షి తమ తల్లిదండ్రులఁ జేరె
నది యొక్కటే చాలు నాతని కేమి
విదితుఁ డై యెందైన విహరించి యటుకుఁ
జనుదెంచుఁ గాక యేచందమున నైనఁ
జనుఁడు మీ రనిన నాచంద మంతయును
విని బాహుకుఁడు నవ్వి విప్రుల కనియెఁ
బనివడి తన కెంత పని లేనియట్లు
తను మోవ నీయక తా నొక్కమాట
ననుమానబుద్ధితో నప్పు డి ట్లనియె
నలునిగుణంబు నానలినాయతాక్షి
తెలిసియుఁ దెలియని తెఱఁగున నిట్లు
జననాథచంద్రులసభలకు మిమ్ముఁ
బనిచి దూఱించెను బాటియే తనకుఁ
బతివల్ల నేరమి ప్రాపించి యున్న
సతి తనయాత్మలో సైరించె నేని
ఇహపరసౌఖ్యంబు లింతికిఁ గల్గు

మహిమీఁద నని మహామహీంద్రు లెల్ల
నిట్టిధర్మము దించి యింతి యాత్మేశు
రట్టు సేయింతురా రాజులయొద్ద
నని యప్పు డామాట లాడినవానిఁ
గనుఁగొని నవ్వుచుఁ గడు వేగ మరలి
రమణ విదర్భభాగంబున కరిగి
దమయంతిఁ గనుఁగొని తగ నిట్టు లనిరి
విను మమ్మ! ధర యెల్ల వెదకుచు మరలి
చనుదెంచి ఋతుపర్ణుసభఁ గాంచి యపుడు
దొరసి నీనాథుని దూఱ నచ్చటను
కఱకునల్లనిరూపు ఘన మైనవాఁడు
కడు భయంకర మైనకన్నులవాఁడు
తడయక గొప్పదంతంబులవాఁడు
పరసత ముదుగుమీసంబులవాఁడు
చిఱుతవస్త్రముచేతఁ జెలు వైనవాఁడు
వెడఁద యాశిరమున వెలుఁ గొందువాఁడు
బడలుచు మెత్తనిపలుకులవాఁడు
మముఁ జూచి చూచి యామానవేశ్వరుని
క్రమ మెఱుంగక ధరాకాంతులసభల
నీరీతి దూఱంగ నిది యుక్త మగునె
యారాజవదన ఘోరాటవిలోన

నడలు చుండఁగ నాతఁ డది చూడ లేక
విడచి పోయిన మీరు వెట్టి సేయుదురె
పతివల్ల నేరమి ప్రాప్తించినపుడు
సతి తనయాత్మలో సైరించె నేని
ఇహపరసౌఖ్యంబు లింతికిఁ గల్గు
మహిమీఁద నని మహామౌనీంద్రు లెల్ల
నిట్టిధర్మము డించి యింతి యాత్మేశు
రట్టు సేయింతురే రాజులయొద్ద
నని పల్కి మఱి మాట లాడక యుండె
విని వచ్చితి మది యెవ్విధమొకో యనిన
నతఁడె నలోర్వీశుఁ డని యింతి యెఱిఁగి
హితబుద్ధిఁ దనతండ్రి కిట్లని పలికె
నతఁడె నాప్రాణేశుఁ డందు కెంతైన
మతిలోన నా కనుమానంబు లేదు
రమణాతో నాతని రప్పింప నొక్క
క్రమ మెఱింగించెద గేలి సేయకుఁడి
విరసరూపంబున విభుఁ డిందు రాఁడు
సరసత నలుని భూచక్ర మంతయును
నరసి యెక్కడఁ గాన కాత్మజ కిపుడు
వరుస రెండవస్వయంవర మని నీవు
ధారుణిలో నయోధ్యాపురీశునకు

నారూఢిగాఁ జెప్ప నతనితోఁ గూడఁ
జనుదెంచు నాథుఁ డేచందాన నైన
ననవుడు నిదికార్య మౌ నని మెచ్చి
వరుసతోఁ దనమంత్రివరులకుఁ జెప్పి
యరుదుగా వారలయనుమతి వడసి
వసుదేవు రప్పించి వసుధేశుఁ డనియె
వినువ కయోధ్యకు వేంచేసి మీరు
పలుదెఱంగులఁ గాంచి పరికించి చూచి
నలమహీపాలుని నయముగా వెదుకఁ
బుత్తెంచి యెక్కడ బొడఁగాన లేక
తత్తనూభవ యైన దమయంతి కిపుడు
వరుస రెండవస్వయంవర మని భీమ
నరపతి చాటించినాఁ డని చెప్పి
చనుదెంచు కదలుఁ డీక్షణమున ననిన
విని బ్రాహ్మణోత్తముల్ వేవేగఁ బోయి
పరఁగంగ నాఋతుపర్ణునిఁ గాంచి
సరగ ని ట్లనిరి యోజగదీశ! వినుము
నలమహీశ్వరుని నానాదేశములను
దెలియుంగ వెదకి యే దెసఁ గానలేక
గురువులయనుమతిఁ గూర్మినందనకు
వరుస రెండవస్వయంవరముఁ గావించె

భూమీశ ! మాభీమభూపాలకుండు
ధీమంతు లగుసర్వదేశాధిపతుల
సారది పిల్వంగ భూసురులను బంపె
మెఱసి యీకార్యంబు మీకెఱిఁగింప
వచ్చితి మీస్వయంవరమున కిప్పు
డచ్చుగా వేంచేయుఁ డని చెప్పి వారు
తరలి వేవేగ విదర్భపురంబు
పఱతెంచి రంత నాబాపలమాట
విని వేగ ఋతుపర్ణవిభుఁడు బాహుకునిఁ
గని ప్రీతిఁ జూచి యీకార్య మంతయును
దెలియంగ వింటివె తెఱఁగొప్ప నిదియుఁ
దెలియంగ వలయు నాదెస కేగి మనము
యరదంబునకు మంచియశ్వరత్నముల
తెఱఁ గొప్ప సవరించి తెమ్ము పొమ్మనిన
సరగ బాహుకుఁ డశ్వశాలకు నరిగి
సరిలేనిమేటియశ్వంబుల నరయ
నరిమురి వార్ష్ణేయుఁ డయ్యెడ నుండి
యురుతరయుక్తి బాహుకున కిట్లనియె
నిది యేమి బాహుక ! యీవు మున్నశ్వ
హృదయ మెఱిఁగి నీ కేల యేర్పఱుప

ననవుడు బాహుకుఁ డతని కి ట్లనియె
వినవుగా యొకవింత విశ్వంబులోన
నలరాజుపై భీమనరనాయకుండు
కలవి లేనివి కొన్ని కారులు వలికి
విపినభూములఁ బుత్రి విడువంగఁ దగునె
కుపితాత్ముఁ డని తిట్టి కోపించి వాని
నిలలోన వెదుకంగ నేల యటంచుఁ
దలఁచి యాత్మజ నైనదమయంతి కిపుడు
వరుస రెండవస్వయంవరముఁ గావించెఁ
బొరిఁబొరి రాజులు పోవుచున్నారు
మనరాజు పోవంగ మదిలోనఁ దలఁచి
ఘనరథంబునఁ దురంగముల నేర్పఱచి
నపరింపు మన్నను సవరింతు ననుడు
వివశుఁడై యాతఁడు వెడఁదకన్నీరు
దొఱఁగ నాబాహుకుతో నిట్టు లనియె
నరలోకనుతుఁడైననలమహీశ్వరున
కక్కటా యిట్టిమహాపవాదంబు
తక్కక వచ్చె నిద్ధరిణిలో నిందు
కేమి సేయఁగవచ్చు నెవ్వారి కైన
నామహానృపతి యెందరిగెనో కాక
యతని నమ్మినవారి కక్కటా యిట్టి

వెతల నొందఁగఁ జేసె విధిమాయ కాదు
వినుము చెప్పెద నాదువృత్తాంత మెల్ల
నెనయంగ నలుఁడు న న్నేలినసామి
క్షితితలాధిపు లెల్ల సేవింపఁ దనరు
నతనికి సారథి నై యున్నవాఁడ
నతఁడు జూదం బాడునట్టికాలమున
నతనిబిడ్డలను భీమావనీశ్వరుని
కడ నిల్పి భూపతిఁ గానంగ లేక
కడు దుఃఖపడుచు నిక్కడ నున్నవాఁడ
ననవుడు నామాట కాత్మలో వగచి
వెనుకొని కలి యిట్లు వేధింప నతఁడు
మనము సేసెఁదేమి మాట లేమిటికి
ననుచు వార్ష్ణేయుని నప్పు డూరార్చి
యనిలవేగము గల్గినట్టిగుఱ్ఱములఁ
గొని వచ్చి యాదిత్యకోటి తేజంబు
గల యరదంబున గ్రక్కునఁ గట్టి
పొలుపు మీఱినటెక్కెములు సవరించి
సకలాయుధంబుల సరసత నిల్పి
యకలంకమహిమ ని టాయత్తపఱచి
ధరణీశునకుఁ దెల్పఁ దద్దయు మెచ్చి

యరుదెంచి యప్పు డాయరదంబుఁ జూచి
చతురంగిబలము లసంఖ్యముల్ గొలువ
నతివేగ రథ మెక్కి యాబాహుకుండు
నరదంబు నడిపింప నరుగుచు నడుమ
నరద మొక్కింతయు నటఁ బోక నిలిచె
నది చూచి బాహుకు నదలించి నృపతి
యిది యేమి బాహుక! యీయశ్వహృదయ
మడరంగ నెఱుఁగుదు నని చెప్పి యిట్టి
బడుగుగుఱ్ఱముల నేర్పఱచి కట్టితివి
నడుచునే శతయోజనంబుల దేశ
మెడము భీమునిపురి కీపురంబునకు
ననవుండు భూనాథ యశ్వరత్నంబు
లనిలవేగంబున నరిగెడుఁ జూడు
మినుఁ డస్తశిఖరికి నేఁగకమున్న
మనము విదర్భకు మఱి పోద మనుచు
తఱుమ నారథము భూతల మెల్ల వడఁక
నరిగె ఘోరాటవి నధికదూరంబు
నీభంగి నారథం బేగెడుచోట
నాభూమిపాలకుఁ డాత్మోత్తరీయ
మిలమీఁదఁ బడుటయు నిట్లనె విభుఁడు
నిలుపు బాహుక! తేరు నిమిషమాత్రంబు

అవనిపై నుత్తరీయము జాఱి పడిన
తివిరి నీ వది యెత్తి తెచ్చి యిమ్మన్న
నవ్వి బాహుకుఁడు భూనాథునిఁ జూచి
యెవ్విధిఁ జేల మే నెత్తి యిత్తు
నుఱువేగమున నొక యోజనదూర
మరిగితి ముత్తరీయము సిక్కఁ బెట్టు
లని పల్కుచును రథ మనిలవేగమునఁ
దనుఁ దానె మెచ్చుచుఁ దఱుముచు నుండె
నరసి భూపతి వాని నాత్మలో మెచ్చి
యరిది బాహుక! విను మనుచు నిట్లనియె
విశ్వంబులోపల వెలుఁ గొందునట్టి
యశ్వలక్షణముల కధిపతి నీవు
నిక్కము నామాట నీవంటివాని
నెక్కడఁ గని విని యెఱుఁగ మెన్నఁడును
గర మక్షశోఁ దురంగంబులవిధము
నెఱిఁగి యీమర్మంబు నెఱుఁగ లేనైతి
నరు దైననాకు ని యశ్వలక్షణము
నెఱిఁగింపు నీ కొక్క టెఱిఁగింతుఁ జూడు
మల్లదె ముందఱ నతిరమ్యమైన
పల్లవంబులచేతఁ బ్రబలినయొక్క
తాడిమ్రా నున్నది దానిలో రెండు

గూడి యున్నవి పెద్దకొమ్మలం దొక్క
కొమ్మకు నూఱేసి కొమ్మలు గలవు
కొమ్మకొమ్మకుఁ బువ్వుగుత్తులు రెండు
వెలుఁగుచున్నవి దాని వ్రేళ్లైదునూఱు
లలరుచున్నవి దాని యమలపత్రములు
వెళుపులై సోగలై వెలుఁగుచున్నయవి
ఫలములు కొమ్మకుఁ బదివేలు గలుగు
నది చూచి రమ్మనే నవనీరుహాముల
హృదయం బెఱుంగుదు నీవిద్య నీకు
వినిపింతు నాకు నీవిద్య యొసంగు
మనవుడు వెఱఁగంది యాబాహుకుండు
నరదంబు డిగ్గి చయ్యనఁ దాఁడిమ్రాకు
నరయంగ నలవిభుం డవటికిఁ జనియె
నరదంబు ఋతుపర్ణుఁ డటుఁ దోలికొనుచు
నరుగుచు నుండె నలావనీనాథుఁ
డాతాఁడిచెంతకు నతివేగ మరిగి
భూతలాధీశుఁ డప్పుడు చెప్పినట్లు
లుండంగ నంతయు నొనరంగఁ జూచి
నిండువేడుకతోడ నిలిచి యున్నంత
ధరణీతలేశునితల నాఁడు పాము

గఱచిన విస మెల్లఁ గలయంగఁ బర్వ
కడఁగి యంతంతకుఁ గములింప నలుని
యొడలులోపల నుండ నోరువలేక
బొళుకు బొళుక్కన రక్తమును గ్రక్కికొనుచు
నలరాజుముందఱ నయముగా నిలిచి
కరములు ముకుళించి కలి యిట్టు లనియె
నరనాథచంద్ర! యోనలమానవేంద్ర!
యలనాఁడు నన్నుఁ గాదని దమయంతి
వలనొప్ప వరియింప వచ్చునా యనుచు
నెఱుఁగక నినుఁ బట్టి యింతకాలంబు
కరికరిఁ జేసితి గర్వంబుతోడ
నీసత్యసంపద నెమ్మితో నాకు
వాసవుం డప్పుడే వర్ణించి చెప్పె
నవనీతలేశ! నే నదియును వినక
కువలయాక్షిని నిన్ను ఘోరాటవులకు
నెడఁబాపి చొరరాని యిడుములఁ బఱపి
కడుఁ దప్పుఁ జేసితిఁ గరుణింపు నన్ను
తరుణి పతివ్రతాధర్మ మింతైన
నెఱుఁగక మిముఁ బట్టి యింతఁ జేసితిని
ధరణీతలేశ! యీ తప్పుల మఱచి
కరుణింపవే నన్నుఁ గమలాప్తకులజ!

సరసత నీసత్యసంపద కిపుడు
వెఱచి నిన్నభయంబు వేడుచున్నాఁడ
నల! నీవుఋతుపర్ణనరనాథుచెంతఁ
గలఁగుచుఁ గాలంబుఁ గడపుచు నుండు
టెఱిఁగి యాదమయంతి యీవు వచ్చుటకు
వరుస రెండవస్వయంవర మని తెలిపె
నదియుఁ దప్పనుచు నీయాత్మలో నిడకు
మదిరాక్షిఁ గైకొన మహితసంపదలు
వరుసతో నెప్పటివలె వచ్చు నిన్నుఁ
గఱచినపాముచేఁ గైకొన్నకోక
ధరియించినప్పుడే తనరు నీరూపు
వర మిత్తు నడుగుము వసుధేశ! యనిన
నృపమణి తేఁ దప్పఁడు భువి నాకు మ్రొక్కి
కడుభక్తి మీఱ నా కలి యిట్టు లనియె
కలిదేవ! సకలలోకములు నీవంటి
బలవంతమైనదైవము లేదు తెలియ
నది గాన లోకత్రయమున నాపేరు
విదితంబుఁ గావించి విఖ్యాతి నించి
చిరకీర్తి నొందఁగఁ జేసితి వరసి
కరుణతో నీయుపకారంబునకును
కడఁగి యేప్రత్యుపకారంబుఁ జేతు

తడయక యిది యేను దలఁపులోపలను
మఱవక తలఁతు సముద్రమున నొక్క
వర మిమ్ము అది నీకు వరుసఁ జెప్పెదను
వినుఁడు ధారుణి నలోర్వివిభుం డంచు
నను దలంచెడ రట్టి నరులఁ జేరకుము
సరసత నెపుడు నాచరిత మెవ్వారు
వరుసఁ జెప్పుదు రట్టివారిఁ జేరకుము
వరభక్తిచే వినువారిఁ జేరకుము
పరమాస్థ వ్రాసినవారిఁ జేరకుము
మసల కెప్పుడు తాఁడిమ్రానున నీవు
వసియించుచుండు మీ వరము దక్కఁగను
వరుసతో నింకొక్కవర మొల్ల నిపుడు
కరుణాత్మ! నీపాదకమలంబు లాన
యనవుడు భూనాథ! యాంలాగె చేతు
నని తాఁడిమ్రానున నాకలి నిలిచె
మనుజేశ! యాతాఁడిమ్రానున నెప్పు
డొనరంగ నాకలి యుండుటఁ జేసి
ధరణీసురుల్ సూచి తలఁగి పోవుదురు
నరనాథుఁ డైనయానలునిమే నెల్ల
చులకనై యుంటకుఁ జోద్యంబు నొంది
కలికి మ్రొక్కి యనుజ్ఞఁ గైకొని మరలి

యాఋతుపర్ణునియరదంబు నెక్కి
యారసి వచ్చిననాతాఁడిమ్రాను
చందంబుఁ జెప్పి యాజననాథుచేత
నందంద తరుహృదయంబు నెఱింగి
యరుదారఁ దనయశ్వహృదయంబు నతని
కెఱిఁగించి యరద మాయితముగా నడపి
పరువడి నావిదర్భపురంబుచెంత
కరుగంగ నంతంత నారథధ్వనిని
దమయంతి వినుచు మోదంబును జెంది
క్రమమున నవహేమఖచితమైనట్టి
ఘనమైనసౌధంబు గ్రక్కున నెక్కి
యనుపమగతి వచ్చునరదంబుఁ జూచి
యిట్టివేగంబున నీతేరు నడప
గట్టిగా నలమహీకాంతుఁడు గాక
యితరులచేతఁ గా వీనేర్పు లనుచు
మతిలోనఁ దలఁచి ప్రేమంబున మున్ను
మును లానతిచ్చిన మూఁడువత్సరము
లనుపమగతి నేఁటికవిపూర్ణమయ్యె
నని తండ్రికడకుఁ జయ్యన నేగుదెంచి
పనిఁ బూని యాఋతుపర్ణుని తేరుఁ
గడపఁగా సూతుఁడై గాడ్పువేగమున

వడిగ నీయల్లుఁడు వచ్చుచున్నాఁడు
బోరన నెదురుగాఁ బోయి నీ విపుడు
వారక తోడ్కొనివచ్చి వారలకు
విడిదిఁ జూపు మటన్న విని భీమనృపతి
తడయక యపుడ డమాత్యగణంబుతోడ
నెదు రేగి వారల నెలమిఁ దోడ్కొనుచు
విదిత మైయొప్పినవిడిదిఁ జూపుటయు
ఋతుపర్ణుఁ డప్పు డాగాఢమోదమున
వితతసంపద నొప్పు విడిదిని డిగియె
భీముఁ డంతట వచ్చి ప్రియతనుజాత
కామాట లెఱిఁగింప నతివ మోదించి
తనచెలికత్తెలఁ దప్పక చూచి
చని మీరు ఋతుపర్ణునారథిఁ గాంచి
నళినాక్షులార! నానాయకుం డతఁడు
నలుఁడు దుర్వేషంబు నయముగాఁ దాల్చి
చనుదెంచె నిటకు నెచ్చట నున్నవాఁడొ
పసిఁ బూని యతనిఁ దప్పక మీరు వెదకి
కని మాట లాడి వేగమె రం డటంచు
ననిచిన జలజాక్షు లాఋతుపర్ణు
విడిదికి నరిగి యావెడరూపధరుని
పొడగాన లేక యప్పుడె యింటివారిఁ

గనుఁగొని యాధరాకాంతునియరద
మనురక్తి నడపెడు నతనిరూపంబుఁ
జూడ వచ్చితిమి యాశూరుఁ డెచ్చోట
వేడుక నున్నాఁడో వినిపింపుఁ డనిన
వాఁ డదె వంటలు వండుచున్నాఁడు
చూడుఁ బొం డనిన నాసుదతులు వోయి 67(
వెడరూపధరుఁ గాంచి వికవిక నవ్వి
తడయక వార లాతని కిట్టు లనిరి
యీయెడ కేతెంచి యెన్నివత్సరము
లాయె నీనామ మే మందురు మున్న
నలుఁడవు గావె యీనరనాథునొద్ద
నలమహీనాథుఁ డున్నాఁ డంచుఁ జెప్ప
విని భీమభూపాలవిభుఁడు పుత్త్రికకుఁ
బెను పొంద రెండవపెండ్లిఁ గావింతు
ననుచు నూరక యయోధ్యాపురీశునకు
వినిపించె నలమహీవిభుఁడు వచ్చుటకు 68
నింతియె కాని యేనృపునకు నైన
నింతయు వినిపింపఁ డీస్వయంవరము
నిట్టివేషముఁ దాల్చి యీరాజమౌళి
నెట్టనఁ గొలువఁగా నీకేల నయ్యె
ఇటువంటిరూపు నీ కేలాగు కలిగెఁ

దటుకున నిన్ను మాదమయంతి వేగ
తోడుక రమ్మని దోతెంచె రమ్ము
వేడుక నిప్పుడు వేంచేయ రయ్యా !
విపినంబులో నీవు విడినది మొదలు
విపులదుఃఖంబున వేగుచున్నదియు
చెలులెల్ల దక్క నీశిశువు లిద్దఱును
కలఁగుచున్నారు శోకంబున నిపుడు
దమయంతి పడుఘోరతాప మంతయును
క్రమముతోఁ జెప్పెదఁ గరుణతో వినుము
కుడువక కట్టక ఘోరదుఃఖముల
బడుచు నేవేళ నీపాదపద్మములఁ
దలఁచుచుఁ దనలోనఁ దల్లడిల్లుచును
నెలమి నీరాకకు నెదురుచూచుచును
నున్నది మీమామ యొక్కనాఁడైన
నన్నంబు రుచి మీఱ నారగింపండు
కొలువున నుండక కుందు చున్నాఁడు
తలఁపులోపల నీవు దమయంతి నింత
దలఁపక బిడ్డలఁ దలఁపక యిట్టి
బలు వైనవిరసరూపమున నున్నావు
రయమున మది నీవు రాయిఁ జేసికొని
దయలేక యిట్లుండఁ దగునయ్యా ! నీకుఁ

బడఁతికి రెండవపరిణయం బనుచు
నడర భీముఁడు చెప్పె నని తలంపకుము
నీవు రావలె నంచు నెమ్మి నీరాజు
ఈవిధిఁ జెప్పించె నింతియె కాని
కుతలేశ ! నీమీఁదఁ గోపంబు గాదు
హితమొంద మావెంట నిపుడు ర మ్మనిన
విని ధరాకాంతుండు వెలఁదుల నపుడు
కని నవ్వె తెలియ నీగతి నిట్లు పలికెఁ
బో పొందు మఱియేటి బుద్ధులు మీకుఁ
బ్రాపించె ననుఁ జూచి భ్రమ మొందినారొ
నలుఁడు నలుం డని నయముగా నన్నుఁ
బలికెద రిట్టిరూపంబున నలుఁడు
ఉండునే యిట్లాడ నుచితంబు గాదు
పొం డింక నిందుండఁ బోలదు మీకు
నలుఁ డేడ నే నేడ నాతి నన్నేల
పిలువ నంపెను నాదుపేరు బాహుకుఁడు
వాయెత్తి వెఱతు నే వంటలవాఁడ
నై యుండు ఋతుపర్ణు నడుగుఁడు మీరు
నలుఁడు వీఁ డంచు మీనళినాక్షి దారల
నెలమితోఁ బిలిపించె నికనేటి నలుఁడు
వానిఁ దలంపఁగా వల దింక నిపుడు

నాన లే కతఁ డేల నగరికి వచ్చు
విపినంబులోపల విడిచినవిభుని
నిపు డేల తలచు మీయిందీవరాక్షి
యీరాజునర్తనం బెల్ల మీయింతి
యారసి రమ్మన్న నటఁ బోక మీరు
వల నొప్ప నిట కేల వచ్చితి రిపుడు
బలవంతుఁ డగుఋతుపర్ణు వరించి
సంతోషమునను మీచందనగంధి
యెంతయు మది సుఖయించునుగాక
నీరీతి నగడు సేయింపంగఁ దగునె
యో రాజముఖులార! యారక నేను
పలికితి నని తప్పుఁ బట్టకుఁ డింక
నలుఁడ నేఁ గాను మీనాతిదగ్గఱకు
నరుగుఁడు మీ రన్న నతివ లి ట్లనిరి
మరుగుగా నిటువంటిమాటలు వల్కఁ
దలఁతురా యిటువంటి తప్పులు మరువు
సొలవక బిడ్డలఁ జూడంగ వలదె
నలుఁడఁ గా నంచు మానక మీర లిట్లు
పలుకంగఁ దగు నయ్య పార్థివ నాథ!
ఋతుపర్ణుకడ మాఱురూపంబుతోడ
నతివేడ్క సారథి వై నీవు గొల్చి

యున్నా వటంచు మాయువిదతో మునులు
పన్నుగా మున్నె యేర్పడఁ జెప్పి రంచుఁ
దొయ్యలి తనతండ్రితోఁ జెప్పె నతఁడు
చయ్యన మీర లిచ్చటికి వచ్చుటకు
దమయంతి వల దన్నఁ దా నది వినక
ప్రముదితమతిని నెపమ్ము గల్పించి
యీఋతుపర్ణుని నిటకుఁ దెప్పించె
ధారుణీశ్వర! నీకుఁ దప్పయ్యె నిదియు
నిర వంద దమయంతిహృదయంబు నీవు
నెఱిఁగియు నిటువంటియెడమాటలాడ
వల దంచుఁ జెప్పి యవ్వనిత లందఱును
కలకంఠి దమయంతికడ కేగుదెంచి
యతఁడు సెప్పినయట్టియాచంద మెల్ల
సతి వేడ్కతోఁ జెప్ప నాదమయంతి
యతఁడె నలుం డని యాత్మలో నెఱిఁగి
మతిలోన సంతోషమగ్న యై యప్పు
డతివలఁ జూచి మీ రచ్చటి కేగి
యతఁడు వండినయట్టియన్నంబు గూర
లోకయింతఁ గైకొని యొయ్యన రండు
అకలంకమతితోడ నని చెప్పి పంపె
వారలు సనుదెంచి వంటలవాని

బోరనఁ జూచి యోపుణ్యాత్మ! యిపుడు
వారక మఱి నీవు వండినయట్టి
కూర కూడొకయింతఁ గొని రమ్మటంచు
దమయంతి మముఁ బంపె దయ సేయు మింత
విమలాత్మ! నీమది వేసారఁ గూడ
దడరంగ నలుఁడఁ గా దన్నను నన్ను
విసువ మీవేళ నేవెరవున నైనఁ
గట్టిగా నినుఁ బట్టి కడఁగి మాయింటి
కిట్టె కొంపోయెద మిది కల్ల గాదు
పడఁతు లీగతి నన్నుఁ బల్కి రటంచు
బుడమినాయక! చిత్తమున నుంచవలదు
పరఁగ నీవును మాకు బావవు గాన
సరస మాడితిమి ముచ్చట దీర ననుడుఁ
జఱునవ్వు నవ్వి మచ్చికఁ బైఁడిగిన్నెఁ
బరమాన్న మిడి మంచి పస గలకూరఁ
బెట్టి వారల నెల్ల బెదరించి తఱుము
నెట్టనఁ జనుదెంచి నీరజాననలు
పరమాన్నశాకముల్ భైమి కొసంగ
నిరుపురబిడ్డల కింత యొసంగి
పొరిఁబొరిఁ దా నింత భుజియించి మెచ్చి
తరుణుల కొకయింతఁ దగఁ బంచి పెట్టి

పరఁగ నీగతి రుచిఁ బాకంబు సేయఁ
దరుణుల కైనను దరము గా దిట్టు
లెక్కడ నేర్చెనో యిటువంటివంట
లక్కజంబుగ వండె నవనీతలేశుఁ
డక్కటా! యిట్లు సేయంగ నాకలికిఁ
దక్కక మే మేమి తప్పు సేసితిమొ
అని పల్కి యింతుల నపుడు వీక్షించి
పెను పొంద నీక మీరు బిడ్డల నతని
కడకుఁ దోడుక పొందు గ్రక్కున ననిన
పడఁతు లాసతితనూభవను దనూజు
నిరువుర నాతనియొడకుఁ గొంపోవఁ
బరువడి బిడ్డల భావించి చూచి
జననాథుఁ డాత్తలోఁ జాలఁ జింతించి
మొనయంగ బిడ్డల నెత్తి లాలించి
యక్కునఁ గదియించి యౌదలల్ నిమిరి
చెక్కిలి నొక్కి మచ్చిక ముద్దు వెట్టి
తొడలపై నిడికొని దుఃఖించు చుండ
పడఁతు లిట్లనిరి ఓ పావనచరిత!
యేమిటి కేడ్చెద వింతలో నీవు
వేమాఱు నలమహావిభుఁడను నేను
గా దంచు బిడ్డలఁ గనుఁగొని యిప్పు

డాదరంబున నెత్తి యందంద మదిని
శంకించు చున్నావు సముఖత మేము
ప్రాకటంబుగ మిమ్ముఁ బ్రార్థించి తెలియ
నడిగిన నలుఁడ నే నని చెప్పరాదె
తడయక యింతలో దాచితే నిన్ను
నలుఁడని యెఱుఁగమే నరనాథచంద్ర!
బలు వైనవిరసరూపముఁ దాల్చి యుంటి
వనవుడు వారితో నాతఁ డిట్లనియె
వనజాక్షులార! యీవడువున నాకుఁ
బెనుపొంద నిద్దఱు బిడ్డలు గలరు
మునుకొని యిట వచ్చి మూఁడువత్సరము
లాయె నాబిడ్డల నతివను జూడఁ
బోయి వచ్చెద నన్నఁ బోఁగూడ దిప్పు
డెనయ నీబిడ్డల నిద్దఱఁ దెలియఁ
గనుఁగొన్నయంత దుఃఖము వచ్చె నాకు
నీముద్దుబిడ్డల నెత్తుక మీరు
తామసింపక పొందు తల్లిదగ్గఱకు
ననిన బిడ్డలఁ గొంచు నాయిందుముఖులు
చనిచని దమయంతిసంగడి నిల్పి
యతఁడు బిడ్డలఁ జూచి యాత్మలో నప్పు
డతిదుఃఖ మొందినయలమటఁ దెలుప

విని తండ్రి నచటికి వేగ రప్పించి
యొనయంగ దమయంతి యిట్లని పలికె
నావిభుచంద మంతయుఁ దలోదరులు
భావించి యిప్పుడు పరతెంచినారు
ప్రియ మొప్ప నాతనిఁ బిలిపింపు మనిన
రయమున నాభీమరాజేంద్రుఁ డొక్క
ధరణీసురుని బిల్చి తగ గారవించి
పరువడి నాఋతుపర్ణునికడకుఁ
జని నీవు నీరధసారథిఁ జూడ
ననురక్తిఁ బుట్టి భీమావనీశ్వరుఁడు
వెలయ నీ కెఱిఁగించి వెడరూపధరుని
నలరంగఁ దోడి తెమ్మనె నని పలికి
యతనియనుజ్ఞ నాయంత నిచ్చటికి
నతివేగ తోడి తెమ్మనిన నావిప్రుఁ
డరిగి యానరపతి కవ్విధం బెల్ల
వెరవొప్పఁ దెలిపిన విని ఋతుపర్ణుఁ
డిది యేమి చిత్రమో యెఱుఁగంగరాదు
పదపడి రెండవపరిణయం బనుచుఁ
బిలిపించె నన్ను నీభీమభూపాలుఁ
డెలమి భూపతు లెవ్వ రిందు రారైరి
అని పల్కి బాహుకు నపుడు రప్పించి

పెనుపొంద భీముండు పిలిపించె నిన్ను
సరగునఁ బోయి యచ్చట కార్య మెల్ల
నెఱిఁగి ర మ్మన భూసురేశుని వెంటఁ
జనియె భీమునిఁ జూడ సత్రపుఁ డగుచు
పనిఁబూని నిషధభూపాలశేఖరుఁడు
సరగున నాభీమజననాయకుండు
పఱతెంచి యట నొక్కబంగారుపీఁటఁ
బెట్టించి యాతని బిగిఁ గౌఁగిలించి
పట్టె కూర్చుండుము పార్థివ యనిన
విని నవ్వి భీమభూవిభుఁ జూచి నలుఁడు
ఘన మైనదొరవు లోకమున నీ విప్పు
డొకరాజుఁ గొల్చిన యూడిగం బేను
అకలంక మైనసింహాసనం బెక్క
వసుధేశ! నీయంతవానికిఁ గాక
పొసఁగునే నావంటిపుణ్యహీనునకు
నింపుతో మీరు స న్నివ్వాను పిల్వ
నంపినపని నెల్ల నానతీవలయు
నని పల్కుచుండఁగా నాదమయంతి
చనుదెంచి యాతనిచందంబుఁ జూచి
యరు దంది కుంది హా యని యేడ్చు చుండ
ధరణీతలేశుఁ డాదమయంతిఁ జూచి

యిందీవరాక్షి నీ వేల యేడ్చెదవు
పొందుగా నీభీమభూపతి నీకు
భావింప రెండవపరిణయం బిపుడు
గావించు నింతలోఁ గళవళపడుచుఁ
గలఁగంగ నేల భూకాంతు లందఱును
వల నొప్ప నిచటికి వచ్చు చున్నారు
జలజాక్షి! నీమది సరిపోవు నతని
నలరంగ మఱిపెండ్లి యాడుదుఁ గాక
నాఁ డరణ్యంబుల నలుఁడు నిన్నొంటి
వీడిన నీకు నావిభునిపొం దేల
యని నిష్ఠురోక్తుల నాడినమాట
విని భీముఁ డాతని వీక్షించి పలికె
భూమీశ! నే నంత బుద్ధిహీనుఁ డనె
యీమాట నుడువ నిన్నిటకు రప్పింప
వలసి నే నిట్టిదుర్వార్తఁ బల్కితిని
నలమహీనాయక! నను దయఁ జూడు
మని వేడు చుండ నయ్యవనీశుఁ డనియె
నను నలుం డని పల్క నాయమా నీకు
నెఱుఁగవే నలుని నీ విప్పుడు భ్రమసి
మఱి పల్కుచున్నావు మానవాధీశ!
పోపొమ్ము పెద్ద వై బుద్ధులు లేవె

నీపుత్రి యైనయీనీలాభ్రవేణి
ననుఁ బెండ్లి యాడెనే నలి రేఁగి మున్ను
ఎనయ నీ వేగతి నిచ్చితి విట్లు
బలు వైనవికృతరూపము గలవాని
కలరంగ నాకును నాదమయంతి
నని పల్కి దమయంతి నప్పుడు చూచి
వనజాక్షి! నను నీవు వరియించినావె
తనపతి నెఱుఁగనితరుణియుఁ గలదె
నను నలుం డని పల్క నగరె లోకములఁ
గనకాంగి! నలుఁడ నేఁ గా దని పల్క
విని దమయంతి యావిభుఁ జేర వచ్చి
యతఁడు గట్టినయట్టియాకోకఁ జూచి
మతి నీతఁడే తనమగఁ డని యెఱిఁగి
పనవుచు నలమహీపాలునిపాద
వనరుహంబులమీఁద వ్రాలి యేడ్చుచును
రూపకందర్ప! ఈరూపంబు నీకు
ప్రాపించెనే నేఁటిపాపమెట్టిదియొ
నీరూపవిభవంబు నీవిలాసంబు
నీరాజతేజంబు నీప్రతాపంబు
నీరాజ్యభోగంబు నీమహాత్త్వంబు
నీరసికత్వంబు నీరాజసంబు

ఎక్కడఁ బోయెనో యెక్కడ నణఁగె
నెక్కడఁ దాచితి వినకులాధీశ !
అని యని శోకింప నమ్మహీవిభుఁడు
తన దేవిశోక మంతయుఁ జూడ లేక
యెలుఁ గెత్తి హా యని యేడ్చె నేడ్పుటయుఁ
దలఁకొని దమయంతి తల్లియుఁ దండ్రి
దమనుండు దాదు లందఱు నొక్కరీతి
భ్రమసినగతి విలాపము నొంద నలుఁడు
తనశోక మడచి యాదమయంతిఁ జూచి
విను కలిమాయ నీవిధ మయ్యె నన్ను
విపినభూములలోను విడిచి పోయినను
విపులాధిపతులకు వినరానిమాటఁ
బలుక వచ్చునె యెంత పని వచ్చి యున్న
నిలలోన నీమాట హీనంబు గాదె
నావుడు భూనాథ ! నాచిత్తశుద్ధి
నీవెఱుంగవె నేను నిన్నుఁ గాదనుచుఁ
బలికితి నేని నాపంతంబు వినుము
ఎలమి భూనభములు నింద్రాదిసురలు
వనఘాత్ము లగుమునుల్ హరిహరబ్రహ్మ
లినచంద్రు లెఱుఁగంగ నీవు మెచ్చంగ
ననలంబుఁ జొచ్చెద ననుడు నలుండు

విని యట్లు గావింపు వెలఁది! అటన్న
దమయంతి యాతల్లిదండ్రులఁ జూచి
క్రమమున ననలంబుఁ గావింపుఁ డనిన
విని భీమభూపతి వేవేగ మంత్రి
జనుల కాజ్ఞాపింపఁ జయ్యన వారు
కనుఁగొనువార లక్కజ మొంది వగవ
ననలగుండమును నెయ్యమునఁ గావింప
భగభగ మండెడుపావకశిఖలు
జగ మెల్ల వెలుఁగ నాశ్చర్య మై యుండె
నప్పుడు దమయంతి యాత్మేశుకడకుఁ
దప్పక వచ్చి యాదహానునిఁ గాంచి
తనపతిపాదపద్మములకు మ్రొక్కి
ఘనభక్తి మీఱంగఁ గరములు మొగిచి
చేరి యగ్నికిఁ బ్రదక్షిణముగా వచ్చి
నారుల కిది ప్రమాణం బని పలికె
ఓపావక! మహాత్మ! ఓదయాంభోధి!
శ్రీపతి సాక్షిగా జీవితేశునకుఁ
దప్పి వాక్కునను జిత్తమునఁ గర్మమున
నొప్పనిపనుల నే నూహించితేని
ప్రాకటంబుగ నన్నుఁ బట్టి దహింపు
లేకున్న నన్నుఁ బాలింపవే యంచుఁ

జెలువై నకలహంస చెంగల్వకొలను
వల నొప్పఁ జొచ్చినవడువునఁ జిచ్చుఁ
జొచ్చిన దివి నున్నసుర లెల్ల చూచి
యచ్చుగా మఱి యుప్పు డలరులవాన
లందంగఁ గురియింప నప్పు డాయగ్ని
చండ మంతయు మాని చల్ల నై యుండె
నావేళ మోదించి యారమావిభుఁడు
వేవేగ పులుఁగులవిభునిపై నెక్కి
కరముల శంఖచక్రంబులఁ దాల్చి
యురమున నిందిర నుంచి బంగారు
వన్నెదుప్పటి మీఁద నైచి నెన్నుదుటఁ
దిన్నగాఁ గస్తూరితిలకంబుఁ దీర్చి
మకరకుండలములు మహిమతోఁ దాల్చి
యకలంకమణిమయం బగుకిరీటంబు
సవరించి వన్నెభూషణములు వెట్టి
యవిరళదివ్యమాల్యములు ధరించి
యింద్రాదిదేవత లెల్ల మోదమున
సాంద్రసైన్యములఁ బార్శ్వముల నేతేర
వనజాసనుండు కైవారంబు సేయ
నినచంద్రు లక్షులై యిరుపార్శ్వములను
రయగతి నడరి బరాబరుల్ సేయ

నయముగాఁ దుంబురునారదాదులును
పంతగించుచు మేటిపాటలు పాడ
వింతగాఁ బదివేలవెలఁదులు గొల్వ
సనకసనందనుల్ సన్నుతి సేయ
ననురక్తితో ధవళాతపత్రములు
పనిఁ బూని వెంట దిక్పతులు గ్రహించి
చను దేరఁ గింకరజనులు సేవింపఁ
గారుణ్య మలర నీగతి వచ్చి నిషధ
ధారుణీపతికిఁ బ్రత్యక్షమై నిలిచె
నిలిచినఁ గనుఁగొని నెవ్వఱది నలుఁడు
చెలఁగి చేతులు మోడ్చి శ్రీహరి కనియె
జయపుండరీకాక్ష! జయ రమావక్ష!
జయ దైత్యకులశిక్ష! జయ భక్తరక్ష!
జయ కరుణాపాంగ! జయ మునిసంగ!
జయ సురవినుతాంగ! జయ పాపభంగ!
జయ సకలాధార! జయ కీర్తిహార!
జయ నిత్యశృంగార! జయమహోదార!
మునులందు సురలందు ముక్కంటియందు
జనులందు నీరేడుజగములయందు
నగములయందుఁ గాననములయందు
నిగమంబులందుఁ బాసీయంబులందుఁ

గమలజునందు సాగరములయందుఁ
గమలమిత్రునియందుఁ గమలారి యందుఁ
సర్వశాస్త్రములందు సర్వంబునందు
సర్వమయుండ వై సంచరింపుదువు
కావున నీపాదకమలముల్ నాకు
సేవింపఁగా దయఁ జేసితి విపుడు
కరుణాత్మ! నాదుభాగ్యంబున మీరు
చిరలీల నన్ను రక్షింపంగఁ దలఁచి
వేడుక లలరంగ వేంచేసినావు
పోడిమి నే మహాపుణ్యుండ నైతి
కమలాక్ష! నాభాగ్యగరిమ యెట్టిదియొ
విమలతపం బెల్ల వెలయ ఫలించె
నని సన్నుతులు సేయ నావిష్ణుమూర్తి
విని సంతసించి యావిభున కిట్లనియె
నలరాజ! నీనెమ్మనముఁ గాన లేక
కలి యంటి మిమ్మింత కష్ట మొందించెఁ
గరకరిఁ జేసెను గర్వంబుచేత
నరనాథ! ఘోరకాననభూమిలోనఁ
పడఁతియు నీవును బడలితి రకట!
యడవుల నైన గేహంబుల నైన
నెఱిఁ జరించెడివేళ నీమీఁదిభక్తి

మఱువదు దమయంతి మహిమచే నొప్పు
నట్టిగుణోజ్జ్వల నట్టిసుశీల
నట్టిపుణ్యాంగన నక్కటా! నీవు
ఈచిచ్చుఁ జొరు మని యెట్లు చూపితివి
ఈచంద్రముఖి మన మెఱుఁగనియట్లు
భూనాథ! మును నీకు భుజగవల్లభుఁడు
మానుగా నిచ్చినమహితాంబరంబు
ధరియించి నీరూపుఁ దరుణికిఁ జూపు
కెరలి నీపగతుని గెలిచి రాజ్యంబు
సంపదఁ గైకొని జనులఁ బాలింపు
మింపార నడుగు నీ కేవరం బైన
నిచ్చెద నన నలుం డిచ్చ నుప్పొంగి
యచ్చుగా నెన్నుచు ననియె శ్రీపతికిఁ
బరమాత్మ! నీపాదపద్మంబు లేను
ఉరుభక్తి సేవించు చుందు నీరాజ్య
సుఖము లింతే చాలు సుదతితోఁ గూడ
నఖిలేశ! నినుఁ గొల్చి యునరుచు వెంట
నేతెంతు నీవరం బిచ్చి రక్షింపు
మోతండ్రి! యిందుండ నోప మీయాన
యనవుడు మోదించి యావాసుదేవుఁ
డినకులాధిపునకు నిట్లని పలికె

జననాథచంద్ర! యీ జనసంఘ మెల్ల
ఘనతతో నిటుఁ గొంతకాలంబు నేలు
మటుమీఁద నీవు స్వర్గాదిభోగములు
తటుకునఁ బొందెదు తరుణితోఁ గూడి
లక్షణాకార! నీలావణ్య మిపుడు
వీక్షింప వలె నన్న విని నలుం డపుడు
భుజగేంద్రుఁ డిచ్చినపట్టంబుఁ గట్టి
నిజరూపు ధరియించె నెమ్మి నలుండు
దివినుండి ఘోషించె దేవదుందుభులు
భువిమీఁదఁ గురిసెను బువ్వులవాన
క్షీరసాగరపుత్త్రి శృంగార గాత్రి
సారంగనిభ వేణి సైకతశ్రోణి
సకలజగన్మాత సద్గుణోపేత
శుకవాహునితల్లి శుభకల్పవల్లి
యగునిందిరా దేవి యాదమయంతి
నగుమోముతోడ మన్ననఁ గౌఁగిలించి
తిలకించి నీదుపాతివ్రత్యమహిమ
కలకంఠి సకలలోకమ్ముల నిండె
నీవంటిగుణవతి నిఖిలలోకముల
నేవిధిఁ గని విని యెఱుఁగ మెన్నఁడును
పెక్కుకాలంబులు ప్రియుఁడును నీవు

మక్కువ సకలసామ్రాజ్యవైభవము
లనుభవించుచు నుండుఁ డటమీఁద మీకు
ఘనలీల స్వర్గభోగములు ప్రాపించు
నని యూరడించిన నాదమయంతి
మనమున హర్షించె మాధవుఁ డంత
ధరణీతలేశుని దమయంతి నపుడు
కరుణతోఁ దీవించి కమలతోఁ గూడ 1070
హరపద్మజాదిమహాత్ములు గొల్వ
దర మూది పరమపదంబున కరిగె
నంతట నలుఁడు పూర్వాకృతిం బొదలి
సంతసం బలర నచ్చట నున్నయట్టి
గురుగుణోన్నతుఁ గులగురువు వసిష్ఠు
వరభక్తి వలగొని వచ్చి కేల్మోగిచి
వేవేలతెఱఁగుల వినుతు లొనర్చి
సేవింప నలరి వసిష్ఠుఁ డిట్లనియె
జననాథ! నీసత్యసంపద కలరి
ఘనతరంబుగ రమాకాంతుఁ డేతెంచి 1080
ప్రత్యక్షమయ్యె నీభాగ్యమూలమున
సత్యమే ధర్మంబు సత్యమే జయము
సత్యమే పెన్నిధి సత్యమే బలిమి
సత్యంబు గలిగినఁ జాలు వేయేల

పటుతరంబుగ నిండి ప్రబలెను మఱియు
వసుధలో మావంటివారికి నెల్ల
వసుమతీనాయక! వన్నెఁ దెచ్చితివి
ఇది యొక్కటే చాలు నిఁక మాట లేల
పొదలిన వేడ్కతోఁ బుష్కరాధిపుని
నవలీలఁ గెల్చి యాయువని యంతయును
ప్రవిమలగతితోడఁ బాలింపు మనియె
నప్పుడు ఋతుపర్ణుఁ డరుదెంచి నలునిఁ
దప్పక కనుగొని ధర సాగి మ్రొక్కి
యినకులాధీశ! ని న్నెఱుఁగంగ లేక
మునుకొని నీచేత మ్రొక్కు లందితిని
నీమహామహిమ వర్ణింపనావంటి
సామాన్యు లగువారు చాలరు ధాత్రి
నీదివ్యమహిమచే నీరజోదరుని
పాదాబ్జములఁ జూచి ప్రణుతింపఁ గలిగెఁ
దనర నే నందున ధన్యుండ నైతి
మనుజేశ! యీతప్పు మన్నించి నన్నుఁ
గరుణ నీబంటుగాఁ గాచికొ మ్మనిన
నరనాథుఁ డైనయానలచక్రవర్తి
వెర వొప్ప ఋతుపర్ణు వీక్షించి పలికె
ధరణీశ! కలిమాయఁ దగిలి నీయొద్ద

నిలిచినమూఁడేండ్లు నెమ్మి సౌఖ్యములు
కలిగించి ప్రోచితి కరుణతో నన్ను
నీవు పుణ్యుండవు నీవు ధన్యుఁడవు
కావున నినుఁ గొల్వఁ గలిగె భాగ్యములు
వసుధేశ! నీవిందు వచ్చుటఁ జేసి
యసదృశకోటిసూర్యప్రభాపటల
కలితుఁ హాహరిఁ జూడఁ గలిగె సత్కీర్తి
వెలసె సామాన్యుండవే నీ వటన్న
విని ఋతుపర్ణుండు విభునకు మ్రొక్కి
తనబలంబును గొని తనపురి కరిగె
దమయంతినిఁ గుమారు తనయ నూగార్చి
క్రమమునఁ బొదలి సుఖం బుండి యంత
నలమహీపాలుఁ డున్నతభక్తి మామ
తెలిపినరిపుని వధింపఁగా దలఁచి
కరులు రథంబులు ఘనతురంగములు
దొగలు సామంతమంత్రులు భటుల్ గొలువ
నాదిత్యసంకాశ మగురథం బెక్కి
మోదంబుతో వాద్యములు పెక్కు మ్రోయ
తనదేవి నట నుంచి తనర వసిష్ఠుఁ
డనురక్తి దీపింప నతనితోఁ గూడ
రయమున నిషధపురంబున కరిగి

నయ మొప్పఁ బుష్కరనరనాథుఁ గాంచి
ధారుణీనాథుండు దప్పక పలికె
నారూఢి మున్ను నే నాకలి దేవు
మాయచే నోడితి మహి యెల్ల నీకు
నాయతంబుగ నిచ్చి డట్టిజూదంబు
నాడుము నీ వన్న నాతఁ డిట్లనియె
నాడంగఁ దగ దిచ్చ డాకలి దేవు
ననుమతిలేక నరాధిప! యనిన
విని నవ్వి నలమహీవిభుఁ డిట్టు లనియె
తడయక నీవు జూదం బాడ నేని
విడువుము రాజ్యంబు వేగంబ యిపుడు
కాకున్న నాతోడఁ గయ్య మొనర్పు
మాకలి యిట కింక నరుదేరఁ డనిన
నలునితోఁ దొడరి యంతట జూద మాడి
కలి తోడు లేమి భాగ్యము వెల్ల నోడి
నగరంబు వెడఁబాసి నాతియుఁ దాను
బోగలుచుఁ బుష్కర భూపాలుఁ డరిగె
నప్పుడు వార్ష్ణేయుఁ డయ్యెడ కప్పు
డొప్పగాఁ జనుదెంచి యొగిఁ గొల్చి యుండె
నావసిష్ఠమునీంద్రుఁ డవుడు భూసురుల

రావించి భీమభూరమణునికడకుఁ
జని మీర లిక్కడిచంద మంతయును
వినిపించి దమయంతి వేవేగ తెండు
చనుఁ డంచుఁ బంచిన జగతీసురేంద్రు
లనురక్తితోఁ బోయి యావిదర్భునుఁ
గని యది వినిపించి కడుసంతసింప
ననఘాత్మ! నీపుత్త్రి నంపింపు మనిన
విని భీమభూపతి వేవేగ తనదు
తనయునితోఁ గూడఁ దగురథం బెక్కి
నిద్దంపురతనాల నిగనిగల్ గల్గు
పెద్దపల్లకిలోనఁ బిడ్డలతోడ
దమయంతి నిడికొని తనవారు గొల్వ
రమణతో నిషధపురంబున కరిగి
నలరాజచంద్రునినగరికిఁ బోయె
నలరుచు నంతలో నావసిష్ఠుండు
కర మొప్ప నగరు శృంగారింపఁ బనిచి
యరయంగ నేబదియాఱు దేశముల
రాజుల రప్పించి రహి నదీనదుల
యాజలనిధి జలం బర్థిఁ దెప్పించి
నలరాజు సింహాసనంబున నిలిపి
యెలమి మంత్రులు పురోహితులును గొలువ

మంగళతూర్యముల్ మద్దెలల్ మ్రోయ
శృంగారవతులైనచెలులు సేవింప
నరుదైనరత్నసింహాసనంబునను
ధరణీశ్వరునిచెంత దమయంతి నునిచి
హోమాదికృత్యంబు లొనర జేయించి
శ్రీమించఁగా నభిషేకంబుఁ జేసి
కర మొప్పఁ బట్టంబు గట్టిన యంతఁ
జిరలీల రాజ్యంబు సేయుచు నుండె
నావిదర్భేశున కానలరాజు
వావిరి సాష్టాంగవందన మిడిన
మన మార దీవించి మన్నన వడసి
తనయుని గూడి విదర్భేశుఁ డరిగె
నలుఁ డంతఁ దనగురునాథునిపాద
జలజంబులకు మ్రొక్కి సన్నుతి సేయ
కనుఁగొని సంతోషకలితుఁడై యతఁడు
ఘనకృపారస మొల్కఁ గాను దీవించి
వల నొప్పఁ దనతపోవనమున కరిగె
నలరుచు నపుడు దేశాధినాయకులు
వినయంబుతో నలవిభునకు మ్రొక్కి
వినుతులు మఱియుఁ గావింప మోదించి
బహురత్నభూషణాంబరము లొసంగ

మహీనాథులెల్ల సమ్మదమును బొంది
పొందుగాఁ దమతమపురవరంబులకు
నందఱు చని రంత నారాజవిభుఁడు
దమయంతి దాను మోదంబున మించి
సుమబాణుకేళిలోఁ సొంపు దీపింప
నాచంద్రధరసురేంద్రాదులు వొగడ
భూచక్రి మెల్ల నేర్పున నేలుచుండె
నని యిట్లు బృహదశ్వుఁ డాధర్మజునకుఁ
బెను పొంద మున్ను దా విన్నమార్గమున
వరుసతో నలచక్రవర్తిచారిత్ర
సరసత గ్రంథవిస్తారంబు గాఁగ
వినుతవాక్యంబుల వెలయుంగఁ జెప్పె
ననుచు వాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రితహితోదయుఁడు
కరుణాపయోనిధి కందాడదొడ్డ
యాచార్యునకు శిష్యుఁ డైనట్టివైష్ణ
వాచారమూర్తి సత్యదయాపరుండు
పొలుపుమీఱిన చక్రపురి దొడ్డఘనుఁడు
వల నొప్ప నతనికి వరకూర్మితనయుఁ
డకలంకమానసుం డతిసత్వధనుఁడు
సకలకవిత్వవాచావిశారదుఁడు

దనర నాతనికి విద్యాప్రవీణుండు
జనలోకనుతుఁడు సజ్జనలోకహితుఁడు
తిరువేంగళాచార్యధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనికి నే నాత్మసంభవుఁడ
నమలమానసుఁడ విద్యావిశారదుఁడ
రమణ నే వరకవి రాఘవాహ్వయుఁడ
నరహరిఘటికాద్రిసాధుని పేర
బరువడి నే నాంధ్రభాషల వెలయ
నవనిలోఁ గవిరాజులై నట్టిసరస
కవులసత్కృప నాకుఁ గలుగుటఁ జేసి
యలరార నీనలాహ్వయుని చరిత్రఁ
దలచి చెప్పితిని యుత్తరభాగ మెలమి
వలనొప్పఁ జదివిన వ్రాసిన వినిన
జనుల కాయుర్భాగ్యసంతతుల్ గలిగి
ఘను లనఁ దనరి ప్రఖ్యాతిని గాంతు
రీచక్రవర్తినలేంద్రుచారిత్ర
మాచంద్రతారార్కమై యొప్పఁ గాత.

నలచరిత్రము, ఉత్తరభాగము సర్వము
సంపూర్ణము.

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.—1916.

# ఆంధ్రగ్రంథములు.

---

| | ప్రతి 1-కి | రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతము— | | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 1 | 12 |
| ఆరణ్యపర్వముగల సంపుటము | ... | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములుగల సంపుటము | ... | 1 | 12 |
| శాంతిపర్వము ,, | ... | 1 | 12 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 0 |
| ఆంధ్రభారత విమర్శనము | ... | 0 | 8 |

(గ్రంథము 7 సంపుటములలో పూర్తియగును.)

తక్కిన సంపుటములు అచ్చగుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| లంకావిజయము (రావణపమ్మీయము), | | | |
| సటీకము, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 8 |
| కృష్ణరాయవిజయము, కుమార. ధూర్జటికృతము, | | | |
| చక్కనికూర్పు | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, | | | |
| చక్కనికూర్పు | ... | 1 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు | | 2 | 8 |

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| గోపీనాథరామాయణము | | (అచ్చగుచున్నది.) | |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగముద్రితము | ... | 0 | 8 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | ... | 3 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు | ... | 4 | 0 |
| డిటో మేలుప్రతి, రెండువాల్యములు | | 4 | 12 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యములు | | 5 | 8 |
| మనుచరిత్ర, సటీక. వావిళ్ల. రామస్వామి శాస్త్రి గారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలు కాగితముల మీఁద స్ఫుటమైన అక్షరములతోచక్కగ ముద్రించి యున్నాము. శ్రీకృష్ణ దేవరాయలయొక్కయు, రామస్వామి శాస్త్రిగారి యొక్కయు ప్రతిమలు యిందుగలవు | ... | 1 | 8 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాగితములు, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కగ మరల ముద్రించినారము | ... | 3 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, పళసరికాగితములు ... | 1 | 8 |
| రాఘవపాండవీయము,సటీకము, చక్కనికూర్పు | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవికృతము | 0 | 4 |
| సారంగధరచరిత్ర, చేమకూర. వేంకటకవికృతము | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవిది | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవిది | 0 | 4 |
| రసికజనమనోభిరామము ,, ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, కూచిమంచి. తిమ్మకవిది ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము ,, .. | 0 | 8 |
| పారిజాతాపహరణము, చక్కనిప్రతి ... | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | 0 | 3 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు ... | 0 | 14 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| సీతారామాంజనేయసంవాదము, సటీకము (అచ్చుగుచున్నది.) | ... | 1 | 4 |
| పంచతంత్రము, నారాయణ కవికృతము, క్రొత్తకూర్పు | | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ,, | 0 | 8 |
| అప్పకవీయము, చక్కనికూర్పు | ... | 1 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | | 0 | 12 |
| సులక్షణసారము, సటీకము | ... | 0 | 8 |
| భాగవతసప్తమస్కంధము | ... | 0 | 4 |
| సప్తమస్కంధము, సటీకము, చిన్నసైజు, చక్కనికూర్పు | | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీకము (భాగవతములోనిది) | | 0 | 4 |
| డిటో ,, (గట్టుప్రభుకృతము) | | 0 | 6 |
| గజేంద్రమోక్షము, సటీకము, చక్కనికూర్పు, మంచికాగితములు | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| రుక్మిణీకల్యాణము, సటీకము, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీకము, చిన్నసైజు | ... | 0 | 6 |
| రాజయోగసారము, ద్విపద, శ్రీతరిగొండ. వెంకమ్మగారిది | | 0 | 4 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| శ్రీనాథునివీథినాటకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటిప్పణము | ... | 0 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు, 1200 పద్యములు | | 0 | 4 |
| దసరాపద్యములు | ... | 0 | 1 |
| మాతృశతకము | ... | 0 | 1 |
| సుమతిశతకము, సటీకము | ... | 0 | 2 |
| కుమారీశతకము ,, | ... | 0 | 2 |
| దాశరథిశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, | ... | 0 | 2 |
| భాస్కరశతకము ,, | ... | 0 | 3 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 2 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 1 |
| రామలింగేశశతకము, అడిదము. సూరకవిది | ... | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి. తిమ్మకవిది | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రు. | ఆ. |
|---|---|---|---|
| నారాయణశతకము | ... | 0 | 2 |
| కాళహస్తిశతకము ("సాంబశివా మహాప్రభో") | | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | ... | 0 | 2 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము... | | 0 | 1 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము. వేంకటరంగశాస్త్రికృతము | | 6 | |
| సంగ్రహరామాయణము, సులభశైలి, శ్రీశేషాద్రిశర్మకృతము | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 0 | 12 |
| శివాజీచరిత్ర | ... | 0 | 6 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర ,, | ... | 0 | 2 |
| దాదాభాయినౌరొజీచరిత్ర ,, | ... | 0 | ' |
| అనిబిసెంటుచరిత్ర ,, | ... | 0 | 1 |
| వివేకానందస్వామిజీవితము ,, | ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 1 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీబుద్ధచరిత్రము | ... | 0 | 4 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| దరీని వేదితజీవితము ... | 0 | 1 |
| ంరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు... ... | 0 | 2 |
| గై క్వారుగారి ఉపన్యాసములు ... | 0 | 2 |
| ్నుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము, కొత్తకూర్పు ... | 1 | 4 |
| పబునీతికథలు, కొత్తకూర్పు, 1 వ భాగము | 0 | 6 |
| డిటో 2 వ భాగము | 0 | 8 |
| స్పియర్ నాటకకథలు, సులభశైలి ... | 1 | 4 |
| క్లైవు జీవితము ... | 0 | 8 |
| పరజాడ, శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 2 | 8 |
| యర్ నైట్సుకథలు, చక్కనికూర్పు, సులభశైలి | 1 | 4 |
| క్కపగటిమక్కలకథలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| ద్దరామన్నకథలు ... | 0 | 2 |
| వణచరిత్ర, వచనము ... | 0 | 1 |
| మత, నవల, నూతనముద్రితము ... | 0 | 12 |
| ,, ... | 0 | 6 |
| రస ,, ... | 0 | 10 |
| ంజని ,, ... | 0 | 6 |
| రాయి, చక్కనినవల ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| టిప్పుసుల్తాన్, నవల ... | 1 | 4 |
| ఉన్మాదిని ,, ... | 0 | |
| రాధారాణి ,, ... | 0 | [illegible] |
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | [illegible] |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది, చిన్నసైజు... | 0 | |
| పంచతంత్రము, వచనము, సులభశైలి, పెద్దచ్చు | 0 | |
| రామదాసచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీరామదాసుగారిప్రతిమగూడకలదు ... | 0 | 6 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు | 0 | 6 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక, శుద్ధప్రతి ... | 0 | 6 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది ... | 0 | 12 |
| అద్వైతసంగ్రహము ... | 0 | 2 |
| నలచరిత్రము, ద్విపద ... | 0 | 14 |
| శబ్దార్థచంద్రిక, అకారాది ఆంధ్రనిఘంటువు... | 2 | 8 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీగురుజాడ. శ్రీరామమూర్తిగారిది | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

192, ఎస్ప్లనేడ్, చెన్నపురి.